

భవానీశంకరులు

కామగ్రంథమాల.౧ వ గ్రంథము.వెల రు ౧౨.

కొక్కోకముకళాశాస్త్రము

# రతి రహస్యము

పండితప్రతి.

(Confidential Edition for Scholars)

గ్రంథకర్తలు:

కొక్కోకుఁడు.ఎల్లన.



# ప్రథమాశ్వాసము

## జాత్యాధికారః
## ప్రథమ పరిచ్ఛేదః

దరులకు దైవతంబు సుఖధాముఁడు చిత్తభవుండు వామసం
చరణుఁడు శ్రీకరుండు గుణసాగరు మల్లయఁ బ్రోచుఁ గావుతన్.

శ్లో.పరిజనపదే భృంగశ్రేణీ, పికాః పటునన్దినో
హిమకరసితచ్ఛత్రం, మత్తద్వీపో మలయానిలః।
కృశతనుధనుర్వల్లీలీలాకటాక్షశరావళీ
మనసిజమహావీరస్యోచ్చైర్జయంతి జగజ్జితః॥

చ.పరిజనకోటి తుమ్మెదలు, పాటకవర్ణము గోకిలాళి, చం
దురుఁ డుసితాతపత్త్రము, వధూతనుమధ్యము విల్లపాంగముల్
శరములు, గంధసింధురము చల్లనివాయువుఁ గాఁగ లోకము
ల్బరఁ గొని గెల్చు మన్మథుఁడు భైరవమల్లయ కిచ్చు కోరికల్.

సీ.వాత్స్యాయనుని కళావల్లభుఁ గీర్తించి
ఘోణికాపుత్త్రుఁ బ్రవీణుఁ గొల్చి
కూచమారుని రసకోవిదుఁ బ్రార్థించి
నందీశు విద్యాదినాథుఁ దలఁచి
మన్మథరసికసన్మాన్యుని గొనియాడి
శాస్త్రజ్ఞుశివకియ్యు సన్నుతించి
వైశ్యదత్తుని రతివరమూర్తిఁ బొడఁగాంచి
భవ్యు కాంచీనాథుఁ బ్రస్తుతించి

ఆ.మునిసనత్కుమారు ధనదుతనూభవు
నశ్వినుల జయంతు ననుసరించి
రావిపాటితిప్పరాజాదిముఖ్యు శృం
గారకవుల నెల్ల గారవించి.

గీ.అని యిష్టదేవతాప్రా
ర్థనముఁ గళాశాస్త్ర సుకవి రాజశ్రేణిన్
వినుతియును జేసి నా నె
మ్మనమునఁ ద్రిపురాంబ నిల్పి మహితప్రౌఢిన్.

సీ.శ్రీవత్సగోత్రప్రసిద్ధసంభూతి నా
పస్తంబసూత్రప్రశస్తఘనుఁడ
గురుదయానిధియైన కూచనమంత్రికి
నంగనామణి ముత్తమాంబికకును
దనయుండ సత్కవీంద్రసుమాన్యచరితుండ
శివకృపాసుజ్ఞానశేఖరుండ
నారూఢవిద్యాచలానందయోగీంద్ర
శిష్టప్రచారవిశిష్టఘనుఁడ

గీ.నెఱ్ఱయామాత్యుఁడను సత్కవీంద్రహితుఁడఁ
గలితవాక్ప్రౌఢిఁ గొక్కోకకవివరుండఁ
జతురమతితోడ రతికళాశాస్త్ర మిదియు
దెనుఁగు గావింతు రసికులు వినుతిఁజేయ.

వ.అని తలపోయుచున్న యవసరంబున—

సీ.తనకీర్తికామిని దశదిశాభామినీ
స్మితకపోలములకు మెఱుఁగుఁబెట్ట
తనభవ్యమూర్తి కాంతామదాలస నవ
వీక్షణద్యుతులకు విందొనర్ప
తనవైభవంబు బాంధవకవిగాయక
మానసాంతరముల మఱుఁగుఁజేయ
తననీతిగరిమయు ఘనతరాంకుశము దు
ర్మంత్రికుంజరముల మదము లణప

గీ.చండలాంబ మహాలక్ష్మి సత్కృపాప్ర
సాదసాధితవైభవసాంద్రయశుఁడు
మంత్రిమాత్రుఁడె భైరవమంత్రిసుతుఁడు
మంత్రనిధి కుంటముక్కల మల్లమంత్రి.

క.ఒకనాఁడు రతిరహస్య
ప్రకటకళాశాస్త్రసుకవిబంధురతరుణీ
నికరములు గొల్వ విద్య
ప్రకటితుఁడై నన్నుఁ బిలువ బనిపియు ననియెన్.

క.నవఘంటాసుత్రాముఁడ
వవధానకవీశ్వరుండ వగుదీవు మదిన్
దివికై రచియింపఁ బూనిన
కవితామణిభూషణంబు గావలె నాకున్.

క.జల్లులు పదపూరణములు
బొల్లులు నసమర్థములును బునరుక్తములున్

జెల్లని వళిప్రాసంబులు
నల్లికలును జొరవు సుపథమగు నీ కృతికిన్.

వ.అని గౌరవంబున నగనకాభరణకర్పూరతాంబూలం బొసం గినం గైకొని నిజనివాసంబునకుం జని యొక్కశుభముహూర్తంబునఁ గావ్యంబుఁ జెప్ప నుద్యోగించి తత్కథాసూత్రంబునకుఁ బాత్రంబైన కృతీశ్వరు నభివర్ణించెద—

సీ.మునిపరాశరగోత్రముఖ్యుఁ డగు గుంటు
    పలి పెరుమళిరాజు భాగ్యమూర్తి
యారాజవర్యును కాత్మజుండై యొప్పు
    గురుధైర్యనగరాజు కొమ్మరాజు
కొమ్మయమంత్రికిఁ గూర్మినందనుఁ డయ్యె
    మనుమయామాత్యుఁ డమాత్యమౌళి
యామనుమయ్యకు నవతరించిరి మెండు
    కొండూరు చిట్టిన కోవిదుండు

గీ.పొసఁగ నోబళమంత్రి తత్పుత్త్రుఁ డయ్యె
దెలఁగయామాత్యుఁ డష్టదిగ్దీపకీర్తి
యట్టి తెలఁగయ్యకును బుట్టె నసమయశుఁడు
భైరవామాత్యుఁ డరిమంత్రిభంజనుండు.

గీ.ఘనులు నాచనసోమన కాళహస్తి
మంత్రిగోపన సింగనామాత్యవరులు
తమ్ములుగ రూపకీర్తిప్రతాపములను
బ్రబలె నిల కుంటముక్కల భైరవుండు.

ఆ.అట్టి భైరమంత్రి కనుకూలభోగ్యసౌ
భాగ్యగరిమ వెలయు పత్ని యయ్యె
నక్కమాంబ తనయు లనఘుల నలువురఁ
గనియె గుణసముద్రు లనుచుఁ బొగడ.

క.వారెవ్వ రనిన గంగన
ధీరుఁడు పెదమల్లనయును దీప్తయశశ్శ్రీ
ధారుఁడు మల్లామాత్యుఁడు
భైరవుఁడు ననంగ నఖిలభాగ్యోన్నతులై.

వ.వారల కగ్రజుండు—

సీ.మాధవ మాధవో మాధవులకు సాటి
    సౌందర్యవిక్రమసంపదలను
గోపాల గోపాల గోపాలురకు నెన
    భోగసాహసకళాభూషణముల
గాంగేయ గాంగేయ గాంగేయులకుఁ బ్రతి
    వర్ణప్రతాపపావననిరూఢి
కుంభజ కుంభజ కుంభజులకు సాటి
    రణతపస్సామర్థ్యరాజసముల

గీ.నితరజనముల సరిపోల్ప నెట్లు వచ్చు

భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములఁ
గుటిలరిపుమంత్రిహృద్భేది గుంటముక్క
గంగయామాత్యునకును దానకర్ణునకును.

వ.అతని సహోదరుండు—

సీ.హరిపదధ్యానతత్పరుఁడు చండలమహా
లక్ష్మీప్రసాదైకలబ్ధవరుఁడు
రహి గజపతిమహారాయ లిచ్చిన సమం
చితమహాపాత్రప్రసిద్ధయశుఁడు
నాజమాఖానరాయనిచేత నొడయుఁడై
వినుకొండ దుర్గ మేలిన ఘనుండు
కృతి వన నిక్షేప పృథు తటా కాలయ
తనయాది సప్తసంతానపరుఁడు

గీ.మునిపరాశరగోత్రసంజనితుఁ డార్య
సేవ్యతిరువేంగళాచార్యశిష్యుఁడు నగు
మంత్రి పెరుమాళ్ళకొమ్మయ మనుమయోబ
మంత్రి తెలఁగయ్య భైరవమల్లమంత్రి.

గీ.సన్నుతావాస జగదంబ చండలాంబ
తనకు నిలవేల్పుగా భూమిఁ దనరినాఁడు
గజపతియు నశ్వపతియును గారవింప
మహిని విలసిల్లె భైరవమల్లమంత్రి.

## షష్ఠ్యంతములు

క.ఇటువంటి మంత్రినిధికిని
బటుతరవిద్యావిశేషపాండిత్యునకున్
కటక కలుబరిగ ఢిల్లీ
కటకస్తవనీయసుగుణగణనిత్యునకున్.

క.కాంతామోహననవరతి
కాంతునకును బాహుసత్త్వగర్వితరిపువి
క్రాంతున కరిసామజమా
వంతునకును సుకవిగహనవాసంతునకున్.

క.ధీరునకు రతిరహస్యవి
హారునకుం బంచదశసమంచద్విద్యా
కారునకును సుగుణగణా
ధారునకును మంత్రిమకుటతటఘటితునకున్.

క.తిరుమలతిరువెంగళగురు
పరమకృపాలబ్ధవిభవభాగ్యాత్మునకున్
హరిచరణకమలమధుకర
వరమతికిని జటులగంధవారణకృతికిన్.

క.శ్రీచండలాంబవరకరు

ణాచరితున కతులమాననానావిభవ
ప్రాచుర్యశేముషీమహి
మాచారున కతిమనోహరాకారునకున్.

క.లక్కాంబానందనునకు
భక్కుండ వరకరుణాదిభవ్యమనీషా
ప్రక్కంతకహరునకు బల
దిక్కరతీంద్రునకు మల్లధీమంతునకున్.

క.సల్లలితవాగ్విలాసో
త్ఫుల్లరతీప్రభవనవ్యభూషణభాహో
హల్లీస కుంటముక్కల
మల్లామాత్యునకు గురుసమానసుమతికిన్.

వ.అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కొక్కోకం బను గళాశాస్త్రంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన—

శ్లో.కొక్కోకనామ్నా కవినా కృతోఽయం
శ్రీవైన్యదత్తస్య కుతూహలేన
విలోక్యతాం కామకలాసుధీరాః
ప్రదీపకల్పో పచసాం విగుంభః||

క.శ్రీవైన్యదత్తకౌతుక
భావితకొక్కోకసత్ప్రబంధనగుంభా
ప్రావీణ్యాధిపకల్పక
ళావాక్యము లెఱుఁగుఁడీ తలంపున రసికుల్.

తా.వైన్యదత్తునిచేత చెప్పంబడిన కొక్కోకమను శాస్త్రమందలి కళా వాక్యములను రసికులైనవారు తెలిసికొందురుగాక.

శ్లో.భూయోభూయో మునువరగవీరర్థదుగ్ధాని దుగ్ధ్వా
నిర్మథ్యర్థం ప్రణిహితధియా సోయమాదాయ సారః।
స్వాదుః పథ్యో లలితరమణీయయౌవనాభోగభోగ్యో
ముఖ్యో దేవైరపి బహుమతస్సేవ్యతాం పండితేంద్రాః||

చ.యతివరవాక్యధేనువుల నప్పటికప్పటి కర్థదుగ్ధముల్
బితికి మథించి పద్యరుచి భీరుమనోహరభోగభాగ్యముల్
శతముఖుఁ డాదిగా సురలు సన్నుతిఁ జేయఁగ నొప్పు సార ము
న్నతముగఁ జేసినాఁడ కవినాథులు చేకొనుఁ డాత్మవీథులన్.

తా.ధేనువుల పాలు పితికి మథించి వెన్న నెత్తినట్టులనే దేవేంద్రుడు మొదలగు దేవతలచే స్తుతింపతగిన స్త్రీభోగసౌఖ్యకరములైన వైన్యదత్తుని వాక్యార్థములను గ్రహించి యీకవిచే ప్రకాశింపజేయదగిన యీశాస్త్రమును కవివరు లంగీకరింతురుగాక.

## ఈ శాస్త్రమునకు ఫలము

శ్లో.అసాధ్యాయాః సుఖం సిద్ధిః సిద్ధాయాశ్చామరంజనమ్
రక్తాయాశ్చ రతిస్సమ్యక్ కామశాస్త్రప్రయోజనమ్||

ఆ.తన కసాధ్యమైన తరుణి సాధించుట
దొరకెనేని తన్ను మఱపుఁగొనుట
మేలుగలుగు సతుల మెలపంగ నేర్చుట
కామశాస్త్రమునకు గలుగుఫలము.

తా.తనకు సాధ్యముకాని స్త్రీనయినా సాధ్యురాలయ్యేటట్టు చేసుకొని యనుభవించుట యీశాస్త్రమునకు ఫలమని తెలియదగినది.

శ్లో.సంసారే పటలాన్తతోయతరలే సారం యదేకం పరం
యస్యాయం చ సమగ్ర ఏవ విషయగ్రామప్రపంచో మతః।
తత్సౌఖ్యం పరతత్త్వవేదనమహానందోపమం మన్దధీః
కో వా విన్దతి సూక్ష్మమన్మథకళావైచిత్ర్యమూఢో జనః॥

చ.భవముఘటాంతతోయచలభావము దీనికి సార మొక్కటే
వివిదసుఖప్రపంచమతివిభ్రమ మందులసౌఖ్య మాత్మలోఁ
దవిలినచర్మనిర్మితము దాని నెఱుంగఁడు మందబుద్ధి హృ
ద్భవరతిచిత్రభోగములు భాగ్యవిహీనుల కెట్లు చొప్పడున్.

తా.మనిష్యదేహము నొందుటకు ఫలము రతిసుఖక్రియాదులు. కావున తదనుగుణములగు హావభావములను బొందుటయె మిక్కిలి జాణతనము. అది హావ భావావిలాసవిభ్రమాది గుణహీనులైన మందబుద్ధిగల నిర్భాగ్యులకు సిద్ధింపనేరదు.

శ్లో.జాతిస్వభావగుణదేశజధర్మచేష్టా
భావేంగితు వికలో రతితంత్రమూఢః।
లబ్ధ్వాపి హి స్థలతియౌవనమంగనానాం
కిం నారికేళఫలమాప్య కపిః కరోతి॥

ఉ.ఇంతుల జాతిచేష్టితగుణేంగితదేశజనానుధర్మవి
శ్రాంతు లెఱుంగలేని యతిజాత్యున కంగన యబ్బెనేని వి
భ్రాంతి వహించుఁగాని రతిపాక మెఱుంగఁడు రాజనిష్కటా
భ్యంతరనారికేళఫల మబ్బిన వానరుఁ డేమి చేసెడిన్.

తా.స్త్రీలయొక్క జాయి, క్రియ, గుణము, హృదయము, సత్వము యెఱుంగని మూఢునకు నంగన దొరికినయెడల టెంకాయ దొరికిన కోతిరీతిగా లాలనాదిక్రియ లెఱుంగక విభ్రాంతి చెందును.

శ్లో.యద్వాత్స్యాయనసూత్రసంగ్రబహిర్భూతం కిమప్యాగమే
దృష్టం వాచ్యమిదం మయామునిగిరాం శ్రద్ధా హిసాధారణీ।
భావవ్యంజితమన్యభంగికథితం తత్రాపి చేదస్తి తత్
మన్దానాముపయుజ్యతే తదపి హి స్పష్టాభిధేయాకృతిః॥

గీ.ఇతరరతిశాస్త్రములను వర్ణించి పూర్వ
మునుల వాక్యంబులను వాత్యయనునిసూత్ర
పక్కి నెఱిఁగి దీని రచింపఁ బరగినాఁడ
రతివిలాస మెఱుంగని పతులకొఱకు.

తా.రతిపాక మెఱుంగలేని మందబుద్ధిగల నరులకొఱకు వాత్స్యాయన సూత్రములనుండియు నితరశాస్త్రములనుండియు మునీశ్వరులవాక్యములనుండియు నీపుస్తకము నాచే రచింపబడినది.

శ్లో.పద్మినీం, తదను చిత్రిణీం, తతః శంఖినీం, తదను హస్తినీం, విదుః।
ఉత్తమా ప్రథమాభాషితా, తతో హీయతే యువతిరుత్తరోత్తరమ్॥

క.మును జెప్పినదియె యుత్తమ
వెనుకటిదే హీనగాఁగ వివరింతురు ప
ద్మిని, చిత్రిణి, శంఖిని, హ
స్తినులను నోర్తోర్తుకంటె స్త్రీజాతులకున్.

తా.పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని యను యీజాతులలో వరుసగా తొలుత చెప్పినదానికంటె నొకటికొకటి అధమమని తెలియదగినది.

## పద్మినీజాతిస్త్రీలక్షణము

శ్లో.కమలముకుళమృద్వీ ఫుల్లరాజీవగంధః
సురతపయసి యస్యాః సౌరభం దివ్యమంగే।
చకితమృగదృశాభే ప్రాంతరక్తే చ నేత్రే
స్తనయుగళమనర్ఘ్యం శ్రీఫలశ్రీవిడంబి॥

శ్లో.తిలకుసుమసమానాం బిభ్రతీ నాసికాం చ
ద్విజగురుసురపూజాం శ్రద్ధధానా సదైవః।
కువలయదళకాంతిః కాపి చాంపేయగౌరీ
వికచకమలకోశాకార కామాతపత్రా॥

శ్లో.వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ
త్రివళివళితమధ్యా హంసవాణీ సువేషా।
మృదు శుచి లఘు భుంక్తే మానినీగాఢలజ్జా
ధవళకుసుమవాసోవల్లభా పద్మినీ స్యాత్॥

సీ.తామరమొగ్గ చందమున మెత్తని మేను
జలజగంధము రతిజలముఁ దనరు
మాలూరఫలముల మఱపించు పాలిండ్లు
కొలికుల కింపైన కలికిచూపు
తిలపుష్పముల వన్నెఁ దిలకించు నాసిక
గురువిప్రపూజనాపర సునియమ
చంపకకువలయఛాయయుఁ గల మేను
నబ్జపత్రముఁ బోలు నతనుగృహము

గీ.హంసగమనంబు కడు సన్నమైన నడుము
మంజుబాషిణి, శుచి, లఘుమధురభోజి
వెల్లచీరెలయందును వేడ్క లెస్స
మానవతి పద్మినీభామ మధురసీమ.

తా.తామరపువ్వువలె నుండు మెత్తనిశరీరమును, తామరపువ్వువాసనగల రతిజలమును, మారేడుపండ్లవంటి కుచములును, సొగసగు చూపును, నువ్వుపువ్వు వంటి ముక్కును, గురుబ్రాహ్మణపూజయం దాసక్తియు, సంపంగివంటిన్ని కలు వపువ్వులవంటిన్ని దేహచ్ఛాయగలదియు, తామరరేకువంటి భగము గలదియు, హంసగమనమును, సన్నమైననడుమును, మంచిమాటలును, శుచియై కొద్దిపాటిరుచి గలభోజనమును, తెల్లచీరలయందు ప్రీతిన్ని గలస్త్రీ పద్మినిజాతిస్త్రీగా నెఱుం గునది.

సీ.రాజీవగంధియే రాకేందుబింబాస్య
　　నీలోత్పలశామ నిర్మలాంగి
　సద్గుణచారిత్ర సత్యవ్రతాచార
　　తరుణి కురంగాబ్జ ధవళనేత్ర
　పాటలాధర రక్తపల్లవమృదుపాణి
　　గానవిద్యాలోల దానవిభవ
　కీరభాషిణి మణిహారవిభూషిత
　　మదమదావళయాన మధురభోజి

గీ.నీరు జలజంబువాసన మారుకేళి
　నాలుగవజామునకుఁ దేలు గేళినొరులఁ
　జిత్తగింపదు పాంచాలుఁ జెందఁగోరు
　విమలవస్త్రంబు పద్మిని వేడ్కఁగట్టు.

తా.తామరపువ్వువంటి వాసనగలదేహమును, పూర్ణచంద్రునివంటి ముఖ మును, నల్లకలువలవంటి దేహకాంతియు, నిర్మలమయిన అవయవములును, మంచి గుణమును, సత్యము చెప్పుటయు, లేడికండ్లును, తెల్లని నేత్రములును, తెలుపు మించి యెఱుపువర్ణముగల అధరమును, లేతచిగుళ్ళవంటి అరచేతులును, లయజ్ఞాన సంగీతప్రసక్తియు, యొప్పిదమయిన యీవియు, చిలుకపలుకులవంటి పలుకులును, రత్నమయభూషణాలంకారములును, మదపుటేనుగువంటి నడకయు, తియ్యని పదార్థములయందిష్టమును, తామరవాసనగల రతిజలమును, నాలుగవజామున రతిసల్పుటయు, రతియందు పాంచాలునిగాక నితరులను సమ్మతింపకయుండు టయు, తెల్లనివస్త్రములు గట్టుటయు పద్మిని జాతిస్త్రీగా తెలియందగినది.

ఉ.మేలపుఁజూపు మిక్కిలి రమించును గొంకక ప్రేమతోడుతన్
　గీలుకొను న్గనుంగవ మొగిడ్చు నవస్థలసారెసారెకు
　న్వాలయమౌను గూటములయందున వేడుకచే స్తుతించుఁ బాం
　చాలునిఁ గూడు పద్మినియు జాములు నాల్గిట మోహనాకృతిన్.

తా.సొగసగుచూపును, ప్రేమతో వెనుదీయక రమించుటయు, రతిపారవశ్యము చేత కన్నులుమూయుటయు, నాల్గవజామున పాంచాలుడను పురుషునితో రతియందు సారెసారెకు నవస్థల పొంది మెచ్చుకొనునట్టిది పద్మినిజాతిస్త్రీగా తెలియదగినది.

ఉ.తెల్లనిచీరెల న్విరులఁ దియ్యదనంబును మెచ్చు, వెంట్రుకల్
　నల్లన, మోవియెఱ్ఱన, కనత్కనకద్యుతిమేలు, కన్నులు
　త్ఫుల్లసరోజరుచులు, మృదుధ్వనికంఠము, పాణిపద్మము
　ల్పల్లవకాంతు లాననము పద్మము, పద్మినిజాతి కిమ్మహిన్.

తా.తెల్లనిచీరలను పువ్వులను తియ్యదనంబును మెచ్చుటయు, నల్లనివెంట్రు కలును, ఎఱ్ఱనిమోవియు, బంగారమువంటిదేహమును, తామరరేకులవంటి కన్ను లును, మృదుమధురధ్వనిగలకంఠమును, తామరమొగ్గలవంటి అరచేతులును, తామరపువ్వువంటి మొగమును గలస్త్రీ పద్మినిజాతిగా నెఱుంగునది.

## చిత్రిణీజాతిస్త్రీలక్షణము

శ్లో.సుగతిరనతిదీర్ఘా నాతిఖర్వా కృశాంగీ
　　స్తనజఘనవిశాలా కాకజంఘోన్నతోష్ఠీ।
　మధుసురభిరతాంబుః కంబుకంఠీ చకోర

స్వరవచనవిభాగా నృత్యగీతాదివిజ్ఞా||

శ్లో.మదనసదనమస్యా నర్తులోచ్చూనమంత
ర్మృదు మదనజలాఢ్యం లోమభిర్నాతిసాంద్రైః।
ప్రకృతిచపలదృష్టిర్బాహ్యాసంభోగరక్తా
రసయతి మధురాల్పం చిత్రిణీ చిత్రరక్తా||

సీ.నడుముసన్నము మంచినడక కోపపుఁజూపు
చనుదోయి పిఱుదులుఁ జాలఘనము
లెగుపిక్క లోష్ఠ మొక్కించుక యధికంబు
తేనియకంపు రతిద్రవంబు
మూఁడురేఖలు కంఠమునఁ జకోరపుఁబల్కు
నృత్తగీతాదుల నేర్పు పెద్ద
పొడవు వట్రువ జలపూరంబు మెత్తని
యల్పరోమముల పంచాస్త్రగృహము

గీ.బాల్యసంభోగరతియుఁ జాపలపుఁ జూపు
పులుసునిష్టంబు మధ్యంబు భోజనంబు
వన్నెచీరలఁ గట్టు భావంబు మృదువు
చిత్రిణీభామ వరనేత్ర చిత్రసీమ.

తా.సన్నమైననడుమును, మంచినడకయు, కోపపుదృష్టిన్నీ, గొప్పవైన చనులును పిరుదులును, ఉన్నతమైన పిక్కలును, కొంచెము పెద్దదైన పెదవియు, తేనెవాసనగల రతిజలమును, మూడురేఖలుగల కంఠమును, వెన్నెలపులుగుపలు కులును, ఆటపాటలయం దాసక్తియు నేర్పునూ, పొడవై వట్రువయై మిక్కిలి రతిజలముగలదై మృదువై కొద్దిరోమములుగలదైన యోనియు, ఆలింగచుంబనా దలుయం దాసక్తియు, చపలదృష్టియు, పులుసుయందిష్టమును, తగుపాటిభోజన మును, వన్నెచీరలగట్టుటయు, మెత్తనిమనస్సునూగలస్త్రీ చిత్రిజాతిగా తెలియ దగినది.

సీ.కలికిచూపులఁ జూచుఁ, గమ్మపూతలఁ బూయుఁ
బెక్కువన్నెలఁ బెట్టఁ బ్రియమువడును
గుటిలాలకంబులు కోపమెన్నడులేదు
చవుసీతిగతిఁ గూడుఁ జతురరతులఁ
ద్రిమ్మటకోర్చును దెకతెక మోహించుఁ
దమకమెన్నకనవ్వుఁ దగులదెచట
వలపుఁ దెలియనీక వలచుఁ దేనియకంపు
నాటపాటలఁ గోరు నల్పభోజి

గీ.వింతరతులకుఁ బైకొను వెల్లగాదు
ప్రౌఢరతికేళి మనసిచ్చి పల్లవించు
చిత్రిణియనంగఁ దంగేటిచెట్టుజున్ను
రూపవరు లైనవిటులకు రూఢి మెఱయ.

తా.సొగసుగా జూచుటయు, వాసనద్రవ్యములబూయుటయు, వన్నెచీ రెలగట్టి సంతోషించుటయు,చుట్టుకొనియున్న ముంగురులును, కోపములేక యుండుటయు, ఎనుబదినాలుగు బంధనములతో రమించుటయు, చతురరతుల యందు శ్రమకోర్చుటయు, ఆసతో వలచుటయు, మోహముగణింపక నవ్వుటయు, రతియందు వెనుదీయకయుండుటయు, మోహములయలుపరుపక మోహించు టయు, తేనెవాసనగల

రతిజలమును, ఆటపాటలయందాసక్తియు, మితమయిన భోజనమును, చిత్రబంధములయందు మించియుండుటయు, చతురతయందిచ్చ గించి సంతోషించుటయు, చూపరులగు విటులకు తంగేటిజున్నువలె నుండుటయు గలస్త్రీని చిత్రిణీజాతిస్త్రీగా తెలియదగినది.

చ.కడుఁదెగఁజాపుగాళ్ళు విటుఁ గైకొని యెత్తుఁ బిఱుందుకూటమిన్
దడఁబడు క్రిందుమీదువడిఁ దాకుఁ దొడ ల్బిరికించు సారెకున్
ముడివడి తానె పైకొనును ముచ్చటల న్బడి తిట్టుఁ దొల్తజా
మడుగునఁ గూచిమారుని రహస్యము గోరును చిత్రిణీ స్గనన్.

తా.మిక్కిలి కాళ్ళుజాపుటయు, రతివేళయందు పిఱుందు లెత్తుటయు తత్తరపాటున పైనప్రక్కనబడుటయు, తొడలు బిగబట్టుటయు, మాటిమాటికి తాను పైకొనుటయు, రతిసంభ్రమముచే తిట్టుటయు,తొలిజామున కూచిమారు నిరతిగోరెడి స్త్రీ చిత్రిణిగా నెఱుంగవలయును.

ఉ.అన్నువయైనకౌను కుటిలాలకపంక్తులు చెన్నుమీఱఁగా
వన్నెలఁబెట్టు పచ్చమరువంబును బూయఁగనేర్చు నెయ్యెడన్
గన్నుల నార్చుఁ గూటమిని గాకకు నోర్వదు నేర్పుసేతలన్
దిన్ననిమాటలాడుఁ గడుద్రిమ్మరు చిత్రిణిచిత్త మీక్రియన్.

తా.కొద్దయైననడుమును, పంక్తులుతీర్చి చుట్టుకొనియున్న ముంగురులును, సొగసుగా నలంకరించుకొనుటయు, సుగంధమునలందుటయు, ఎప్పుడునూ రెప్ప లార్చుడమును, చండరతి కోర్చకయుండుటయు, చిత్రరతులయందు ప్రీతియు, మంచిమాటలాడుటయు, మిక్కిలిత్రిప్పటగలస్త్రీ చిత్రిణిజాతిగా నెరుంగవలెను.

## శంఖినీజాతిస్త్రీలక్షణము

శ్లో.తనురతనురపి స్యాదీర్ఘదేహాంఘ్రిమధ్యా
హ్యారుణకుసుమవాసః కాంక్షిణీ కోపశీలా।
అనిభృతశిరమంగే దీర్ఘనిమ్నం వహంతీ
స్మరగృహమతిలోమక్షారగంధి స్మరాంబు॥

శ్లో.సృజతి బహునఖాంకం సంప్రయోగే లఘీయః
స్మరసలిలపృషత్కా కించిదుత్తప్తగాత్రీ।
న లఘు న బహు భోక్త్రీ ప్రాయశః పిత్తలా స్యాత్
పిశునమలినచిత్తా శంఖినీ రాసభోక్తిః॥

సీ.వలమును బొడవునై బలసిన దేహంబు
నడుగులు నిడుద లత్యంతకుపిత
పలురక్తవస్త్రపుష్పంబుల నాసించు
నంటిన నధర మందంద నదరు
మదనగేహమున రోమములు దట్టంబులు
రతిజీవనంబు కారంబు వలచు
సంయోగమునఁ గామజల మల్పబిందువుల్
జిలుగు నఖక్షతములు ఘటించు

గీ.నధికమును గొంచెమును గానియట్టికుడుపు
వెచ్చనగుమేను కొండెంబు వినుచునుండు

గార్దభస్వర పైత్యంబు గలదు మిగుల
శంఖినీభామ కుటిలవాచాలసీమ.

తా.నిడుపై బలసియున్నదేహమును, పొడవైనకాళ్ళును, మిక్కిలికోపమును, ఎఱ్ఱనివస్త్రములను పువ్వులను గోరుటయు, ముట్టినంతనే పెదవి యదరుటయు, భగమందు దట్టమైనరోమములును, కటువువాసనగల రతిజలమును, రతికాలమందల్పమైన మదనజలము పడుటయు, నఖక్షతములు చేయుటయు, మితభోజనమును, కాక శరీరమును, కొండెముల వినుటయు, గార్దభస్వరమును, పైత్యగుణమును, వంకర మాటలకు పుట్టినిల్లును అయినస్త్రీని శంఖినిజాతిస్త్రీగా తెలియదగినది.

సీ.అన్నువయగునడు మందమౌనధరంబు
కొండెంబునకుఁ జొక్కుఁ గోపగుణము
కొంచెపుఁజూపును గుడుపుదొడ్డనరాదు
మృదుభాషణంబులు మేనునునుపు
నున్నతస్తనభార ముత్పలదళనేత్ర
కాఠిన్యపదపద్మ కంబుకంఠి
లాలితభ్రూయుగ నీలాళికచభార
మదనకేళికిని సమ్ముదితచిత్త

గీ.ప్రియరసంబగుగారంబుఁ బెంపుతావి
వలపు పుట్టిన వెఱ్ఱియై వరుని నమ్ము
నీలవర్ణంపుఁ జీరెలు లీలఁ గట్టు
శంఖినీభామ రతి సల్పు సరవితోడ.

తా.సన్నమైననడుమును, అందమైనపెదవియు, కొండెములు వినుటయు,కోపమును, క్రీగంటిచూపును, పరిపాటియైనభోజనమును, మృదువైనశరీరముమాటలును, గొప్పవైనకుచములును, కలువరేకులవంటికన్నులును, కఠినములైనపాదములును, శంఖమువంటి మెడయు, సుందరమైనకనుబొమలును, నల్లనికురులును,రతికేళియందు తేరినమనస్సును, కారమునం దిష్టమును, వలపుపుట్టినవరునిపై వెఱ్ఱినమ్మకమును, నల్లచీరెలయం దిష్టమును, క్రమముతప్పక రతి సల్పుటయు శంఖినీస్త్రీయొక్కలక్షణములు.

ఉ.కొంకక కూడు నంగమును గోప్యము సేయదు వింతమాటకు
న్జంకెనఁ జూపుఁ గౌగిటను జాలఁగనుండును నాథుసేతకు
న్శంకిల కుబ్బు మీఁదరతి సల్పును భద్రశశాంకుతోడఁ దా
నుంకువఁ జూపు శంఖిని ప్రియోక్తుల మూఁడవజామునందునన్.

తా.శంకలేక కలియుటయు, శరీరము దాచకయుండుటయు, వింతమాటలకు భ్రమతో చూచుటయు, ఆలింగనమం దెక్కువగా నుండుటయు, భర్తయొనర్చెడిపనులకు విచారింపక సంతోషించుటయు, మూడవజామునందు భద్రశశాంకుడను పురుషునిపై ప్రేమతో ప్రియభాషణములతో పురుషాయితబంధములతోరతిసల్పుటయు శంఖినీజాతిస్త్రీయని గుర్తించునది.

చ.నడుము కృశంబు కొండ లన నొప్పుకుచంబులు నీలముల్కురు
ల్నిడుదలు కన్ను లామెఱుఁగునిక్కలు గాఁదగునంతభోజనం
బడరఁ బ్రియంబుఁ గోపము రయంబునఁ జూపును గొండెమైన నే
ర్పడవిను రక్తపుష్పపటరాగను శంఖినిగా నెఱుంగుమా.

తా.సన్ననినడుమును, గొప్పవైనచనులును, నల్లనై నిడుదలైనవెంట్రుకలును, మెఱపుగొల్చెడి

కండ్లును, తగుపాటిభోజనమును, ప్రియమును కోపమును వెంటనే చూపుటయు, కొండెములు నేర్పుగా వినుటయు, యెఱ్ఱనిచీరెలను పువ్వు లను కోరునట్టిది శంఖినీజాతిస్త్రీయని తెలియందగినది.

## హస్తినీజాతిస్త్రీలక్షణము

శ్లో.అలలితగరురుచ్చైః స్థూలవక్రాంగులీకం
వహతి చరణయుగ్మం కంధరాం హ్రస్వపీనాం।
కపిలకచకలాప క్రూరచేష్టాతిపీనా
ద్విరదమదవిగంధిః స్వాంగకేఽనంగకేచ॥

శ్లో.ద్విగుణకటుకషాయప్రాయభుగ్వీతలజ్జా
లలదతివిపులోష్ఠి దుఃఖసాధ్యాప్రయోగే।
బహిరపి బహురోమాత్యంతమంతర్విశాలం
వహతి జఘనరంధ్రం హస్తినీ గద్గదోక్తిః॥

సీ.నడువనేరదు వంకపొడవును గలవ్రేళ్ళు
గలపాదయుగళంబు గళము కుఱుచ
కపిలవర్ణం బైనకబరీభరము క్రూర
చేష్టలు వల మైనచిఱుతయొడలు
కరిమదగంధంబు స్మరగేహతనువులు
కటుకషాయము లధికంబుఁ గుడుచు
విపులోష్ఠకఠిన దుర్విటులకుఁ గడఁగూర్చు
గద్గదస్వరముఁ జక్కనిమనంబు

గీ.మీఁదిరోమంబు లల్పంబు మిగులలోఁతు
వెడఁద మదనుండు చరియించు వీడఁబుట్టు
గాఢసంయోగమునఁ గాని కరుఁగ దల్ల
హస్తినీభామ యుగ్రతరాంతసీమ.

తా.మంచిది గానినడకయు, వంకరయు పొడవైనవ్రేళ్ళుగల పాదములును,కుఱచయగు మెడయు, కొంచెము పసుపువర్ణముగల వెంట్రుకలును, చెడుపనులును,చక్కనికుఱుచయగు శరీరమును, యేనుగుమదమువాసనగల భగ దేహములును,కారము ఉప్పుతో అధికమైనభోజనమును, పెద్దపెదవియు, కఠినులయినవిటకాండ్రయందు ప్రీతియు, తొట్రుపాటుగల కంఠధ్వనియు, మంచిమనస్సును, అల్పరోమములతో మిక్కిలిలోతును విశాలమునుగల భగమున్నూ, కఠినరతులచేత తృప్తినొందుటయు, కోపగుణమును గలస్త్రీ హస్తినిజాతిస్త్రీగా నెఱుంగుడు.

సీ.కనకకుంభస్తని కక్షద్వయము గబ్బు
మాత్రంబు గలదౌను మనసు లేఁత
నిటలభాగము మిఱ్ఱు నెఱివెండ్రుకలు గావు
కటి యూరువును వ్రేఁగు గలిగియుండుఁ
గౌనుకుక్షియు దొడ్డ కాయంబు చిక్కన
పలుకులు మృదురీతి పట్టుఁబడవు
గమనింపనేరదు కన్నులు వెడఁదలు
కంఠంబు లెస్సది కపటి కాదు

గీ.బిరుదరతికేళిఁ బ్రియునితో బ్రియము గలదు

మదనజలమును దగుఁ గరిమదము తావి
తొగరుచీరెలు గట్టును బిగువు సెడదు
ముగుద హస్తిని మన్మథు మొదటిశరము.

తా.బంగారుకుండలవంటి కుచములును, గబ్బుకంపుగల చంకలును, మృదువగుమనస్సును, మిట్టనొసలును, తేనెవర్ణముగల వెంట్రుకలును, గొప్పనైనపిఱుదలు తొడలున్నూ, పెద్దదైన నడుమును కడుపున్నూ, గట్టిదేహమును, కఠినమైనమాటలును, మంచినడకలేమియు, పెద్దకన్నులును, మంచికంఠమును, వంచనత్వములేనిదియు, బిరుదుతో క్రీడించు ప్రియునియందు ప్రీతియు, యేనుగుమదమువాసనగల రతిజలమును, యెఱ్ఱనిచీరలు కట్టుటయు, పటుత్వము తప్పక యుండుటయుగలస్త్రీని హస్తినిజాతిగా తెలియునది.

ఉ.అంగము దాచు మోహము రహస్యము సేయును గూటమందు సా
రంగమురీతిఁ గొల్పు విటరాజును సొంపుగఁ జూచు దత్తు కా
లింగన మీయఁగోరుచుఁ జలించును రెండవజాములోన దాఁ
సంగమ మిచ్చు మెచ్చును నిజంబుగ హస్తినికాంత యుక్తులన్.

తా.శరీరము దాచుటయు, వలపు తెల్లముజేయక యుండుటయు, యేనుగువలెరతియందు ప్రవర్తించుటయు, విటుని అందముగా చూచుటయు, దత్తుడనేనాయకునికి ఆలింగ మీయ నిష్టపడుచు చలించుటయు, రెండవజామునందు రతిసుఖ మిచ్చుటయు, ప్రియునియుక్తులను మెచ్చుటయు, ఈగుణంబులుగలస్త్రీ హస్తినిజాతిస్త్రీగా తెలియదగినది.

చ.తొడలును జన్నులోష్ఠములు దొడ్డలు కన్నులు కాళ్ళు చేతులు
న్వెడదలు బాహుజంఘములు వెండ్రుకలు న్గుఱుచౌ లలాటము
న్బెడవు నొడల్వెడల్పు, కడుపు న్గుడుపున్బడుపున్ ఘనంబు, దా
జిడిముడిపాటును న్దొగరుచీరెలు హస్తిని కట్టు నెంతయున్.

తా.గొప్పవైనతొడలు చన్నులు పెదవియు, విశాలములయిన కన్నులుకాళ్ళు చేతులును, కొద్దిభుజములు పిక్కలు కురులునూ, నిడివియైన నొసలును,వెడల్పుశరీరమును, అధికమైనకడుపు భోజనము పడకయు, కోపమును, తొగరుచీరెయందుప్రీతిన్నీ గలస్త్రీని హస్తినిజాతిస్త్రీగా నెఱుంగునది.

## పద్మినిగాక తక్కిన మూఁడుజాతులకు ప్రియమైన తిథులు

శ్లో.నయనయుగశరర్తుర్బ్రుధ్నదిజ్నాగసంఖ్యా
స్తిథయ ఇహ రతే స్యుః ప్రీతయే చిత్రిణీనాం।
గృహతిథిభువనాఖ్యాద్వాపయుక్తాః కరిణ్యా
స్తదితరతిథయః స్యుః శంఖినీనా చతస్రః॥

గీ.విదియ పంచమి షష్ఠి చవితి దశమియు
నష్టమిని ద్వాదశిని గవయంగఁ జిత్రి
ణికిఁ బ్రియంబు మఱియు హస్తినికిఁ బ్రియంబు
తదియ పున్నమి నవమి సప్తములఁ గవయ.

తా.విదియ పంచమి షష్టి చవితి దశమి అష్టమి ద్వాదశి ఈతిథులయందు చిత్రిణినిన్నీ తదియ పున్నమి నవమి సప్తమి తిథులయందు హస్తినితోనురమింపవలెను.

గీ.శశిని బాద్యమి హరిదివసముల భూత
తిథిని శంఖిని రమియింపఁ దివురమేలు
కాన వల్లభు లెఱిఁగి యాక్రమముఁ దెలిసి

సంగమం బొనరించెడి జాడఁ గనుఁడు.

తా.పర్వము పాడ్యమి ఏకాదశి త్రయోదశి చతుర్దశి ఈతిథులు శంఖినికి ప్రియములుగాన ఈక్రమము దెలిసి వారితో సంగమమొనరించెడి విధమునుదెలియుడు.

## పద్మిని మొదలగు జాతులకు ప్రియమగు జాములు

శ్లో.వ్రజతి రతిసుఖార్తం చిత్రిణీమగ్రయామే
భజతిదినరజన్యర్హస్తినీం చ ద్వితీయే।
గమయతి చ తృతీయే శంఖినీమార్ద్రభావం
రమయతి రమణీయాం పద్మినీం తుర్యయామే॥

చ.ముదము దలిర్పఁ జిత్రిణియు ముందటిజామునఁ గూడఁ జాలస
మ్మద మొనరించు హస్తిని క్రమంబున రెండవజామునందు నిం
పొదవు, తృతీయయామమున నొప్పగు శంఖిని కూడఁ బద్మినీ
ముదితకు నంత్యయామమున మోహము వుట్టు నహర్నిశంబులన్.

తా.తొలిజామున చిత్రిణిని, రెండవజామున హస్తినిని, మూడవజామునశంఖినిని, నాలుగవజామున పద్మినిని క్రమముగా ఈజాములయందు, పగలురాత్రులయందు రమించిన ఆయాకాంతలు సుఖింతురు.

## పద్మిని మొదలగు జాతులకు ప్రియమగు బంధములు

శ్లో.పంకజాసనలయేన పద్మినీం వేణదారితపదేన శంఖినీం।
స్కంధపాదయుగళేన హస్తినీం నాగరేణ రమయన్తి చిత్రిణీం॥

గీ.నాగబంధమునను నట్టాడుఁ జిత్రిణి
స్కంధపాదయుగము సరవిహస్తి
వేణుదారణమున వేడ్క శంఖిని పద్మి
పంకజాసనమునఁ బల్లవించు.

తా.నాగరాఖ్యబంధముచేత చిత్రిణిని, స్కంధపాదయుగబంధముచేతహస్తినిని, వేణువిదారితబంధమున శంఖినిని, పంకజాసనబంధముచే పద్మినినిరమింపగా సంతసింతురు.

వ.ఈ నాలుగుబంధములకును లక్షణములు ద్వితీయాశ్వాసంబున చవుశీతిబంధములలోఁ విపులముగాఁ జెప్పంబడియె.

## పద్మినిఁ దప్ప మిగిలినజాతులను బురుషులు మంత్రౌషధములచే వశులను జేసుకొను లక్షణములు

శ్లో.మోచాకందరసేన జాతిఫలకం కుర్యాద్వశాం చిత్రిణీం
పక్షౌ మాక్షికసం యుతౌ చ కరిణీం పారవతభ్రామరౌ।
శంఖిన్యా వశకృంచ గంధతగరీమూలాన్వితం శ్రీఫలం
తాంబూలేన సహ ప్రదత్తమచిరాన్మంత్రైరమీభిః క్రమాత్॥

వ.“ఓం పచ పచ విహంగమ విహంగమ కామదేవాయస్వాహా” అనేన మంత్రేణ కదళీకందరసం జాతీఫలం తాంబూలేన సహదద్యాత్తదా చిత్రిణీ వశ్యాభవేత్॥
“ఓం ఛేంది ఛేంది వశ్యంకరి వశ్యంకరి వశ్యంకరి కామాదేవాయ స్వాహా”అనేన మంత్రేణ

పారావతభ్రమరస్య పక్షౌ మధుయుక్తౌ తాంబూలేన దేయౌ తదా హస్తినీ వశ్యాభవేత్||
"ఓం హర హర పచకామదేవాయ స్వాహా" అనేన మన్త్రేణ గన్ధతగరస్య మూలం బిల్వసహితం దేయం తదా శంఖినీ వశ్యా భవేత్||

సీ.అరటిదుంపరసంబునందు జాజిఫలంబుఁ
దివిచి విడెమ్ము చిత్రిణికి నిడుఁడు
భ్రమరపారావతపక్షభస్మ్మ తేనె
నునిచి విడెమ్ము శంఖినికి నిడుఁడు
మాలూరఫలరసమర్దితగంధంబు
కరమునఁ గూర్చియుఁ గరిణి కిడుఁడు
వశ్యులుగా న్విటవల్లభు లీమంత్ర
మంత్రములఁ బ్రణవాదిగా నలవరించి

గీ.తవిలి కదళికామదైవాయ కలరవ
కారుదైవతాయ క్రమబిల్వ
కామదైవతాయ గరిమస్వాహా యని
వేఱువేఱు మంత్రివిధులఁ దెలిసి.

తా.అరటిగడ్డరసములో జాజికాయను భావనచేసి తాంబూలముతో చిత్రిణికి, తుమ్మెదరెక్కలు పావురపురెక్కలు భస్మముచేసి తేనెలో గలిపితాంబూలముతో శంఖినికి, బిల్వపండ్లరసముతో శ్రీగంధమునూరి చేతితో హస్తినికిని వరుసగా "ఓం అనటికామదేవాయ స్వాహా| ఓం విహంగమకామదేవాయస్వాహా| ఓం శ్రీఫలకామదేవాయస్వాహా|" అను నీ మంత్రంబుల నుచ్చరించుచునామందులను యిచ్చి చిత్రిణ్యాదికాంతలను వశవర్తులుగా జేసికొందురు. ఉత్తమజాతిత్వాత్ పద్మిన్యాం నియమావేతా ననుక్తావాచారాత్.

క.ఉత్తమగుణజాతియు స
ద్వృత్తులు గల పద్మినికిని వెడమందులు మం
త్రోత్తమములు లేకుండుట
నిత్తరి రతిచంద్రకళల కిర వెఱిఁగింతున్.

తా.శ్రేష్ఠమైనగుణము, జాతి, నడవడి గలపద్మినికాంతకు మంత్రౌషధంబులు లేవు గాన కళాస్థానములను జెప్పుచున్నాడను.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే జాత్యాధికారో నామ ప్రథమః పరిచ్ఛేదః

# చంద్రకళాధికారః
# ద్వితీయః పరిచ్ఛేదః

## స్త్రీకళాస్థానములు

శ్లో.అంగుష్ఠే, పద-గుల్ఫ-జానుజఘనే, నాభౌ చ, వక్షః స్తనే
 కక్షౌ-కంఠ-కపోల-దన్తవసనే, నేత్రాలినే మూర్ధ ని।
 శుక్లాశుక్లవిభాగతో మృగదృమశామంగేష్వనంగసతీ
 రూర్ధ్వాధోగమనేన వామపదతః పక్షద్వయే లక్షయేత్॥

మ.పెనువ్రేలన్ బద గుల్ఫ జాను కటి నాభీభాగ బాహాంతర
 స్తన కక్షమ్ములఁ గర్ణగండరదనాసావత్సఫాలోత్తమాం
 గనిరూపంబుల నెక్కుడిగ్గుఁ గలయంగా శుక్లకృష్ణంబుల
 న్దినము న్మన్మథుఁ డంగనాజనముల న్దేలించు వామాదియై.

తా.బొటనవ్రేలు కాలిమడమపిక్క తొడ పిఱుదు బొడ్డు భుజముచన్ను చంక చెవి పల్లు చెక్కిలి ముక్కు ఔమ్ము ముఖము తల యీస్థానములయందు కళ తరుణీమణులకు శుక్లపక్షమున నెడమదిక్కుగా నెక్కి కృష్ణపక్షమందు కుడిదిక్కుగా దిగును.

## స్త్రీపురుషకళాస్థానములు

శ్లో.మస్తకే వక్షసే తథా కరయోః స్తనయోరపి
 ఊర్వ్వోర్నాభౌ స్మరగృహే ఫాలకుక్షికటిత్రికే॥

శ్లో.బాహుమూలే గళే చైవ నితంబే భుజయోస్తథా
 వనితానాముక్తరీత్యా కృష్ణేఽధో గచ్ఛతి క్రమాత్॥

శ్లో.ఆరభ్యః శుక్లప్రథమాం మూర్ధానమధిరోహతి
 ప్రత్యేకముక్తస్థానేషు సబిందూన్ సవిసర్గకాన్॥

(ఇతి రతిరత్నప్రదీపిక)

సీ.అంగుష్ఠముఖమున నరికాలియందున
 మడమను మోకాలిముడుసునందు
 మరునింట నాభియం దురమునఁ జంటను
 గక్షభాగంబునఁ గంఠమునను
 జెక్కున నధరానఁ జెలువార రెప్పను
 నుదుట శిరంబున మదనుఁ డెలమి
 శుక్లపక్షమునందు సుదతుల కెల్లను
 పాడ్యమి మొదలుగాఁ బరఁగనెక్కి

గీ.వామభాగంబునందుండి వలపటికిని
 బోవు బహుళంబులందును బురుషులకును
 వామభాగంబునకు డిగ్గు వరుసతోడ
 వెలఁదులకుఁ బతులకుఁ గల లీవ్డు నిట్లు.

# స్త్రీలకు తిథులు — కళాస్థానములు

తా.బొటనవ్రేలికొన, అరికాలు, మడమ, మోకాలిచిప్ప, భగము,బొడ్డు, రొమ్ము, చన్ను, చంక, కంఠము, చెక్కిలి, అధరము, కనురెప్పలు,ముఖము, తల, యీస్థానములయందు కళ స్త్రీలకు శుక్లపక్ష పాడ్యమాదిగానెడమదిక్కున కెక్కి కుడిదిక్కుగా దిగును. పురుషులకు కృష్ణపక్షపాడ్యమిమొదలు కుడిదిక్కుగా నెక్కి ఎడమదిక్కునుండి దిగును.

శ్లో.ప్రథమాయాం సితేంఽగుష్ఠే నిజాంగుష్ఠేన మర్దయేత్|
ద్వితీయాయాం తు చరణే తం స్వపాదేన పీడయేత్||

శ్లో.తృతీయాయాం తథా గుల్ఫే స్వగుల్ఫేన చ తాడయేత్|
చతుర్థ్యాం జానునీ తస్యామర్దయేన్నిజజానునా||

శ్లో.కుర్యాత్కరికరక్రీడాం పంచమ్యాం స్మరమందిరే|
నాభిం చ తలహస్తేన షష్ఠ్యాం సంతాడయెన్మృదు||

శ్లో.ముష్టిహస్తేన సప్తమ్యాం వక్షస్తాడనమాచరేత్|
అష్టమ్యాం స్తనయోస్తాం చ సలిలం మర్దయేధృవా||

శ్లో.నవమ్యాం బాహుమూలే తు నఖరేఖాం సమాచరేత్|
దశమ్యాం కంఠదేశే తు తత్రాపి నఖరైర్లిఖేత్||

శ్లో.ఏకాదశ్యాం కపోలే తు బహుశశ్చుంబనం చరేత్|
ద్వాదశ్యాం దంతవసనే దన్తోష్ఠేన నిపీడయేత్||

శ్లో.త్రయోదశ్యాం తు నయనే మృదుచుంబనమాచరేత్|
చతుర్దశ్యాం ఫాలదేశే తత్ర చుంబనతాడనే||

శ్లో.పంచదశ్యాం తు శిరసి కచగ్రహణమాచరేత్|
పుసాం దక్షిణపార్శ్వే తు వనితైవం సమాచరేత్||

శ్లో.కృష్ణేఽవరోహక్రమతః కృత్యాన్యేతాని చాచరేత్|
ఏవమాచరితే కాన్తాః ప్రహృష్యన్తి ద్రవన్తి చ||

(ఇతి రతిరత్నప్రదీపిక)

సీ.అమవసఁ బాడ్యమి నంగుష్ఠమున నుండు
విదియఁ బాదంబుల వెలసియుండుఁ
దదియ గుల్భమునందుఁ దగుఁ జవితి తొడను
బంచమిఁ గటియందుఁ బరఁగియుండు
షష్ఠి నాభి నెసంగు సప్తమి నురమున
నష్టమిఁ గుచముల నమరియుండు
నవమి వక్షమునందు నయముగ దశమిని
గంఠమూలంబునఁ గలిగియుండు

ఆ.బదునొకంటఁ జెక్కులఁ బదిరెంట నధరంబు
పదియుమూఁటఁ గనులఁ బదియునాల్గు
దినములందు నుదుటఁ దివిరి పున్నమినాఁడు
తలకు నెక్కు డిగ్గుఁ గల లటండ్రు.

తా.అమవస పాడ్యమి తిథులయందు బొటనవ్రేలియందును, విదియను కాళ్ళయందును, తదియను మడమయందును, చవితి తొడను, పంచమి పిఱుదులయందును,షష్టి బొడ్డునందును, సప్తమి ఱొమ్మునను, అష్టమిని చన్నులయందును, నవమిచంకలయందును, దశమి మెడయందును, ఏకాదశి చెక్కులయందును, ద్వాదశిపెదవియందును, త్రయోదశి కనులయందును, చతుర్దశి నుదిటియందును, పున్నమతలయందును, కళ యెక్కుచూ దిగుచూ ఉండును.

## స్త్రీలను రమించి ద్రవింపఁజేయు బంధవిశేషములు

శ్లో.కే గృహ్ణన్తి కచాన్ లలాటనయనే చుంబన్తి, దన్తచ్ఛదం
దన్తోష్ఠేన నిపీడయన్తి, బహుశశ్చుంబన్తి గండస్థలీం|
కక్షాకంఠతటం లిఖన్తి నఖరై, ర్గృహ్ణంతి గాఢం స్తనౌ
ముష్ట్యా వక్షసి తాడయన్తి దదతే నాభౌ చపేటాం శనైః||

శ్లో.కుర్వన్తి స్మరమందిరే కరికరక్రీడాం స్త్రియో జానునీ
గుల్ఫాంగుష్ఠపదాని చ ప్రతిముహుర్నిఘ్నన్తి తైరాత్మనః|
ఇత్యేనం కలయన్తి యే శశికలామాలింగ్య మజ్జన్తి తే
శీతాంశూపలపుత్రికాం శశికరస్పృష్టామివ ప్రేయసీం||

సీ.అలకలు గబళించి యలికనేత్రంబులు
చుంబించి వాతెరఁ జొనిపి పేర్చి
చెక్కిలి ముద్దాడి గ్రక్కునఁ గంఠ క
క్షములపై నఖపురేఖలు ఘటించి
బిగియఁ జన్నులఁ బట్టి పిడికిట నడిఱొమ్ము
దాఁటించి నాభిఁజపేట మునిచి
స్మరగేహమున దంతికరలీలఁ బచరించి
జానుగుల్భాంగుష్ఠచరణతలము

గీ.నంటి తనవాసిచే దాని నంటు కొలిపి
కలియనేర్చిన రతికేళిఁ గరఁగు కాంత
చంద్రకిరణంబు సోఁకిన చంద్రకాంత
రత్నమును బోలి యానందఁరసము నొందు.

తా.ముంగురులను చేత దువ్వి నొసలు కన్నులు చుంబించి పెదవి గరచిచెక్కిలి ముద్దుపెట్టుకొని మెడ చంకలయందు నఖక్షతములుంచి కుచముల బట్టిపిడికిలిచేత ఱొమ్మును లంఘించి బొడ్డును తట్టి భగమందు యేనుగుతొండమువలెనేచెయ్యి చేర్తి మడమ బొటనవ్రేలు అరకాలును ముట్టి తననేర్పుచే స్త్రీని మరులుకొలిపి రమించిన యెడల చంద్రకిరణములు సోకిన చంద్రకాంతమువలెనే కరగియానందరసమునం దోలలాడును.

## పద్మినికి ముఖ్యకళాస్థానములు

క.కటి నాభి యూరుతలమును
బటుతరముగఁ గళలనెలవు పద్మిని కరయన్
గటియూరువుఁ గనుఁగొన్నను
విటపతి పాంచాలుఁ డింతి వేడుకఁ గోరున్.

తా.పద్మినికి పిఱుదు నాభి తొడలు కళాస్థానములు. ఆ కళాస్థానములను గనుగొని పాంచాలుడనే పురుషు డాస్త్రీని రమింపగోరును.

## చిత్రిణికి ముఖ్యకళాస్థానములు

ఫాలము నలకలుఁ గన్నులు
లాలితగతిఁ జిత్రిణికి విలాసస్థలము
ల్వాలిక నునుమెఱుఁగులఁ గని
పోలఁగ భద్రకుఁడు యువతిఁ బొందఁగఁగోరున్.

తా.నొసలు ముంగురులు కన్నులు చిత్రిణికి కళాస్థానములు. వాటినుందరమును జూచి భద్రకుడనే పురుషు డాస్త్రీని పొందగోరును.

## శంఖినికి ముఖ్యకళాస్థానములు

క.అధరము పిక్కలుఁ జెక్కులు
సుదతులలో శంఖినికి జూడఁగ నొప్పా
నధరము సొబగుఁ గనుంగొని
మదవతిఁ బొందంగఁ గూచిమారుఁడు గోరున్.

తా.పెదవి పిక్కలు చెక్కిళ్ళు శంఖినికి కళాస్థానములు. వీటియందమునుగాంచి కూచిమారుడనే పురుషుడు యాస్త్రీని పొందగోరును.

## హస్తినికి ముఖ్యకళాస్థానములు

క.వక్షోజ బాహుమూలము
లీక్షితహస్తికినిఁ గళల కిరవగు తావు
ల్వక్షోజముఁ గనుగొని య
బ్జాక్షిని దత్తకుఁడు పొంద నాత్మ దలంచున్.

తా.కుచములు చంకలు హస్తినికి కళాస్థానములు. వీటిని దత్తకుడనే పురుషుడాస్త్రీని రమింపదలఁచును.

## మన్మథబాణములకు స్థానములు

శ్లో.ఏకారౌకారయుక్తా హరిహరజహరాః పంచబాణస్స్మరస్య
ఖ్యాతా లక్ష్యాణ్యమీషాం హృదయకుచదృశో మూర్ధగుహ్యే క్రమేణ
మర్మస్వేతేషు భూయో నిజనయనధనుః ప్రేరితైస్తైః పతద్భిః
స్యన్దన్తే సుందరీణాంజ్వలదనలని భైర్బిన్దవః కామవారామ్||

శా.ఏకారంబు నౌకారమున్ హరిరథాధీశాత్రినేత్రాఖ్యబీ
జాకారంబులు చిత్తసంభవుని పంచాస్త్రంబు లీబాణముల్
స్త్రీకిన్ హృత్కుచ దృష్టి మస్త తనుభూసీమంబుల న్విస్ఫులిం
గాకల్పంబుగఁ జూచిన న్మదనతోయం బుబ్బు నత్యుష్ణమై.

తా.మన్మథబాణములైన ఏం, ఓం, హ్రీం, క్లీం, క్లాం, అను యీ బీజాక్షరములు నుచ్చరించుచు స్త్రీయొక్క ఱొమ్ము చన్నులు దృష్టి శిరస్సు రోమములను రెప్పలార్పక చూచినయెడల నుష్ణమైన రతిజలము ద్రవించును.

## షోడశకళాస్థానములు

శ్లో.సంక్షేపాదితి నందికేశ్వరమతాత్తత్త్వం కిమప్యుద్ధృతం

ఘోణీపుత్త్రకభాషితోఽయమధునా సక్షిప్యతే విస్తరః|
మూర్ధోరస్థలవామదక్షిణకరే వక్షోరుహోరుద్వయే
నాభీగుహ్యలలాటజాఠరకటీ పృష్ఠేషు తిష్ఠత్యసౌ||

శ్లో.కక్షాశ్రోణిభుజేషు చ ప్రతిపదం ప్రారభ్యకృష్ణామథ
శ్వేతాయాః ప్రభృతి క్రమేణ మదనో మూర్ధావమారోహతి|
అంగేష్వేషు మృగీదృశాం మనసిజప్రస్తావనాపండితా
మాత్రాఃషోడశ చిన్తయన్తి బహలజ్యోతిఃస్ఫులింగాకృతీః||

సీ.తల యురస్స్థలి వామదక్షిణకరములు
వలిచన్ను లూరులావర్తనాభి
ఫాల జఠర నితంబస్థలంబులు వీపు
చంకలు యోనియుఁ జరణతలము
లాదిగాఁ గల పదియాఱు తానకములఁ
బ్రతిదినంబునుఁ బంచబాణుఁ డుండు
కావున స్త్రీల యంగంబుల శుక్లప
క్షంబుల నెక్కుఁ గృష్ణముల దిగును

గీ.విటులు తలములు పదియాఱు విస్ఫులింగ
భావములుగాఁగఁ జూచి యప్పట్లు దలఁచి
పొందనేర్చిన మోహంబుఁ బొడముచుండు
తరుణి వలపించు మందులఁ దలఁపనేల.

తా.తల, ఱొమ్ము, చేతులు, కుచములు, తొడలు, బొడ్డు, నొసలు,కడుపు, పిఱుదు, వీపు, చంకలు, భగము, కాళ్ళు మొదలగు పదియారుతావులందువరుసగా దినదినమును మన్మథుడుండును. కాన నా యంగముల శుక్లపక్షమందెక్కుచు కృష్ణపక్షమందు దిగుచుండును. కావున పురుషులు యీ తావులనుదెలిసి స్త్రీలను రమించినయెడల స్త్రీలకు వలపు పుట్టును. కావున స్త్రీలకు వలపుపుట్టు మందులకొఱకు ప్రయత్నింప ననవసరము.

వ.ఇట్లు నందికేశ్వరు మతానుసారంబుఁ జెప్పి ఘోణికాప్రోక్తంబగు షోడశకళాస్థానమాత్రస్వరూపాక్షరభావంబు వివరించితిని. ఇంక దినభోగక్రమంబు వివరించెద.

## పాడ్యమియొక్క వివరము

శ్లో.కంఠే సంశ్లిష్యగాఢం శిరసి విదధశ్చుంబమోష్ఠౌ రదాగ్రై
రాపీడ్యాచుంబ్యగండౌ విరచితపులకాఃపృష్ఠతః పార్శ్వయోశ్చ|
దత్త్వా సూక్ష్మంనఖాంకం మృదుకరజముఖై రంజయన్తోనితంబ
ప్రాగ్భారం మన్దసీత్కాఃప్రతిపది యువతీం నాగరాద్రావయన్తి||

చ.పతిప్రతిపత్తునందుఁ బ్రియభామినికంఠముఁ గౌఁగలించి మ
స్తతలము ముట్టి వాతెర రదంబుల నొత్తి కపోలపాళి చుం
బితముగఁ జేసి పార్శ్వములు పృష్ఠము శ్రోణితలంబు గోళ్ళ నం
చితపులకాంకము ల్వొడమ సీత్కృతి నంటినఁ బల్లవింపదే.

తా.పాడ్యమియందు పురుషుడు యిష్టురాలియొక్క మెడను గౌగలించి,తల ముట్టి పెదవి గరచి చెక్కిళ్ళు ముద్దాడి పక్కలు వీపు పిఱుదులయందు గగుర్పొడుచునట్టుల నఖక్షతములు చేసి సీత్కారముతో నంటిన ద్రవించును.

## విదియ సవిస్తరము

శ్లో.స్తనమిలనసుఖార్తో గండపాలీం విచుంబన్
నయనకుచయుగం చాకృష్య పార్శ్వం నఖాగ్రైః|
అధరమనలిహన్ దోర్మూలచంచన్నఖాగ్రః
కతఘనపరిరంభో ద్రావయేదప్సి యుగ్మే||

చ.కుచముల బట్టి మోవి చవిఁ గ్రోలి కపోలతలంబుఁ గన్నులన్
రుచిఁగొని యొత్తి కౌగిట నిరుద్ధముగా బిగియించి కక్షస
ద్రచితనఖాంకురంబులను రంజనఁ జేసి ద్వితీయఁ బల్లవుల్
విచికిలగంధిఁ బొందుచు ద్రవింపఁగఁ జేయుదు రింపు పుట్టఁగన్.

తా.విదియయందు విటులు చన్నులను బట్టి అధరము చుంబించి చెక్కిళ్ళనుగన్నులను ముద్దాడి గాఢాలింగన మొనర్చి చంకలయందు నఖక్షతము లుంచి సంతోషించునట్లు స్త్రీలను రమించి ద్రవింపజేయుదురు.

## తదియయొక్క విశేషము

శ్లో.తృతీయాయాంశ్లిష్యన్నిబిడతనుమాపాద్యపులకం
ముహుర్బాహ్వోర్మూలే మృదులిఖితపార్శ్వః కరరుహైః|
భుజాపీడం కంఠే దశనవశనాస్వాదతరలః
స్తనోపాన్తారబ్ధచ్ఛురితమబలాం విహ్వలయతి||

చ.తదియను వల్లభు ల్సతులఁ దత్తర మందఁగఁ గౌఁగలించి స
మ్మదమునఁ గక్షపార్శ్వములు మార్దవ మొంద నఖాంకరాంకుము
ల్పొదవుచు మోవి యాని గళము న్గబళించి కుచాంతరంబునన్
మొదలిటిగోరునన్ ఛురితము న్ఘటియింప ద్రవింతు రింపుగన్.

తా.తదియయందు విటులు స్త్రీలను తొట్రుపాటు నొందక కౌగలించి,ప్రక్కలయందును చంకలయందును నఖక్షతము లొనర్చుచు, అధరపానము చేసిమెడను బట్టి, చన్నులచివర మొదటివ్రేలిగోరుచే ఛురితమనే నఖక్షతమును చేయగాప్రీతిచే ద్రవించును.

## చవితియొక్క సామ్యము

శ్లో.చతుర్థ్యామాలింగ్య స్ఫుటమలఘుసంపీడిచకుచా
దశన్తోబింబోష్ఠం నఖలిఖితవామోరుఫలకాః|
దదన్తో దోర్మూలే ఛురితమసకృన్నీరజదృశః
శరీరే క్రీడన్తి స్మరరసనదీనిర్భరజలైః||

చ.చవితిని వల్లభుండు రతిచంద్రనిభాననఁ గౌగలించి చ
న్గవ బిగఁబట్టి మోవిఁ జిరుకాటుల నిల్పి తదీయమంజులో
రువున నఖక్షతంబులు నిరుద్ధముఁ జేయుచు బాహుమూలము
న్దవులఁగఁ బెద్దవ్రేలు ఛురితం బొనరింప ద్రవించు నెంతయున్.

తా.చవితియందు విటుడు రతికాలమందు స్త్రీని ఆలింగనము చేసి, చన్నులు పట్టి పెదవియందు చిన్నిగంటుల నుంచి యెడమతొడయందు దట్టముగా నఖక్షతములు జేయుచు, చంకలయందు పెనువ్రేలిచే నూనునట్టు ఛురితమనే నఖక్షతమొనరించిన ద్రవించును.

## పంచమి షష్ఠియొక్క సందర్భము

శ్లో.పంచమ్యాం చికురానదక్షిణకరేణాకృష్యదష్ట్వాఽధరం
దత్త్వాచూచుకయోః సఖేలపులకం చుంచేత్కుచౌ భావతః|
షష్ఠ్యాం గూఢవిగూఢగాత్రమధరం దష్ట్వాఽధి నాభీతలే
ప్రారభ్ధచ్ఛురితో లిఖేత్కరరుహైరుర్వోస్తటీరున్మదః||

క.కురు లెడమచేత నివురుచు
గురుకుచములకొనలు పుణికి గుబ్బలనెలవు
ల్వరికించుచు నధరముఁ జవి
పురిగొని పంచమిని సతులఁ బొందఁగవలయున్.

తా.పంచమియందు పురుషులు యెడమచేత ముంగురులు దువ్వుచు చనుగొనలను నలుపుచు, చన్నులను బట్టి, మోవి యాని స్త్రీని రమించి ద్రవింపజేయవలెను.

## షష్ఠి విషయము

ఆ.బిగియఁ గౌఁగలించి బింబాధరం బాని
నాభియందు ఛురితనఖము నిడుచు
తొడలు గోర నొత్తి తొయ్యలిఁ గలిసిన
షష్ఠియందు మదనజలముఁ జిలుకు.

తా.షష్ఠియందు పురుషులు గాఢాలింగనము గావించి, యధరపానమునుజేసి, బొడ్డునందు ఛురితమను నఖక్షతమును జేయుచు, తొడలయందు గోళ్ళతోనొత్తి రమించినచో స్త్రీ ద్రవించును.

## సప్తమి విషయము

శ్లో.మృదితమదనవాసో దస్తవాసో విహానః
కరజకలితకంఠోపా స్తనక్షః కపోలః|
కృతఘనపరిరంభః సంభృతానంగరంగో
గమయతి మృదుభావం భామినీమహ్నిభానోః||

చ.అతనుగృహంబు ముట్టి యధరామృత మాని గళంబున న్నఖ
క్షతములు నించి వక్షమున గండతలంబున గోరు లొత్తుచున్
గృతపరిరంభులై మదనకేళిఁ బ్రవీణతఁ జూపి వల్లభుల్
సతులఁ గరంగఁజేయుదురు సప్తమి మన్మథవారి యుబ్బఁగన్.

తా.సప్తమియందు విటులు యోని నంటి, మోవి యాని, మెడయందునుఱొమ్మునను చన్నులను చెక్కిళ్ళను నఖక్షతములు జేయుచు, కౌగలించి రతియందుసామర్థ్యమును జూపి స్త్రీలకు వలపు పుట్టించి మదనజల ముబ్బునట్లొనర్తురు.

## అష్టమి నవమియొక్క నిర్ణయము

శ్లో.అష్టమ్యాం పరిరంభ్య కంఠమసకృన్నాభిం నఖైరంచయన్|
దష్టౌష్ఠః పులకం దదత్కుచరిటీం చుంబేద్వ్యమృదోచ్చకైః||

శ్లో.నాభీమూలవిలోలపాణిరధరం దృష్ట్వా స్తనౌ పీడయన్|
మృద్నియాద్ మదనాలయం చ విలిఖన్ పార్శ్వం నవమ్యాం నఖైః||

ఆ.గళముఁ గౌఁగిలించి కరరుహంబుల నాభిఁ

జఱచి పెదవిఁ గఱచి చన్నుదోయి
ముద్దుఁ బెట్టుకొనుచు ముదితలఁ బల్లవు
లష్టమిని రమింతు రిష్టగతుల.

తా.అష్టమియందు విటులు మెడను గౌగలించి, గోళ్ళతో బొడ్డు నిమిరి, అధరామృత మాని, చనులు ముద్దుపెట్టుకొనుచు స్త్రీల నిష్టరీతి ననుభవింతురు.

క.నవమిని నధరామృతమును
జవిఁగొని చనులంటి నాభిఁ జప్పట లిడుచున్
గవిసి నఖంబుల నెలవులు
నివురుచు దృఢరతుల సలిపి నెగడఁగవలయున్.

తా.నవమియందు పురుషులు మోవి యాని, చన్నులను ముట్టి, నాభిని దట్టుచు నఖక్షతస్థానములందు దడవుచు, కఠినరతు లొనర్చినచో స్త్రీలు ద్రవింతురు.

## దశమి నిదానము

శ్లో.లలాటమాచుంబ్య నఖైర్లిఖన్తః శిరోధరాం భ్రామితవామహస్తాః।
కటిస్తనోరస్స్థలపృష్ఠమధ్యే స్మరం దశమ్యాం ప్రతిబోధయన్తి॥

ఆ.అళికచుంబనంబు లలరించి నఖములఁ
గంఠ మొత్తి వామకరమునందు
నురము పిఱుఁదు వీపు గురుకుచయుగళంబుఁ
దడవ దశమిసతికి ద్రవము పుట్టు.

తా.దశమియందు పురుషులు నుదురును ముద్దు పెట్టుకొని నఖములతో కంఠము నొత్తి ఱొమ్ము పిఱుదులు వీపు కుచములు యెడమచేత దడవగా స్త్రీకి ద్రవము పుట్టును.

## ఏకాదశియొక్క నిశ్చయము

శ్లో.ఏకాదశ్యాం కరజకలితగ్రీవమాలింగ్య గాఢం
పాయం పాయం దశనవసనం కించిదాలీలలోలమ్।
ఘాతం ఘాతం హృది సహసితం మన్మథాగారముద్రా
భంగక్రీడాతరలితకరాః కామినీ ద్రావయన్తి॥

మ.విటుఁ డేకాదశిఁ గాంతకంఠము నఖావిష్టంబుగాఁ జేసి కౌఁ
గిటఁ గీలించి రదచ్ఛదామృతము గాంక్షీభూతుఁడై క్రోలి సం
ఘటితోరుస్థలవక్షుఁడై నగవుతోఁ గందర్పసందేశల
పటహస్తాంగుళుఁ డైన నీరు వెడలు న్బంచాస్త్రగేహంబునన్.

తా.ఏకాదశియందు విటుఁడు మెడయందు నఖక్షతము లుంచి కౌగలించి యధరామృత మాని ఱొమ్మున ఱొమ్ము గ్రుమ్ముచు, హసించుచు యోనియందు వ్రేళ్ళను ద్రిప్పుచు స్త్రీని రమించినచో ద్రవించును.

## ద్వాదశి త్రయోదశియొక్క వినియోగము

శ్లో.ద్వాదశ్యాం పరిరభ్య గాఢమసకృచ్చుంబన్కపోలే దృశో
రున్మేషం విరధీత సీత్కృతిజుషో వ్యాదష్టదన్తచ్ఛదః।
చుంబన్గండతటీం మనోభవతిథౌ మృద్నన్ ససీత్కం కుచౌ

కాన్తాం ద్రావయతి ద్రుతం కరరుహైర్భిన్దన్ శనైః కందరాం||

క. పారణను జెలిని గౌఁగిటఁ
జేరిచి కెమ్మోవిఁ గఱచి చెక్కులపై దాఁ
గోరిడి గళరవ మిచ్చిన
మారుని మదజలముఁ జూపు మనసు న్దనియున్.

తా.ద్వాదశియందు స్త్రీని కౌగలించి పెదవి కరచి కంఠధ్వని పుట్టున టుల చెక్కుపై నఖక్షతము లుంచినచో ద్రవించును.

ఆ.గుబ్బ లరియఁబట్టి గోరుల మెడ యొత్తి
గళరవంబు చెలఁగ గండతలము
చుంబనంబుఁ జేయుచును ద్రయోదశియందు
పల్లవుండు గదియఁ బడఁతి చొక్కు.

తా.త్రయోదశియందు విటుడు కుచములు పట్టి కంఠమునందు నఖక్షతము లుంచి గళరవంబులు పుట్టునట్లు దవడలను ముద్దాడి రమింపగా స్త్రీ చొక్కి ద్రవించును.

## చతుర్దశి పున్నమ యవమసల సవిస్తరము

శ్లో.కన్దర్పారితిథౌ నిచుంబితదృశో దోర్మూలచంచన్నఖాః
కామాగారనివేశితద్వకరాః క్రీడన్తి కాన్తాతనౌ|
దర్శే పూర్ణతిథౌ చ నర్తితనఖాః స్కంధస్థలీరంగకతోఽ
నంగాగారచుచూలికాంచితకరాః కుర్యుః స్త్రియం విహ్వలాం||

ఆ.నయనయుగము చుంబనము చేసి చెక్కుల
గోరు లొత్తి మదనగృహమునందు
కరికరంబునటులఁ గరములు వెసఁ ద్రిప్పి
పొందవలెఁ జతుర్దశిం దరుణిని.

తా.చతుర్దశియందు విటులు కన్నులు ముద్దుగొని దవడలయందు నఖక్షత ము లుంచి భగమునందు ఏనుగుతొండమువలె హస్తమును ద్రిప్పి స్త్రీని రమించిన ద్రవించును.

క.పున్నమ నమవస నఖముల
వన్నియయంగముల మెలపి వలపులు గదియన్
జన్నులు కరములఁ బుణుకుచుఁ
జెన్నుగ రమియింపఁ జెలులు చిక్కుదు రాత్మన్.

తా.పున్నమ నవమలయందు పురుషులు స్త్రీలయొక్క శరీరములందు నఖక్షతము లుంచి వలపు గలుగునట్లు చేతులతో చన్నులను పుణుకుచు లెస్సగా రమించిన ద్రవింతురు.

వ.ఇది నందికేశ్వర ఘోణికాపుత్ర మతానుసారంబు లిఁక వాత్స్యాయన సూత్రప్రకారంబు వివరించెద.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే చంద్రకళాధికారో నామ ద్వితీయః పరిచ్ఛేదః

# సురతభేదే జాత్యధికారః
# తృతీయః పరిచ్ఛేదః

## భగదండప్రమాణరతుల లక్షణములు

శ్లో.ఆరోహపరిణాహాభ్యాం షణ్ణవద్వాదశాంగుళైః|
గుహ్యైశ్శశో వృషోఽశ్వో నా హరిణ్యశ్వేభికాః స్త్రియః||

శ్లో.హరిణీశశయోర్యోగే వడవావృషయోస్తథా|
హస్తినీహయయోశ్చైవ మతం సమరతం త్రయమ్||

శ్లో.మృగీవృషం చ వడవాహయముచ్చతరం ద్వయం|
వీచద్వయం చ వడవాశశకం హస్తినీవృషమ్||

సీ.పురుషులు శశ వృష తురగజాతులు వీరి
శాఖలు దీర్ఘవిశాలములును
నారు తొమ్మిది ద్వాదశాంగుళపరిమాణ
మయ్యెను మఱియు నతయ్యతివలకును
హరిణియుఁ దురగియు హస్తిని యననొప్పు
నీప్రమాణమె మరునింటిలోతు
హరిణియుఁ గుందేలు నశ్విని వృషభంబు
హస్తికి ఘోటక మమరుపొందు

ఆ.జాతిజాతి కూడ సమరతి యయ్యెడి
నుచ్చమయ్యె మృగియ నుక్షమంబు
నశ్వినియు హయమ్ము నత్యుచ్చమయ్యెను
హరిణి హయము శశము హస్తినియును.

తా.శశము, వృషభము, తురగము, యని పురుషజాతులు మూడు. ఈ జాతులయొక్క శిశ్నములప్రమాణము వరుసగా, ఆరు, తొమ్మిది, పదిరెండు, అంగుళము లుండును. హరిణి, తురగి, హస్తిని, యని స్త్రీజాతులు మూఁడు. ఈ జాతుల భగములు లోతు క్రమముగా, ఆరు, తొమ్మిది, పదిరెండు, అంగుళ ముల ప్రమాణ ముండును. శశము హరిణియు, వృషభము అశ్వినియు, తురగము హస్తినియు, కూడినచో సమరతి యగును. వృషభము హరిణియు, అశ్విని హయ మును గూడిన నుచ్చరత మగును. హయము హరిణియు, శశము హస్తియు గూడిన నత్యుచ్చరత మగును.

శ్లో.అత్యుచ్చమతినీచం చ మృగశ్వం హస్తినీశశమ్|
ఇతి ప్రమాణభేదేన నవధా రతమూచిరే||

ఆ.నీచరతము లశ్వినీశశకంబులు
హస్తినీశశంబు లధికనీచ
రతులు హరిణియును దురగములు కరిణియు
శశకములు విరుద్ధజాతు లయ్యె.

తా.శశము నశ్వమును శశము హస్తినియు గూడిన నీచరతి యగును. అశ్వము హరిణియు, శశము కరిణియు గూడిన అతినీచరత మగును.

శ్లో.ఉత్తమాని సమాన్యాహుర్మధ్యముచ్చరతం ద్వయమ్|
నీచద్వయం తథాఽత్యుచ్చమతినీచం మహాధమమ్||

క.సమరతి యుత్తమ మగు మ
ధ్యమ ముచ్చరతద్వయంబు నత్యుచ్చము నీ
చము నతినీచం బధమము
క్రమమున నిది యెఱిఁగి పొందఁ గావలయు విటుల్.

తా.ఉత్తమము, మధ్యమము, అధమము, అని రతి త్రివిధము. ఆరతుల యందు సమరతి యుత్తమమనియు, ఉచ్చరతిద్వయమును, అత్యుచ్చరతిద్వయ మును మధ్యమమనియు, నీచరతములు, అతినీచరతములు అధమమనియు జెప్పం బడియె గాన వీని నెఱింగి విటులు స్త్రీలను రమింపవలెను.

## అతృప్తిస్త్రీబాధలక్షణము

శ్లో.కండూతేరప్రతీకారాదన్తర్లింగావిమర్దనాత్|
న ద్రవన్తి న తృప్యన్తి యోషితో నీచమోహనే||

శ్లో.ఉచ్చేపి మృదుగుహ్యాన్తఃసంపీడాసవ్యథో హృది|
న ద్రవన్తి న తృప్యన్తి మనస్త్రస్త్రో హి మన్మథః||

ఉ.దూల జనించు నీచరతిఁ దొయ్యలికిన్ రతితృప్తి లోక లోఁ
జాలఁగ నొప్పి పుట్టు నెడజాలక యుచ్చరతంబునందు నా
కాలమునందు హృద్వశుఁడు కాముఁడు గావునఁ జిత్తతృప్తినిం
బాలఁ జేయ కెక్కుడుగఁ బారిన బాధ జనింపకుండునే.

తా.పడతికి నీచరతిచేత తృప్తిలేక యోనియందు దురద పుట్టును. ఉచ్చర తముచేత లోపలిభాగము చాలక భగములోపల నొప్పి పుట్టును. రతికాలమందు బ్రియుడు తృప్తిపొందింపలేనిచో స్త్రీలకు యెక్కువబాధ కలుగును.

శ్లో.రక్తజాః కృమయః సూక్ష్మామృదుమధ్యోగ్రశక్తయః|
స్మరసద్మని కండూతిం కండూవ్యపన యాదతః||

శ్లో.చణ్డధ్వజాభిఘాతేన కండూవ్యపన యాదతః|
క్షరణాచ్చసుఖం తాసాం విసృష్టేః స్యన్దనాత్మనః||

శ్లో.ప్రారంభాత్ప్రభృతి స్యదః క్లేదాత్మా సుఖలేశదః|
అంతే తు నరవత్తాసాం విసృష్టేర్మూర్ఛనాసుఖమ్||

వ.మఱియు నిదియుం గాక నీచరతిచేత సూక్ష్మజంతువులు రక్తంబులో జన్మించి మదనమందిరమున దూల జనింపఁజేయును. ధ్వజదండాఘాతంబున శమించి ద్రవంబుఁ గల్పించు, నాద్రవం బంతర్ద్రవం బనియి బహిర్ద్రవం బనియు ద్వివి ధంబు. బహిర్ద్రవం బెడతెగక వెలుపలికి వెడలుచుండు నదియు సుఖంబునకు దూరంబు. మొదలనుండియు నధికద్రవంబు సుఖంబు నీయదు. కావున గ్రమ క్రమంబున న్బొడము నంతర్ద్రవంబు సుఖకారణంబును మోహకారణంబును నగు. అంతర్ద్రవంబు కామినికిఁ బరవశత్వకారణంబు. అది యెట్లన్న వివ రించెద.

## పరవశత్వలక్షణము

శ్లో.క్షణం రటన్తి నృత్యన్తి రుదతీ చాతివిహ్వలా|

నిస్సహత్వం తదా యాతి ముకుళీకృతలోచనా॥

క. కొసరుంబలుకులు వలుకుచు
విసువక తహతహ నటించు విహ్వల యగుచున్
రస మొలుక గ్గనుమూయుచు
నసురై పరవశత నొందు రంగన రతులన్.

తా.స్త్రీలకు రతికాలమందు కొసరికొసరి మాట్లాడుచు శ్రమనొందక తొట్రుపాటుచేత కలతపడుచు శృంగార ముప్పొంగునట్లు నేత్రములు ముకుళింపజేయుచు బడలికచేత రతియందు మైమరచును.

శ్లో.స్త్రీపుంసయోర్విసృష్టిశ్చ లఘుమధ్యచిరోదయా।
నవధా రతమేవం స్యాత్ కాలతోపి ప్రమాణవత్॥

శ్లో.మందమధ్యమచండాః స్యుర్వేగతోప్యుభయే తథా।
వేగః కాముకతా జ్ఞేయస్తేనాపి నవధా రతమ్॥

శ్లో.వీర్యం బహక్షతాఘాతసహత్వం రతిలోలతా।
చండవేగస్య చిహ్నాని మందవేగే విపర్యయః॥

శ్లో.ఏతేషాం మధ్యవేగే తు మధ్యమత్వం సమున్నయేత్।
ప్రమాణకాలభావైః స్యురిత్యేనం సప్తవింశతిః॥

శ్లో.రతాని తత్ర సామ్యే స్యుః త్రిభిః సురతముత్తమమ్।
సర్వవైషమ్యతస్తు స్యాదధమం పశుచేష్టితమ్॥

శ్లో.శేషే తు మధ్యమత్వం స్తాదేకత్రాపి జుగుప్సితమ్।
అత్యుచ్చ మతినీచం చ సంక్షేపాదితి భాషితమ్॥

శ్లో.ఉక్తం మృగ్యాదిభేదానామిదానీం చిహ్నముచ్చతే।
స్వభావగుణభేదేన వాత్స్యాయనమతోదితమ్॥

వ.ఇంకఁ గాలప్రమాణాదుల ననుసరించి లఘు, మధ్య, మచిరములని రతి త్రివి ధంబై స్త్రీపురుషులకాముకత్వమున మంద, మధ్యమ, చండవేగముల ననుస రించి నవవిధంబు లగు. రతియం దుండెడి యుత్సాహమున నఖక్షతదంతక్షతతా డనంబులచేత వీర్యమును స్తంభింపఁజేసి వేగములను మార్చుకొనుట కాలభావప్ర మాణములనుబట్టి గుర్తెఱుంగవలయు. అందు స్త్రీపురుషలింగంబులు సమంబగు త్రివిధంబులు సమరతంబు లగు. అన్యంబులు విపరీతములై యుచ్చనీచరతంబు లనంబడు. జాతిప్రమాణకాలవేగాదు లెఱుంగక చేయు రతులు పశుచేష్టితంబు లనంబడు. ఈయధమరతంబులు జుగుప్సామూలంబు లగుటచే నత్యుచ్చరతుల నియు నతినీచరతులనియు సంక్షేపముగా వాడఁబడుచున్నవి. ఇంక వాత్స్యాయనమతానుసారంబుగ షణ్ణవద్వాదశప్రమాణంబులు గల మృగాదిస్త్రీలక్షణము లెఱింగించెద —

## హరిణీజాతి స్త్రీలక్షణము

శ్లో.సమమూర్ధా కుంచితఘనకేశీ తుచ్ఛోదరీ నితంబాఢ్యా।
అల్పవివరనాసాపుటవికచరుచితపక్ష్మలాక్షీ చ॥

శ్లో.అరుణాధరకరచరణా కోమలతరసరణభుజలతికా చ।
ఆయతకర్ణకపోలగ్రీవాఽ నతిమాంసలోరుజఘనా చ॥

శ్లో.సమగుల్ఫా మదగజగతిరీర్ష్యాకులితోన్నతస్తనీ తన్వీ|
తరలమనాస్సుకుమారా లఘుకోపా సురతలంపటా లఘుభుక్||

శ్లో.కుసుమసురభిరతిసలిలా సరళాం గుళిరలసమధురోక్తిః|
నిమ్నషడంగుళగుహ్యా ఋజుతనురనురాగిణీ హరిణీ||

సీ.వట్రువతల నీలవక్రకేశంబులు
కలదు లేదను కౌను వలదపిఱుఁదు
ముకు గోళ్ళు లఘువులు వికచాబ్జములు కన్ను
లరుణము ల్కరచరణాధరములు
చేతులు మెత్తన చెవి ముక్కు మెడయును
నిడుదలు జఘనంబు తొడలు నునుపు
సమగుల్ఫములు గుబ్బచన్నులు గజయాన
వలఁతిరూపంబు చంచలపుమనసు

గీ.కోప మల్పంబు కొంచెపుఁ గుడుపు రతికిఁ
బ్రేమ గల దబ్జగంధంబు కామజలము
నలసమధురోక్తి సరళంబు లంగుళములు
హరిణిగుహ్యంబులోఁతు షడంగుళములు.

తా.గుండ్రమైనతలయు నల్లనై చుట్టుకొనియుండు వెంట్రుకలును చిన్న ముక్కు గోళ్ళును సన్ననినడుమును గొప్పపిఱుఁదులును తామరపువ్వువంటి కన్ను లును ఎఱ్ఱనైనచేతులు పాదములు అధరము, మెత్తనిచేతులు నిడుపగు చెవులు చెక్కులు మెడయు, నునుపగు పిఱుదులు తొడలును సమములైన మడమలు బటు వగు చనులును దంతిగమనమును మంచిరూపమును చంచలమైనమనస్సు కొంచెమగు కోపము భోజనమును రతియందు ప్రీతియు తామరవాసనగల రతిజలమును తిన్నని తేటమాటలును చక్కని వ్రేళ్ళును ఆరుఅంగుళముల లోతుగల భగమును యీలక్ష ణములు గలస్త్రీ హరిణీజాతిస్త్రీగా తెలియందగినది.

## అశ్వినిజాతి స్త్రీలక్షణము

శ్లో.నిమ్నసమున్నతమూర్ధా స్థూలసరళసాంద్రశిరసిజప్రచయా|
ఉత్పలదళచలనయనా స్థూలాయతకర్ణయుగళవదనా||

శ్లో.స్థూలరదనరాజి రాయతదంతచ్ఛదపీనకఠినకుచకలశా|
సులలితమాంసలబాహుః తుచ్ఛోదరీ కమలమృదుపాణిః||

శ్లో.విస్తృతహృదయకపాటా గద్గదమధురోక్తిర్భ్యయోద్విగ్నా|
నిమ్నసువర్తులనాభిర్వక్త్రురుచిరజఘనసమలఘూరుశ్చ||

శ్లో.విపులకటిర్నతమధ్యా ఖేలాలసగమనరక్తసమచరణా|
చపలహృదయ కోమలతనుర్నిద్రాహారప్రియా ప్రియప్రవణా||

శ్లో.ప్రథమచరమధాత్వధికా పీతపలలగంధిసురతాంబుః|
క్షరణమదనరణగుణినీ పహతి చ వడవా నవాంగుళమ్ గుహ్యమ్||

సీ.పొడవగు తలకేశములు శిరంబును బెద్ద
యుత్పలనేత్రబాహువులు మృదువు
వలుదలు గళకర్ణవదనదంతంబులు

బిగిచన్ను లొక్కింత పెద్దపెదవి
గద్గదస్వర సన్నకౌను వెడఁదఱొమ్ము
కొలఁదిలోఁతగు నాభి కుపితచిత్త
సమమూరుయుగళంబు సమహస్తపదములు
వట్రువజఘనంబు వలఁతినడక

ఆ.నీచ చపలహృదయ నిద్రాశనాధిక
పసపువన్నె మాంసరసముకంపు
ప్రీతిజలము శ్లేష్మవాతధాతువుమేను
హయకు లోఁతు తొమ్మిదంగుళములు.

తా.గొప్ప తలవెండ్రుకలును, పెద్దతలయు, వలువలవంటినేత్రములు, మృదువగు భుజములు, సుందరములైన మెడ చెవి ముఖము దంతములును, కఠినమైన చనులును, కొంచెము పెద్దపెదవియు, డగ్గుత్తికయు, సన్ననినడుమును, విశాలమైన ఱొమ్మును, కొంచమై లోతైన బొడ్డును, కోపహృదయమును, సమాన మైన తొడలు కాళ్ళు పాదములును, గుండ్రమైన పిఱుందును, మంచినడకయు, అల్పమై చపలమగు మనస్సును, అధికనిద్ర భోజనమును, సువర్ణకాంతిగల శరీ రమును, మాంసమువాసనగల రతిజలమును, శ్లేష్మవాతధాతువుగల శరీరమును, తొమ్మిది అంగుళములు లోతుగల భగమును గలస్త్రీని అశ్వినిజాతిస్త్రీగా తెలియందగినది.

## ద్వాదశహస్తినీలక్షణము

శ్లో.పృథుభిరలికగండశ్రోత్రనాసాపుటైర్యా
కరచరణభుజోరుద్వంద్వకైర్హ్రస్వపీనైః।
దరవినమితఖర్వస్థూలయా గ్రీవయా చ
ప్రకటరదశిఖాభిః కున్తలైః స్థూలనీలైః॥

శ్లో.అనవరతరతార్తిః కుంభిగంభీరకంఠ
స్వరశబలశరీరా స్ఫారలంబాధరోష్ఠీ।
విపులమదనతోయా కోపనా పింగళాక్షీ
కరిమదమదనాంబుః ప్రాయశో గూఢపాపా॥

శ్లో.అతిబహుదరదోషా హస్తినీ దండసాధ్యా।
వహతి చ రవిసంఖ్యైరంగుళైర్గుహ్యదేశమ్॥

సీ.చెక్కులు పిఱుఁదును ముక్కు పెదవిపెద్ద
ప్రియము నిద్దుర బహుపింగళాక్షి
కుఱుచయు వలమునై యొరఁగినమెడ చాల
నిడుపైన పండ్లును నొడలుదళము
సతతరిరంసాఢ్య సామజస్వర సీత
లాంగి లోలాత్మ బింబాధరోష్ఠి
కరిమదమదనాంబుకణజాలవారుణీ
మదలోల జుంజురుపొదలు కురులు

ఆ.కఠినరతులఁ గాని కరుఁగది మదిలోనఁ
బొగడఁదగినమేను మిగులఁ గుఱుచ
మరునిగృహములోఁతుఁ బఱికించి చూచిన
హస్తినికిని ద్వాదశాంగుళములు.

తా.గొప్పవైనదవడలు పిఱుందులు ముక్కును, పెద్దపెదవియు, నిద్రయం దాసక్తియు, కపిలవర్ణముగల కండ్లును, కొంచమై మనోహరమై వంకరయైన మెడయు, నిడుపగు పండ్లును, మందమైనశరీరమును, ఎప్పుడు రతిప్రియమును, యేనుగుస్వరమును, శీతలదేహమును, చంచలహృదయమును, వ్రేలాడుచున్న క్రిందిపెదవియు, యేనుగుమదము వాసనగల రతిజలమును, మద్యపానప్రియమును, విరియబోసుకున్న వెంట్రుకలును, కఠినరతులకుగాని కరుగని మనస్సును, పొగడ దగిన శరీరమును, పొట్టితనమును, పదిరెండుఅంగుళములలోతుగల భగమును గల స్త్రీని ద్వాదశహస్తినిగా తెలియందగినది.

## శశజాతిపురుషలక్షణము

శ్లో.ఆత్రామస్ఫారనేత్రా లఘుసమదశనా వర్తులాస్యాః సువేషాః
మృద్వారక్తం వహస్తః కరమతిలలితం శ్లిష్టశాఖం సువాచః|
వృత్తవ్యాలోలలీలాః సుమృదుశిరజా నాతిదీర్ఘాం వహన్తో
గ్రీవాం జానూరుహస్తే జఘనచరణయోర్బిభ్రతః కార్శ్యముచ్చైః||

శ్లో.అల్పాహారాల్పదర్పా లఘుసురతరతాః శౌచభాజో ధనాఢ్యాః|
మానోదీర్ణాః శశాః స్యుః సురభిరతజలాః కాంతిమంతః సహర్షాః||

చ.కనుగవకెంపు వట్రువమొగంబు శరీరము సుందరంబు వ
ర్తనము నిరూఢి యల్పసమదంతము లింపగువాక్కు మానమం
డనుఁడు కటోరుజానుచరణంబులు హీనము లన్నమించుకొ
ధనపతి స్వల్పభోగి శుచి తామరకంపు శశంపుజాతికిన్.

తా.ఎఱ్ఱనికండ్లును, గుండ్రమైన మొగమును సుందరమైన దేహమును స్థిరమైన వ్యాపారము కొంచెమై సమమైనపండ్లును ప్రియమైనవాక్కును మానమే భూషణముగా గలవాడును చిన్నవియైన తొడలు చేతలు మోకాళ్ళు పాదములును కొద్దిభోజనమును ధనము గలిగియుండుటయు కించిదనుభవమును పరిశుభ్రతయు తామరవాసనగల రతిజలమును గలపురుషుని శశజాతిగా నెఱుంగునది.

## వృషజాతిపురుషలక్షణము

శ్లో.స్ఫారాభ్యున్నతమస్తకాః పృథుతరే వక్త్రాలికే బిభ్రతః
స్థూలగ్రీవ సుమాంసల శ్రుతిభృతః కూర్మోదరాః పీవరాః|
దీర్ఘప్రోన్నతకక్షలంబితభుజా ఆరక్తహస్తోదరా
రక్తాంతఃస్థిరపక్ష్మలాంబుజదళచ్ఛాయేక్షణాః సాత్వికాః||

శ్లో.ఖేలత్సింహపదక్రమా మృదుగిరః పీడాపహాస్త్యాగినో
నిద్రాసక్తిభృతస్త్రపావిరహితా దీప్తాగ్నయః శ్లేష్మలాః|
మధ్యాన్తే సుఖినోఽతిమజ్జనపుషః సక్షారమేదోధికాః
సర్వస్త్రీసుభగా నవాంగుళమితం లింగం వృషా బిభ్రతి||

సీ.అతివిశాలోన్నతమగు మస్తకము మెడ
వలము వక్త్రాళికంబులు ఘనములు
చెవులు చక్కన నిడుచేతులు కూర్మోద
రము కరాంగుళుల నఖములు కెంపు
నరుణాంతనేత్రము లలసాననము మంజు
భాషలు త్యాగి యాపదల కోర్చు
నాఁకలి పెద్ద నిద్రాసక్తుఁ డతిసత్త్వ

శాలి శ్లేష్మకుఁడు లజ్జారహితుఁడు

గీ.ప్రౌఢవయసున సుఖి రుధిరంబుఁ గలుగు
మేను కారంబు వలపగు మానినులకు
వలవఁదగువాఁడు తొమ్మిదంగుళులదండ
మతఁడు వృషజాతిపురుషుఁ డత్యంతభోగి.

తా.మిక్కిలి విశాలము పొడవునైన శిరస్సును మంచిమెడయు గొప్పముఖ ము నొసలును చక్కనిచెవులు నిడుపైనచేతులు తాబేలుకడుపును ఎఱ్ఱనిఅర చేతులు గోళ్ళును కనుగొనలయందు ఎఱుపును మందమైన నడకయు రుచికరము లగు మాటలును దానగుణమును శ్రమకోర్చుటయు మిక్కిలి ఆకలినిద్రలును అధిక బలమును శ్లేష్మదేహమును సిగ్గులేమిని యవ్వనమందు సుఖియు కారపువాసనగల శరీరమును స్త్రీలు కోరదగినవాడును మిక్కిలిభోగియు తొమ్మిదంగుళముల దండముగల పురుషుడు వృషభజాతిగా దెలియందగినది.

## తురగజాతిపురుషలక్షణము

శ్లో.వక్త్రశ్రోత్రశిరోధరాధరరదైరత్యంతదీర్ఘైః కృశై
ర్యేస్స్యుః పీవరకక్షమాంసలభుజాః స్థూలర్జుసాంద్రైః కచైః|
ప్రౌఢేర్ష్యాః కుటిలాంగజానుసునఖా దీర్ఘాంగులిశ్రేణయో
దీర్ఘస్ఫారవిలోలలోచనభృతః పౌఢాశ్చ నిద్రాలసాః||

శ్లో.గంభీరాం మధురాం గిరం ద్రుతిగతిం పీనోరుకౌ బిభ్రతో
దీప్తాగ్నిప్రమదారతాః శుచిగిరో రేతోస్థిధాతూజ్జ్వలాః|
తృష్ణార్తా నవనీతశీతబహలక్షారస్మరాంబుద్రవా
లింగైర్ద్వాదశకాంగులైర్నిగదితా అశ్వాః సమోరఃస్థలాః||

సీ.శిరమును బెదవియుఁ జెవులును మొగమును
గడుపును బండ్లు దీర్ఘములు సన్న
ములు నాభకరకక్షములు సమభుజములు
పొందైన కచభరంబును గలాఁడు
కోపి వక్రములైన చూపులుఁ బిక్కలు
నిడువాలుఁగన్నులు నిడుపుగోళ్ళు
గంభీరమధురవాక్యములుఁ దిన్నని నడ
లాఁకలి పెద్ద నిద్రాలసుండు

ఆ.ప్రౌఢ సత్యవాది బహుభోగనిరతుండు
మెఱుపుమేను మిగులఁ దృష్ణ గలదు
చలువ గలుగు నొడలుఁ జపలచిత్తుఁడు ద్వాద
శాంగుళధ్వజుండు హయనరుండు.

తా.నిడుపగు తల పెదవి చెవులు ముఖము కడుపు పండ్లునూ, మెడ చేతులు చంకలు సన్నమును, సమానములగు భుజములును, ఒప్పగువెంట్రుకలును, కోపగుణమును, వంకరచూపులు పిక్కలును, సోగకనులును, నిడుపైనగోళ్ళును, గంభీరమై రుచికరములగుమాటలును, మంచినడకయు, మిక్కిలి ఆకలి నిద్ర భోజ నమును, ప్రౌఢత్వమును, సత్యవచనాసక్తుడును, భోగములయం దాసక్తియు, కాంతిగలశరీరమును, అత్యాశయు, శీతలశరీరమును, చంచలహృదయమును, పది రెండు అంగుళముల ప్రమాణముగల దండమును గలుగు పురుషుడు తురగజాతిగా నెఱుంగునది.

శ్లో.ఉక్తోపస్థప్రమాణస్య వ్యభిచారేపి లక్షయేత్|
శశమృగ్యాదిజాతిత్వముత్తమాధమభేదతః||

శ్లో.ఉక్తోచ్యమానసక్తవ్యలక్షణాని చ యాన్యతః|
తత్సంకరేపి బాహుళ్యాల్లక్షం నిర్ధారయేద్బుధః||

వ.పైనఁ జెప్పఁబడిన భగదండప్రమాణముల ననుసరించి శశ వృష తురగజాతులను నుత్తమాధమమధ్యమాధమములని వాడఁబడుచున్నవి. స్త్రీజాతులును నదేవిధంబని తెలియందగినది. వీనివలన సంకరంబులు కలిగినఁ బరికించి ప్రధానలక్షణం బొక్క టిఁబట్టి జాతి నిశ్చయించునది. ఇంక వయోలక్షణములు వివరించెద.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే సురతభేదేజాత్యధికారో నామ తృతీయః పరిచ్ఛేదః



# సామాన్యధర్మాధికారః
# చతుర్థః పరిచ్ఛేదః

## వయోస్వభావలక్షణము

శ్లో.బాలా స్యాత్షోడశాబ్దాత్తదుపరి తరుణీ త్రింశతిర్యావదూర్ధ్వం
ప్రౌఢా స్యాత్పంచపంచాశదవధిపరతో వృద్ధతామేతి నారీ|
దీర్ఘా కృష్ణా చ తన్వీ చిరవిరహవతీ నిమ్న కక్షా శ్లథాః స్యుః
స్థూలా గౌరీ చ ఖర్వా సతతరతిపరా వ్యూఢకక్షా ఘనాః స్యుః||

శ్లో.సంకీర్ణచిహ్నేన చ మధ్యమా స్యాదయం చ తాసాం విదితఃస్వభావః|
బాలా ఘనా బాహ్యరతోపచర్యా ప్రౌఢా శ్లథాభ్యస్తరమోహనేచ్ఛుః||

శ్లే.ఉక్తా గుణపతాకాయామనస్థాను క్రియా చ యా
తామపి న్యాయసంవిత్తిసిద్ధత్వాదాద్రియామహే||

క.పదియారు బాలకును ము
పృదియగు నేండ్లెవ్వనికిని బ్రౌఢకునైదున్
బదియేడులు నటుమీఁదటఁ
దుదియేడులు లోలకయ్యెఁ దోడ్తోవరుసన్.

తా.ఒకటిమొదలు పదియారువత్సరములవరకు బాలయనియు, పదియారు మొదలు ముప్పదివత్సరములవరకు యౌవనియనియు, ముప్పదిమొదలు ఏబదివత్స రములవరకు ప్రౌఢయనియు, నేబదిపైవత్సరముల యీడుగలవనితను లోలయ నియు తెలియందగినది.

సీ.నిడుదసన్నపునల్లయొడలును సంయోగ
రహితయు శ్లథయను రమణికయ్యె
వలము గుజ్జును బాండువర్ణంబు సంతత
రతమును ఘనయను నతివకొనరు
దళసరి నాటపాఁటలయందునయ రతి
పాటవంబునఁ బ్రౌఢభామ దనరు
సంతతరతిఘనకాంత బాలికయును
భామయుఁ దద్భోగభాగ్యకరము

గీ.ప్రౌఢశ్లథయును బ్రీతులభ్యంతరరతికి
బాల ఘనయును బ్రీతులు బాహ్యరతికి
నీవిధంబులఁ గలిసి రమించు తెఱఁగు
గుణపతాకాదులందుఁ బేర్కొనెను గనుఁడు.

తా.నిడివియై సన్నమై నల్లనైనశరీరమును సురతరాహిత్యమును గలది శ్లథ యనియు, బలుపును పొట్టియు పాండువర్ణమును నిరంతరరతిసుఖమును గలది ఘన యనియు, దళసరియైనశరీరమును నాటపాటలయందు సమర్థతయు రతిచాతుర్య మును గలది ప్రౌఢ యనియు, ఎల్లప్పుడు రతిసుఖమును శుభకరమును గలది బాల య నియు దెలియందగినది. వీరిలో ప్రౌఢయు శ్లథయు అంతర్రతులయం దిచ్ఛగల వారినిగాను, బాలయు ఘనయు బాహ్యరతులయం దిచ్ఛగలవారినిగాను, తెలిసికొని రమింపవలెనని గుణపతాకాదులయందు దెల్పెను గాన తెలుసుకొనవలయును.

## బాలలక్షణము

ఉ.నేరనినేర్పు కౌఁగిలికి నిండనిచన్నులు సిగ్గుబాటున
న్జేరకచేరు దేహమును జిత్తడియైన మనోజహర్మ్యము
న్బీరములేనిపొందికలు ప్రీతివిలాసపుముద్దుమాటలున్
గోరకకోరు చుంబనము కొంచెపుఁజూపులు ముగ్ధభామకున్.

తా.తెలియని చాతుర్యమును, ఆలింగనమునకు దగియుండని కుచములును లజ్జచే పొందియు పొందకయుండు శరీరమును, తేమగల యోనియు, బిగిలేని కూట ములును, ప్రేమతో గూడిన శృంగారపుపలుకులును, కోరియు కోరని ముద్దులును, కొంచెమగు జూపులును గలస్త్రీ బాలయని తెలియదగినది.

## యౌవనస్త్రీలక్షణము

చ.నెఱిగలగుబ్బచన్నులును నేర్పులు గుల్కెడి వాలుచూపులున్
దరిఁగొనుమారుకేళియును దట్టపుగర్వము భూషణంబులు
న్వెరవకచేయు సేతలును వీడనికౌఁగిలి మోహకోపము
న్దుఱఁగలిఁజేయు లేఁజెమట తోరపుమాటలు యౌవనాంగికిన్.

తా.బటువగు కుచములును, శృంగారంబులగు క్రేగంటిచూపులును, యొర పగు రతియు, అతిగర్వమును, అలంకారమును, భయములేక చేయుకార్యములును, దట్టమగు కౌగిలియు, వలపుగలకోపము ప్రకాశింపఁజేయుటయు, చిరుచెమట యు లాలనపుపలుకులును గలస్త్రీని యౌవనస్త్రీగా దెలియదగినది.

## ప్రౌఢస్త్రీలక్షణము

చ.కులుకుమెఱుంగుచూపులును గొండెపుసేఁతలు తియ్యమాటలు
న్జిలిబిలిపాటలు న్గలికిచిత్తము మన్మథబంధభేదము
న్దలకొనుచుంబనంబులును దాటవపేటవభూషణవ్రజం
బలుగలుగల్గి పైకొనుచు నాసల దేల్తురు ప్రౌఢభామినుల్.

తా.శృంగారమైనకాంతిగలచూపులును, కొండెములు చెప్పుటయు, మధుర వాక్యములును, ముద్దుపాటలును, చంచలహృదయమును, బంధభేదములతో గూడిన చుంబనాదులును, కంఠహారభూషణచయంబు జిక్కువడ అలుకతో పైకొని యాసతో రమించెడి స్త్రీ ప్రౌఢయని తెలియందగినది.

## లోలస్త్రీలక్షణము

చ.సురతపుఁజొక్కులు న్వెనుక సుద్దులు సారెకు వీడెమందుట
ల్మరుపురివాడువారుటయు మందవిహారము చుంబనంబులు
న్విరివిడియైనమేను కళవీడనికూటమి చాలనవ్వులు
న్దెరలనినిద్రమోము కడుదిట్టతనంబును లోలభామకున్.

తా.రతిచొక్కులును, గతించినమాటలును, మాటిమాటికి తాంబూలము నమలుటయు, యోని వాడుబారుటయు, మెల్లగా రతి యొనర్చుటయు, ముద్దులును, డస్సినశరీరమును, కళజారనిరతియు, మిక్కిలినగవును, నిద్రతో గూడిన మొగ మును, మిక్కిలిధైర్యమును గల స్త్రీని లోలయని తెలియందగినది.

## వయోబలమాసలక్షణము

క.హేమంతంబున యౌవన
కామిని, వర్షావసంతకాలములందున్
గామించుఁబ్రౌఢ, బాలకు
నేమాసంబైన బలము నిచ్చును వరుసన్.

తా.యౌవనస్త్రీ మార్గశిర పుష్యమాసములందును, ప్రౌఢస్త్రీ శ్రావణ భాద్రపద చైత్ర వైశాఖమాసములందును, బాలస్త్రీ అన్నిమాసములయందును, వయోబలమును రతిబలమును చేష్టాసత్వములును గలిగియుండును. లోలస్త్రీ రతికి అనర్హంబును రజోహీనంబును గాన చెప్పంబడదు.

## బాలాద్యుపచారలక్షణము

శ్లో.బాలా తాంబూలమాలాఫలరససురసాహారసమ్మానహార్యా,
ముగ్ధాఽలంకారహారప్రముకవితరణైః రజ్యతే, యౌవనస్థా|
సద్భావారబ్ధగాఢోద్భటరతసుఖితా, మధ్యమా రాగలుబ్ధా,
వృద్ధాఽఽలాపైః ప్రహృష్టా భవతి గతనయా గౌరవేణాతిదూరం||

చ.ఫలరసవీటికాకుసుమభక్ష్యవిశేషములందు బాలికన్
గలితవినూత్నరత్నమయకాంచనహారములందు యౌవనిన్
లలితగుణానుకూలరతిలక్షణలీలలఁ బ్రౌఢ నిష్టభా
షల నలయించి లోల నెఱజాణలు గూడుదు రింపు వుట్టగన్.

తా.పుష్పఫలరసతాంబూలదులచే బాలను, కనకరత్నమయభూషణ వస్త్రాలంకారములచే యౌవనిని, మనోవిలాసానుకూలరతులచే ప్రౌఢను, ప్రియం బగు పల్కులచే లోలను, సంతోషపెట్టి జాణలగు పురుషులు రమింతురు.

వ.మఱియు శ్లేష్మాదిధాతువుల వర్తిల్లు స్త్రీలలక్షణంబులు వర్ణించెద.

## శ్లేష్మ పిత్త వాతప్రకృతుల లక్షణములు

శ్లో.గూఢాస్థిగ్రంథిగుల్ఫా మృదుమధురవచాః శ్లేష్మలా పద్మమృద్వీ
స్వక్తాస్థిగ్రన్థిగుల్ఫా యువతిరశిశిరైరంగకైః పిత్తలా స్యాత్|

శ్లో.రూక్షాశీతోష్ణగాత్రీ వదతి బహుతరం వాతలా శ్లేష్మలాపి
ప్యాదుష్ణా నవ్యసూతా శిశిరరతనుర్గర్భిణీ పిత్తలాపి||

శ్లో.అచిరలఘుచిరోచ్చైః కాలభావావసానాః
ప్రమదదహనగాఢద్వారగుహ్యోత్క్రమేణ|
సతతశిశిరకాలోపేతహేమంతవర్షా
మధుషు నిధువనేచ్ఛా సంప్రయోగే ప్రదిష్టా||

శ్లో.యత్ప్రకృతీనాం లక్షణమభిహితమధికంచ గుణపతాకాయాం|
తచ్చాప్యనుభవసిద్ధం స్ఫుటతరమభిధీయతే కిమపి||

శ్లో.స్నిగ్ధనఖనయనదశనా నిరనుశయా మానినీ స్థిరస్నేహా|
సుస్పర్శశిశిరమాంసలవరాంగవివరాంగనా శ్యామా||

శ్లో.భవతి విలాసప్రకృతిః పిత్తప్రకృతిస్తు మధ్యమా జ్ఞేయా|
సా భవతి గౌరవర్ణా పీనకుచా రక్తనఖనయనా||

శ్లో.కటుగంధిప్రస్వేదా క్షణం చ కుపితా క్షణం ప్రసన్నా చ|
శిశిరరతాఽఽతపవిముఖీసోష్మా ప్రశిథిలవరాంగీ చ||

శ్లో.మేధావినీ సుకుశలా వహతి రతే నిశ్చితం మృదుతామ్|
పవనప్రకృతిః పరుషా భ్రమణరతా స్యాద్బహుప్రలాపా చ||

శ్లో.దరదగ్ధద్రుమధూసరవర్ణీ బహుభోజనా చ కఠినాంగీ|
స్ఫుటితాగ్రరూక్షకేశీ కఠినతరా శ్యామనఖనయనా||

శ్లో.గోజిహ్వాభస్పర్శకఠోరవరాంగాఽధమా నారీ|
సంకీర్ణలక్షణేన చ సంకీర్ణప్రకృతిరేవ విజ్ఞేయా||

ఉ.కన్నులు గోళ్ళు పండ్లు నతికాంతులు మానవతీలలామ య
భ్యున్నతసఖ్య కోపము బ్రియోక్తులఁ దేరక తానెతేరి పై
మన్ననఁజేయు శైత్యమును మాంసలము న్స్మరమందిరంబు మై
వన్నియ శ్యామ ముత్తమము వైపగు శ్లేష్మశరీరి కిమ్మహిన్.

తా.ప్రకాశములగు కన్నులు గోళ్ళు పండ్లును, అభిమానమును, మిక్కిలి స్నేహమును, ప్రియునిమాటలచేత కోపము విడువక తనకై తానే విడిచిపెట్టి కోపములేనిదానివలె తిరిగి విటుని గొప్పచేయుటయు, చల్లనై బలిసియున్న యోనియు, శ్యామవర్ణముగల శరీరమును గణుతియు గలస్త్రీని శ్లేష్మప్రకృతిగా నెఱుంగదగును.

సీ.గౌరవర్ణంబును గఠినస్తనంబులు
గోళ్ళును గనుగొలుకులును గెంపు
నుష్ణగుహ్యాస్వేద మొగిమేనువాసన
కోపప్రసాదము ల్కొంతకొంత
యెండకుఁగాదు మైయెంతయు మెత్తన
శిశిరమన్మథకేళిఁ జిత్తగించు
నభిమానవతి మధురాలాపరాజస
మధికంబు పక్వబింబాధరోష్ఠి

గీ.మతియు నేర్పును గలుగు సీమంతినులకుఁ
బ్రియము మృదువర్తనలయందుఁ బ్రేమగలదు
పైత్యదేహంబుఁ గలిగిన పడఁతిజాడ
మధ్యమయటండ్రు నందీశుమతమునందు.

తా.తెల్లనికాంతియు, గట్టిచన్నులును, ఎఱ్ఱనిగోళ్ళు కనుగొలకులును, వెచ్చని మదజలమును, వాసనగలశరీరమును, కొంచెము కోపమును, కొంచెము దయయును, మృదువయి యెండకోర్చనిశరీరమును, శిశిరఋతువునందు రతి గోరు టయు, అభిమానమును, తియ్యనిమాటలును, మిక్కిలిరాజసగుణమును, దొండ పండువంటి క్రిందిపెదవియు, బుద్ధిచాతుర్యమును, స్త్రీలచే ప్రేమింపబడునదియు, తిన్ననినడవడికయుగల స్త్రీ పైత్యదేహి యని నందికేశ్వరమతమునందు బేర్కొనబ డెను.

ఉ.నల్లనిఛాయ క్రూరవచనంబులుఁ ద్రిమ్మటకత్తె భుక్తియున్
మొల్లము కర్కశాంగి కుచము ల్వలువంకలు కేళివాక్యము
ల్కొల్లలు గోవుజిహ్వ సరిగుల్కెడుగుహ్యము వాడికన్నులున్
గోళ్ళునుగెంపు వాతమయకోమలికి న్వనితాధమాత్మకున్.

తా.నల్లనికాంతియు, కఠినమైన మాటలును, త్రిప్పటయును, అధికభోజ నమును, కఠినమైన

అంగముగలదియు ఎక్కువవంపుగల చన్నులును, ఎక్కువ రతి ప్రీతిమాటలును, ఆవునాలికవలె యుండుభగమును, క్రూరదృష్టియు, ఎఱ్ఱనిగోళ్ళు నుగలస్త్రీ వాతదేహి యని తెలియందగినది.

క.సంకీర్ణలక్షణంబులు
సంకీర్ణప్రకృతిఁ దెలసి జాణలు మఱియున్
పంకజనేత్రలఁ గవయుదు
రింకిట సత్త్వములజాడ లే నెఱిగింతున్.

తా.జాణలగు విటులు సంకరములగు లక్షణముల స్వభావములను యె ఱింగి అనుభవింతురు. ఇఁక పదివిధంబులగు సత్త్వములజాడ లెరింగించెద.

## దేవ నర నాగ యక్షసత్త్వముల లక్షణములు

శ్లో.సురభిశుచిశరీరా సుప్రసన్నాననా చ
ప్రచురధనజనాఢ్యా భామినీ దేవసత్త్వా|
వ్యపగతగురులజ్జోద్యానపానార్ణవాద్రౌ
స్పృహయతి రతిసిద్ధ్యై రోషణా యక్షసత్త్వా||

శ్లో.భవతి సరళచిత్తా దక్షిణాతిథ్యరక్తా
స్ఫుటమిహ నరసత్త్వా ఖిద్యతే నోపవాసైః|
శ్వసితి బహుతరం యా జృంభతే భ్రాన్తిశీలా
స్వసితి సతతమేవ వ్యాకులా నాగసత్త్వా||

సుగంధి.సురభిశుచిశరీరము న్విశుద్ధవక్త్రకాంతియున్
గురుజనైకమైత్రి గల్గు కొమ్మ దేవసత్త్వయౌ
సరళహృదయము న్వ్రతోపచారమానసంబులున్
బరఁగు మనుజసత్త్వహర్షభావమానసంబులన్.

తా.పరిమళమును పరిశుద్ధమైనశరీరమును, నిర్మలమైన కాంతిగల ముఖ మును, అత్తమామలయందు ప్రీతిగలస్త్రీ దేవసత్త్వయనియు; మంచిమనస్సును వ్రతశుశ్రూషలయందు ప్రీతిన్నీ, సంతోషముతోగూడిన మనస్సుగలస్త్రీ మనుజసత్త్వయని నెఱుంగుడు.

ధ్రువకోకిల.వెడఁదయూర్పులు నావలింతలుఁ బిమ్మటంబడు చిత్తమున్
గడిఁదినిద్రయు భ్రాంతియున్గల కాంతయు న్ఫణిసత్త్వ యె
ప్పుడును గోపము పానమున్ రతి బుద్ధిహీనవివేకమున్
జెడినలజ్జయు యక్షసత్త్వకు సిద్ధముల్ పరికింపఁగన్.

తా.దీర్ఘనిశ్వాసములు, ఆవులింతలును, తొందరతో గూడియున్న హృద యమును, అతినిద్రయు, మోహమునుగలస్త్రీ నాగసత్త్వయనియు, ఎప్పుడును కోప స్వభావమును, మద్యపానమును, రతిప్రీతియు, అల్పమగుబుద్ధియు, సిగ్గులేమియు గలస్త్రీ యక్షసత్త్వయనియు తెలియందగినది.

## గంధర్వసత్త్వలక్షణము

శ్లో.అపేతరోషోజ్జ్వలదీప్తవేషాం స్రగ్గన్ధధూపాదిషు బద్ధరాగామ్|
సంగీతలీలాకుశలాం కళాజ్ఞాం గన్ధర్వసత్త్వాం యువతీం వదన్తి||

మత్తకోకిల.గర్వము న్గలహంబు నొల్లదు కాంతిగల్గిన దేహము

స్సర్వవిద్యలు నృత్యవాద్యవిశారదత్వము సౌరభా
ఖర్వధూపములందుఁ బ్రీతియు గల్గియొప్పెడుకాంత గం
ధర్వసత్త్వ యగు న్విటుల్ రతిసత్త్వము న్బరికించినన్.

తా.కోపమును తగవును లేకయుండుటయు, సౌందర్యమైన దేహమును సకలవిద్యలును నాట్యవాద్యములయందు అనురక్తియు, సువాసనగల ధూపముల యందాసక్తియు గలస్త్రీని గంధర్వసత్త్వయని రతిభావము దెలిసిన విటులు పల్కుదురు.

## పిశాచ వానర వాయస గార్దభ కూర్మసత్త్వముల లక్షణములు

శ్లో.మానోజ్ఝితాఽతిబహుభుక్ప్రకటోష్ణగాత్రీ
భుంక్తే చ మద్యపలలాది పిశాచసత్త్వా।
దృష్టిం ముహుర్భ్రమయతి ప్రబలాశనార్తి
రుద్వేగమేతి విపులం కిల కాకసత్త్వా॥

శ్లో.ఉద్భ్రాన్తదృక్కరజదన్తరణప్రసక్తా
స్స్యాద్వానరప్రకృతిరస్థిరచిత్తవృత్తిః।
యా దృష్టవిప్రియవచోరచనా చ నారీ
రక్తా విటప్రహరణే ఖరసాత్త్వికా సా॥

శ్లో.జాతిరవస్థా ప్రకృతిః సత్త్వం యాన్యుక్తాని జ్ఞేయమమీషు।
ప్రాధాన్యం ప్రకృతేః కించైనాం సంక్షేపేణ నిబోధ గిరం సః॥

మానిని.మానవిహీనము నుష్ణశరీరము మద్యపలానుభవప్రియమున్
మానినికొప్పు పిశాచసత్త్వకు మానుగవాయససత్త్వకుఁ దో
డైన పలాశయము న్జలదృష్టియు నాత్మభవంబగు చంచలతన్
వానరసత్త్వకు దంతనఖక్షతవాదనదృక్చలనాదికమున్.

తా.అభిమానములేమియు, ఉష్ణమగుదేహమును, మద్యమాంసములయందు ప్రీతియు గలస్త్రీ పిశాచసత్త్వయనియు; మాంసభక్షణమును, చంచలపుచూపును, చపలహృదయమును గలస్త్రీ వాయససత్త్వయనియు; దంతక్షతములును, నఖక్షతము లును, వాదనయు, చపలదృష్టియు గలస్త్రీ వానరసత్త్వయనియు తెలియందగినది.

కవిరాజ.విటు గదియించుట విప్రియభాషల వేగమ గార్దభసత్త్వకు నౌ
కటికచయుగ్మము దీర్ఘశరీరము క్రౌర్యపుదృష్టి యుదగ్రపులం
పటమును గూర్మపుసత్త్వకుఁ జొప్పడు ప్రాజ్ఞు లెఱుంగుఁడుజాతియుఁ బ
ర్యటనము సత్త్వము ప్రాకృతభావము యార్యమతం బిది చిత్తములన్.

తా.అప్రియవాక్యములచేత మగనిని లొంగదీయుటయు, త్వరితమును గలస్త్రీని గార్దభసత్త్వయనియు; గొప్పవైన పిఱుదులు కుచములు శరీరమును, క్రూ రపుచూపును, విషయాసక్తియు గలస్త్రీ కూర్మసత్త్వయనియు నెఱింగి ప్రాజ్ఞులగు వారు తమచిత్తములయందు యార్యమతంబగు నీసత్త్వములను జాతులను నెఱింగి రమించుట శ్రేయస్కరమని వాత్స్యాయనుని నిర్ణయము.

## సంసారమునకుఁ దగిన స్త్రీలు

శ్లో.శ్యామా కఫప్రకృతికా వడవా మృగీవా
గన్ధర్వయక్షనరనిర్జరసాత్త్వికా వా।
బాలాఽ ధవాభినవయౌవనభూషితాంగీ

సా భామినీ భవభుజాం పరమం రహస్యమ్||

శ్లో.జాతౌ చసత్త్వే వయసి ప్రమాణే ప్రధానమాహుః ప్రకృతింవధూనామ్|
తథైన తాసాముపచారమూచుః కర్ణీసుతాద్యాః కృతినో విధేయమ్||

సీ.చామనచాయల జలరుహాక్షులు నవాం
గుళషడంగుళగుహ్యబిలము లమరు
తరుణులు యక్షనిర్జరనరగంధర్వ
సత్త్వలు బాలు జవ్వనియును
శ్లేష్మకప్రకృతులు చెలువుగఁ గలిగిన
యంగన లత్త్యుత్తమాంగన లిల
సంసారసుఖసారసారరసజ్ఞులు
పాటింతు రెపుడు గోప్యంబుగాను

గీ.జాతిసత్త్వప్రమాణలక్షణమురీతి
వయసుఁ బ్రకృతియుఁ బరికించి వారివారి
గుణము కర్ణీసుతాదుల గణన లెఱిఁగి
పొందనేర్చిన సౌఖ్యంబు పొదలకున్నె.

తా.తొమ్మిదంగుళములభగము గలిగి చామనచాయగల తురగజాతిస్త్రీయై నను, ఆరుఅంగుళములభగముగల హరిణీజాతిస్త్రీయైనను, యక్ష దేవ మనుజ గం ధర్వ సత్త్వస్త్రీలలో బాలగాని యౌవనిగాని యైనను, శ్లేష్మప్రకృతిగల స్త్రీలను, ఉత్తమస్త్రీలని సంసారసౌఖ్యమును గోరు పురుషులు వరింతురు. కావున కర్ణిసు తాదులచే చెప్పబడిన జాతి సత్త్వప్రమాణ వయస్సు ప్రకృతి మొదలైన లక్ష ణంబుల దెలిసి అనుభవించినయెడల సౌఖ్యము కలుగును.

## స్త్రీల నుపేక్షించుటవలనఁ గలుగు దోషములు

శ్లో.స్వాతన్త్ర్యం పిత్రృమందిరె నివసతిర్యాత్రోత్సవే సంగతి
ర్గోష్ఠీ పూరుషసన్నిధవపనియమో వాసో విదేశే తథా|
సంసర్గః సహ పుంశ్చలీభీరసకృద్వృత్తేర్నిజాయా క్షతిః
పత్యుర్వార్ధకమీర్షితం ప్రవసనం నాశస్య హేతుః స్త్రియాః||

శ్లో.దారిద్ర్యాదసహిష్ణుతామలినకార్పణ్యాకాలాऽజ్ఞతా
పారుష్యాదతినిష్ఠురాత్ప్రుణయినో భూషానిషేధాదపి|
మిథ్యాదోషవిశంకనాదతిశయోద్యోగాద్వియోగాత్తథా
కార్కశ్యాద్వపుషో వ్రజన్తి నియతం వైరాగ్యముచ్చైః స్త్రియః||

సీ.అత్తమామలుఁ దల్లి యన్నలు మఱఁదులు
గలుగ కింటికిఁ దానె కర్తయైనఁ
బుట్టినింటనె యున్నఁ బొరుగిల్లుఁ ద్రొక్కిన
తీర్థోత్సవములకుఁ దిరుగుచున్న
పరదేశమున నున్నఁ బరపురుషులగోష్ఠి
ప్రియముఁ బుట్టిన నాజ్ఞ బెట్టకున్న
జారకాంతలతోడ సంగతిఁ జేసిన
కులధర్మ మెంతయుఁ గుటిలమైన

గీ.మగఁడు ముసలైన మిక్కిలి మలినుఁ డైన

దూర మరిగిన దీనుఁడై చేరకున్న
కఠినరతుఁడైన నేప్రొద్దుఁ గలహియైన
సతులు పరదార లగుదు రేజాతియందు.

తా.అత్తమామ తల్లి అన్నలు మఱదులు లేక యింటికి తానే యజమాను రాలైనను, పుట్టినింటనే యున్నను, పొరుగింటికి పోవుచున్నను, తీర్థయాత్రలకు తిరుగుచున్నను, యితరచోటనున్న పరపురుషునివిషయము పలుకనిచ్చగించినను, ఆజ్ఞ పెట్టువారు లేకున్నను, కులటలతో సహవాసము చేసినను, తనకులాచారము విడిచినను, మగడు ముసలివాడైనను లేక రూపవంతుడు కానప్పటికిని లే దూర మందున్నను లేక ధైర్యములేనివాడై కలియకయున్నను లేక గాఢరతి చేయు వాడైనను లేక నిరతము జగడమాడు గుణముగలవాడైనను సకలజాతులయందును స్త్రీ వ్యభిచరించును.

క.శివ మాడినఁ గలు ద్రావిన
ధవునకు దారిద్ర్యమైన దర్పకుకేళిన్
సవరింపకున్న కామిని
వివరింపఁగఁ జెడదె యెన్నవిధముల నైనన్.

తా.శివమాడినను, కల్లు త్రాగినను, మగడు దరిద్రుడైనను, భర్త రతి చేయక యున్నప్పటికిని స్త్రీ చెడుట కెన్నిరీతులు గలవో అన్నివిధములను చెడును.

## విరక్తిస్త్రీ లక్షణము

శ్లో.నైనం పశ్యతి నాస్య నన్దతి సుహృన్మిత్రో ప్రతీపస్థితి
ర్యోగే పీడతి హృష్యతీవ విరహే మార్ష్యాననం చుంబితా।
నాస్మాదిచ్ఛతి మానమీర్ష్యతి వచః ప్రత్యుత్తరం నార్పయే
త్స్వర్మాదుద్విజతే స్వపిత్యుపగతా శయ్యాం విరక్తా సతీ॥

ఉ.చూడదు నాథు నెచ్చెలిని జూపొనరింపదు పిల్చిరేని మా
టాడదు పాయమందుఁ దను నంటకపాసిన సంతసిల్లుఁ దాఁ
గూడినఁ గంటకించు ననుకూలము లేక విరక్తికాంత మో
మోడదు చుంబనంబునకు నోర్వదు నిద్దురవోవుఁ బాన్పునన్.

తా.మగనిని చూడకయుండుటయు, స్నేహితురాలిని చూడకపోవు టయు, పిలిచిన పలుకకపోవుటయు, వయస్సునందు తన్నంటకయున్నచో సంతో షించుటయు, రతియం దనుకూలతలేక కోపగించుటయు, మాట్లాడకయుండుటయు ముద్దుబెట్టుకొనిన సహించకపోవుటయు, పాన్పునందు నిద్రించుటయు గలస్త్రీని విరక్తికాంతగా దెలియందగినది.

శ్లో.ఉక్తం గుణపతకాయామనురాంగేంగితం చ యత్।
అజాతజాతభోగానాం తత్సాధారణముచ్యతే॥

వ.ఇక చెప్పంబడు వలపులక్షణములు ప్రియుని సంభోగ మనుభవించినవారల యందును, అనుభవింపనివారలయందును, గాననగునని గుణపతాకమను శాస్త్ర మునందు చెప్పంబడియుండెను.

## స్త్రీలవలపు నెఱింగెడి లక్షణము

శ్లో.ఓష్ఠాగ్రం స్ఫురతక్షణే విచలతః కూపోదరే మత్స్యవ
ద్ధమ్మిల్లః కుసుమాంచితో విగలితః ప్రాప్నోతి బన్ధం పునః।
ప్రచ్ఛిన్నౌ వ్రజతః స్తనౌ ప్రకటతాం శ్రోణీతటం దృశ్యతే

నీవీ చ స్ఖలతి స్థితాపి సుదృఢం కామేంగితం యోషితామ్॥

చ.పెదవిఁ గదల్చుఁ గన్నుగవ పింపిసలారఁ బిరుందుఁ జూచు ప
యెద విదళించుఁ జన్నులు బయల్పడఁ గొప్పుననున్న క్రొవ్విరు
ల్చెదరినఁ బల్మరుం దురుముఁ జెక్కునఁ జెమ్మట నించుఁ జీరెక
ట్టదరినఁ జక్కఁగట్టుఁ జపలాక్షి మనోహరమూర్తి జూచినన్.

తా.ఇష్టమగువిటుని జూచినస్త్రీ పెదవి గదలించును, ఉత్సాహముతో పిఱుందులు చూచును, చన్నులు కనుపించునటుల పైటచెంగు విదళించును, కొప్పున నున్న పూవులు చెదరినట్లు మాటిమాటికి ముడుచుకొనును, దవడలయందు చెమట పట్టును, చీరెకట్టు మాటిమాటికి బిగించును, ఇవియన్నియు తాను వలచినపురుషుని యెదుటనే స్త్రీ కనపరుచునని దెలియందగినది.

శ్లో.సౌభాగ్యరూపపరిహాసగుణానురాగ
సంకీర్త నేన దయితస్య చ లబ్ధసౌఖ్యమ్।
సంబన్ధిమిత్రముఖదర్శనదత్తదూర
తోషం పరోక్షమపి కామగుణేంగితం స్యాత్॥

చ.పెనిమిటి భాగ్యరూపగుణబృందము లేనరులైన ముందటన్
వినుతులఁ జేయ సౌఖ్య మొదవించును నాథునియొద్దిమిత్రులన్
గనుఁగొని సంతసిల్లుఁ గలకంఠి గుణంబుల జూడఁబట్టి యొ
య్యనఁ దెలియంగవచ్చు మదనాంకురభావము భామ కుండుటల్.

తా.తనముం దెవ్వరైనను దనవిటునియొక్క యైశ్వర్యమును సౌందర్య మును గుణములను స్తుతింపగా తృప్తిపొందును. విటునియొక్క స్నేహితులను జూచి సంతోషించును. ఈమొదలగు గుణములచేత స్త్రీకి వలపు యుండెనని తెలియ వచ్చును.

## స్త్రీలసమయరతివిశేషము

శ్లో.అధ్వక్లాన్తతనుర్నవజ్వరవతీ నృత్యశ్లథాంగీ తథా
మాసైకప్రసవా దతాతి సురతే షణ్మాసగర్భా సుఖం।
విఖ్యాతా విరహయ్య సంగమవిధౌ క్రుద్ధప్రసన్నే ఋతు
స్నానే నూతనసంగమే మధుమదే రాగాస్పదంయోషితః॥

సీ.కలు ద్రావి యరచొక్కుఁ గవసినఁ గమలాక్షి
దూరంబు నడచిన తోయజాక్షి
యొకనాఁటిజ్వరము మైనొదవిన యంగన
నాట్యమాడి యలయు నాట్యగంధి
నాల్నాళ్ళు గడచిన నారీశిరోమణి
గర్భమై యార్నెల ల్గలుగు కాంతఁ
గోపంబు మగని పైఁగొన్న లతాతన్వి
విరహాంతమునఁ గూడు విద్రుమోష్ఠి

గీ.బిడ్డఁ గన్నట్టి నెలనాళ్ళ భీరుమధ్య
మొదలఁ బొలివోకయుండిన ముద్దరాలిఁ
గలిసినప్పటి సౌఖ్యంబు కొలఁదిఁ జెప్ప
నించువిల్తుఁడు నింద్రుఁడు నెఱుఁగలేరు.

తా.మధుపానము జేసి స్మరణదప్పియున్న మగువతోనైనను, దూరము నడచి వచ్చిన తొయ్యలితోనైనను, ఒకరోజు జ్వరము వచ్చినయువిదతోనైనను, నృత్యా ము జేసి బడలియున్ననాతితోనైనను, ఆరునెలలు గర్భమైనకాంతతోనయినను, మగనిమీద కోపించినమగువనైనను, విరహముతో కలియువెలందినయినను, ప్రస వించి నెలదినములైన పడంతినైనను, ప్రథమరజస్వలయైన కన్యనైనను కూడిన యెడల నట్టిసౌఖ్యము మన్మథుడుగాని యింద్రుడుగాని యనుభవించియుండరు.

శ్లో.ప్రథమమదనయుద్ధే యోషితః స్వల్పభావాః
కథమపి చిరకాలతృప్తియోగం లభన్తే|
ధృతగురుతరభావాః క్షిప్రకలా ద్వితీయే
భవతి తు విపరీతః పూరుషేషు క్రమోఽయమ్||

శ్లో.ప్రాయోంగనానాం పుర ఏవ తృప్తేర్భావావసానం పురుషాలభన్తే|
ఇదం తు విజ్ఞాయ తథోపచార్యా యథా ద్రవన్త్యగ్రత ఏవనార్యః||

శ్లో.అభ్యర్థితా బాహ్యరతేన భూయో యా దేశకాలప్రకృతీః ప్రతీక్ష్య|
శ్లథాస్తరుణ్యః ప్రబలానురాగా ద్రవన్తి తృప్యన్తి చ శీఘ్రమేవ||

శ్లో.కల్లోలినీకాననకన్దరాద్రౌ దుఃఖాశ్రయే వార్పితచిత్తవృత్తిః|
మృదుత్క్రమారంభమభిన్నధైర్యః శ్లథోపి దీర్ఘం రమతే రతేషు||

శ్లో.శాఖామృగమతిచపలం క్షితిరుహశాఖాగతిం విచిన్తయతః|
ధ్వజముఖపర్యన్తగతం ఫలబీజం పురుషస్య జాతు నో గలతి||

చ.మగువకుఁ దృప్తిలేదు ప్రథమంబున రెండవమాఱుఁ గూడినన్
మిగులసుఖంబు వేగిరమె మించు దలిర్పగ నిట్టిచందముల్
మగనికి వీఁడుబాటు ప్రథమంబున శీఘ్రసుఖంబు నిచ్చు నిం
పుగ రమియించిన న్సుఖము పుట్టదు రెండవమాఱు గ్రక్కునన్.

తా.స్త్రీలకు తొలిసంగమంబున దృప్తి గలుగదు రెండవమారు రతి చేసిన మిక్కిలి సుఖము కలుగును. పురుషులకు తొలిసంగమమున శీఘ్రముగా సుఖము నిచ్చును. ప్రీతిచేత రెండవసారి సంగమము చేసిన శీఘ్రముగా సుఖము పుట్టదు.

వ.ఇట్లగుటం జేసి స్త్రీలకుఁ బ్రథమసురతంబునఁ దృప్తి గలుగునట్లు కాలకళా సందర్భము లెఱింగి స్త్రీల నాలింగన మొనర్చి చుంబనాదిబాహ్యరతుల నలయించి తత్తరమొందక పురుషులు పెనంగిన స్త్రీలకు ద్రవంబు కలిగి తృప్తిఁ బొందెదరు. తదీయలక్షణం బెఱింగించెద—

ఉ.కాననము ల్నగంబులును గహ్వరము ల్తటినీహ్రదంబు లం
భోనిధు లంబరంబు ద్రుమము ల్కడుదుఃఖముల న్మనంబునన్
బూనుచు వేగిరం పడక పొందుచు వీర్యము నిల్పి నంతటన్
మానినిఁ గూడినన్ సుఖము మానక పుట్టుఁ గ్రమక్రమంబుగన్.

తా.అరణ్యము కొండ కొండబిలము తటాకము మడుగు సముద్రము ఆకాశము వృక్షము వ్యసనము వీని మనస్సునం దుంచి త్వరపడక యింద్రియమును నిల్పి స్త్రీని మెల్లగా రమించుచు గూడిన క్రమక్రమముగా సుఖము గలుగును.

వ.మఱియుఁ గూరిమి యభ్యాసయోగంబును యభిమానజంబును సంప్రత్యయో గంబును వైషయికంబును స్వభావసాత్మ్యకమనునవి యైదువిధంబు లయ్యె. అవి యేవి యనిన—

## అభ్యాసయోగలక్షణము

శ్లో.అఖేటకే శిల్పవిధౌ చ నృత్యేప్యభ్యాసయోగాదుపచీయతేయా|
వీణాస్వనా ద్వైర్విషయైర్బుధాస్తామాభాసికీం ప్రీతి ముదహరన్తి||

క.వేఁటల శిల్పక్రీడలఁ
దోఁటల వీణాస్వనాదితూర్యంబులచే
మాటలఁ జదువులఁ గూర్ములు
నాటిన నభ్యాసయోగ నామం బయ్యెన్.

తా.వేటలాడుటవలనను చిత్తరువుల వ్రాయుటవలనను వనవిహారముచేతను వీణాదివాద్యవిశేషములచేతను మాటలమూలమునను, చదువులమూలమునను పుట్టిన ప్రేమ అభ్యాసయోగమని తెలియదగినది.

## అభిమానజ సంప్రత్య వైషయికంబుల విషయంబులు

శ్లో.నాభ్యాసతో నో విషయాద్భవేద్యా సంకల్పమాత్రాదభి మానజా సా|
క్లీబస్య నార్యాశ్చ యథోపదిష్టైః స్త్రీపుంసయోః శ్లేషణ చుంబనాద్యేః||

శ్లో.సాదృశ్యతేఽన్యస్య భవేత్క్వచిద్యా తాం ప్రత్యయోత్థాం కథయన్తి ధీరాః|
ఉత్పద్యతే యా విషయైః ప్రధానైః ప్రీతం తు తాం వైషయికీం వదన్తి||

క.మానవికారంబున నభి
మానజమగు కూర్మి యొప్పు మసలక మఱియున్
మానినులకు నాలింగన
పానాధరచుంబనాది భావస్థితులన్.

తా.ఆలింగనము అధరపానము చుంబనము మొదలగు వికారభావస్థితులచే జనించినప్రీతి యభిమానజమని యెఱుంగదగును.

గీ.వయసు గుణమును రూపంబు వల్లభులకుఁ
గాంతలకు నొక్కచందమై కానఁబడినఁ
బ్రభవ మొందినఁ గూర్మి సంప్రత్యయోగ
మనుచు నార్యులు చెప్పుదు రభిమతముగ.

తా.స్త్రీపురుషులకు రూపవయోగుణాదులు సమానమైనటుల నిరువురకు తోఁచుటవలన జనించిననెయ్యము సంప్రత్యయోగంబని తెలియంజనును.

క.ఏయే ప్రయోజనంబుల
నాయకులకు వనితలకును నాటునుగూర్మల్
పాయక వైషయికం బని
చేయుదు రభిధానమిది ప్రసిద్ధముగాఁగన్.

తా.ఏయేసంబంధములయందు స్త్రీపురుషులిరువురకు యేకవస్తుప్రస్తు తాదులచేనైనను పరసంగమదృష్టంబుచేనైనను సుషుప్తావస్థలం బొరయునపుడు ఆకస్మికముగా జనించు చెలిమిని వైషయికంబని తెలియంజనును.

## స్వభావసాత్మ్యకలక్షణము

శ్లో.స్వభావసాత్మ్యం కథితం యదేతద్యో జాత్యవస్థాదికృతోవిశేషః|
యద్వక్షమాణం స్ఫుటదేశసాత్మ్యం తదాకలయ్య ప్రమదా ముపేయాత్||

క.జాతిప్రమాణగుణంబులు
ధాతువులును సమములైనఁ దరుణికిఁ బతికిన్
బ్రీతి జనించిన నది ప్ర
ఖ్యాతంబు స్వభావసాత్మ్యకం బన నొప్పున్.

తా.జాతులును గుహ్యప్రమాణములును ధాతువులును గుణములును సమ ములైనందున స్త్రీపురుషులకు గలిగిన మక్కువయే స్వభావాత్మ్యకమని యె ఱుంగునది.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే సామాన్యధర్మాధికారో నామ చతుర్థః పరిచ్ఛేదః

# దేశజ్ఞానాధికారః
# పంచమః పరిచ్ఛేదః

## దేశస్త్రీల రతివిశేషలక్షణములు

శ్లో.శుచిప్రచారా నఖదన్తచుంబద్విషస్త్రియో మధ్యమదేశజాతాః|
తథావిధాశ్చిత్రరతానురక్తా అవన్తి బాహ్లీకభువో భవన్తి||

శ్లో.ఆశ్లేషలోలా నఖదన్తకృత్యైర్విరజ్యతే హృష్యతి చాతిఘాతైః|
ఆభీరజా చుంబనహార్యచిత్తా స్యాన్మాలవీ చాపి తథావిధైవ||

శ్లో.ఇరావతీసిన్ధుశతద్రుతీరే విపాడ్యవితస్తాసరిదన్తరాలే|
యాశ్చన్ద్రభాగాతటజాశ్చ నార్యస్తా ఔ పరిష్టేన వినా నసాధ్యాః||

సీ.ఆచారవతులు మధ్యమదేశవనితలు
నఖదంతచుంబనోన్ముఖత, గనరు
బాహ్లికావంతి భూభవకామినులు చిత్ర
రతిఁ గోరుదురు ఘాతరతికిఁ జొరరు
నాభీరకాంతలు నాలింగనాది ఘా
తలఁగాని నఖదంతములకుఁ జొరరు
మాళవస్త్రీలు చుంబనములకే గాని
నఖదంతఘాతల సుఖము గనరు

గీ.మఱియు భగచుంబనము లేక మరులుగొనరు
చన్ద్రభాగసరిత్ప్రదేశముల సతులు
వారి చందంబె యుగ నిరావతిశరద్రు
సింధుసరిదంతరంబుల చెలువలెల్ల.

తా.మధ్యమదేశమం దుత్పన్నమగు స్త్రీ లాచారాదులు గలిగి నఖక్షత దంతక్షత చుంబనముల కుద్యుక్తులు గారు. బాహ్లికావంతిదేశస్త్రీలు కఠినరతుల ప్రవేసించనివారై చిత్రరతుల గోరుదురు. ఆభీరదేశస్త్రీలు గాఢాలింగనములకే గాని నఖదంతక్షతములకు బ్రవేశింపరు. మాళవదేశస్త్రీలు చుంబనములకే గాని నఖక్షత దంతక్షతసౌఖ్యముల గోరరు. చంద్రభాగ ఇరావతి సింధు శరద్రుయను నదులు ప్రవహించు తీరములయందుగల స్త్రీలు భగచుంబనములులేక మోహితులు కారు.

## గుర్జరదేశస్త్రీ లక్షణములు

శ్లో.ఫుల్లాసిధమిల్లభరా కృశాంగీ పీనస్తనీ చారువిలోచనా చ|
ప్రియోక్తిరాభ్యన్తరబాహ్యభోగసక్తా విరక్తాపి చ గుర్జరీ స్యాత్||

వ.విరిసినవెంట్రుకలచే నొప్పునదియు, కృశించిన అవయవములు గలదియు, గొప్ప వైన కుచములు గలదియు, అందమైన కండ్లు గలదియు, ప్రియవాక్యములు మాట్లాడునదియు, అభ్యంతరబాహ్యభోగములయందు విరక్తిగలస్త్రీన గుర్జరీ దేశస్త్రీగా తెలియందగినది.

## లాటదేశస్త్రీలక్షణము

శ్లో.మన్దాభిఘాతైర్నఖదంతకృత్యైర్భృశం ద్రవన్తీ పరిరంభలోలా|

ప్రచండవేగా సుకుమారగాత్రీ రతోత్సవే నృత్యతి లాటనారీ||

క.పరిరంభణమృదుతాడన
గురునఖరాహతులఁ గరఁగు కోమలి యయ్యున్
సురతమున నాట్యమాడును
సరభసగతి లాటవనిత చంచద్భంగిన్.

తా.ఆలింగనముచేతను మెల్లగా కొట్టుటచేతను నఖక్షతములచేతను ద్రవించునదియు రతియందు మనోజ్ఞముగా నాట్యము సేయునదియు లాటదేశ వనితగా నెఱుంగతగినది.

## ఆంధ్రదేశస్త్రీలక్షణము

శ్లో.చారిత్రముద్రమతిలంఘయన్తీ భవత్యనాచారరతా రతార్తిః|
ప్రయుంజతీ వాడవకర్మనర్మాణ్యాన్ధ్రీ పురన్ధ్రీ ధృతసౌకుమార్యా||

క.తర మెఱుఁగక యాచారము
మెరమెరవౌ రతులఁ గోరు మే న్మెత్తన యాం
ధ్రరమణి విభునకు వీర్యముఁ
బురికొల్పును దదనుయోనిపుటములవలనన్.

తా.కొద్దిగొప్పనెఱుంగనియాచారమును, శ్రేష్ఠమగు రతుల గోరుటయు, మెత్తనిదేహమును, ద్రవముగల యోనిముఖముచేత పురుషునిదండమును బిగించి శక్తి కలుగజేయునది ఆంధ్రదేశస్త్రీగా నెఱుంగునది.

## కోసలదేశస్త్రీలక్షణము

శ్లో.విమృద్యమానాః కృతకధ్వజేన ద్రవన్తిహృష్యన్తి ధృఢప్రహారైః|
స్త్రీరాజ్యజాః కోసలజాశ్నార్యః ప్రచండకండూతిభగా భవన్తి||

ఆ.దూలఁ గలిగియుండుఁ జాలగ మరునింటఁ
గాష్ఠలోహదండఘాత నైన
ద్రవము పుట్ట నురముఁ దాటింపవలెఁ జాల
కోసలాదిదేశకొమ్మలకును.

తా.భగమందు మిక్కిలిదురదయు, కాష్ఠతుల్యశిశ్నముయొక్క తాడనము వల్లగాని ద్రవము పుట్టకయుండుటయు, ఱొమ్మునందు బలమగు తాడనమువల్లగాని సంతసింపనివారు కోసలదేశస్త్రీలనుగా దెలియఁదగినది.

## మహారాష్ట్ర పాటలిపుత్రదేశములస్త్రీల లక్షణములు

శ్లో.సాక్షేపసగ్రామ్యగిరో విలజ్జా రతే చతుఃషష్టికళానురక్తాః|
నార్యో మహారాష్ట్రభవాస్తథైవ రహఃస్థితాః పాటలిపుత్రికాః స్యుః||

క.రతులఁ జతుష్షష్టికళా
న్వితలయ్యును సిగ్గు విడిచి విటులను గ్రామ్య
ప్రతికూలభాష లాడెడి
యతివలు పాటలికభూ మహారాష్ట్రభవల్.

తా.రతులయందు జతుష్షష్టికళాదులం దెలిసినవారయ్యును లజ్జ విడిచి విటులను నపభ్రమచే శుద్ధగ్రామ్యంబుగా హెచ్చరించువారు పాటలిపుత్ర మహా రాష్ట్రదేశముల స్త్రీలనుగా

తెలియందగినది.

## చతుష్షష్టికళలు

చ.తలకొని యోపరిష్టమును దంతనఖక్షతసంప్రవేశనం
బులును గళస్వనంబులును బూరుషలీలయుఁ జుంబనంబు గౌఁ
గిలియును గాఁగ నెన్మిదిటికి న్గలదొక్కటి కెన్మిదేసియై
యలవడుఁ జిత్తజాతకళ లర్వదినాలుగు లెక్క చూచినన్.

తా.ఔపరిష్టము దంతక్షతము నఖక్షతము సంప్రవేశనము గళస్వనము పురుషలీల చుంబనము కౌఁగిలి యీయెన్మిదియందు యొక్కొక్కదాని కెనిమిది వంతున మన్మథకళ లరువదినాలుగు యాయె.

## ద్రవిడస్త్రీ లక్షణము

శ్లో.అన్తర్బహిర్బాహ్యరతేన భుయో విమృద్యమానాః త్క్రమశోద్రవన్త్యః|
ప్రభూతకందర్పజలా ద్రవిడ్యో రతిం లభన్తే ప్రథమే రతేపి||

క.వెలిరతియును లోరతియును
దలకొలుపు భగంబునందు దర్పకుజలముల్
చిలుకఁగ ద్రవిడాంగన విటుఁ
గలియఁగఁ బ్రథమమున సుఖముఁ గైకొని చొక్కున్.

తా.విటుడు వెలిరతి లోరతి చేయగా భగమునందు ద్రవము పుట్టి తొలిసం గమమునందే సుఖము పొందునది ద్రవిడదేశస్త్రీయని యెఱుంగవలయును.

## వెలిరతి లోరతుల లక్షణము

క.వెలుపలి లోపలి రతములు
గల వంగజునిల్లు దొల్తఁ గడువేడ్కఁ గరాం
గుళిరతము సలుప వెలిరతి
యలవడు లోరతియు లింగ మచటికిఁ జొనుపన్.

తా.వెలిరతి లోరతి యని రెండువిధములు. పురుషుడు తనచేతివ్రేలితో జేసినరతము వెలిరతమనియు, శిశ్నమును భగమందు ప్రవేశింపజేసి సేయురతము లోరతియనియు దెలియందగినది.

## వనవాసదేశస్త్రీ లక్షణము

శ్లో.ప్రచ్ఛాదయన్త్యః స్వశరీరదోషం పరాంగదోషం బహుశోహసన్త్యః|
సర్వంసహా మధ్యమవేగభాజః స్త్రియో రమన్తే వనవాసదేశ్యాః||

క.పరదోషంబుల వెదుకుచు
పరిహాసముఁ జేయు నాత్మభవదోషంబుల్
పరికింపదు వనదేశపు
సరసిజముఖి కఠినరతుల జడియక నిలుచున్.

తా.ఎదుటివారిదోషము లెన్నుచు ఎగతాళి చేయుటయు, తనదోషములు తెలుసుకొనకుండుటయు, కఠినరతులకుగాని కరుగనిదియు వనవాసదేశస్త్రీగా దెలియందగినది.

## వంగ గౌడ దేశస్త్రీల లక్షణము

శ్లో.మృద్వంగయష్టిర్మధురాభిధానా సంశ్లేషచుమ్బోత్కలికాల్పవేగా|
కఠోరచేష్టా విరతా రతాజౌ గౌడీ చ వంగీ చ నితంబినీ స్యాత్||

చ.సురతసుఖంబునందుఁ దమిఁ జూపును మెత్తనిమేను గౌఁగిటన్
గఱఁగును జుంబనప్రియవికారవిదూరము మారుకేళి య
ల్పరయము వంగరాజ్యభవభామినికి న్వరగౌడకాంతకున్
సరసు లెఱింగి వీరలను సమ్మతిఁ బొందుదు రింపు పుట్టఁగన్.

తా.రతియందు ప్రేమ చూపుటయు, మెత్తనిశరీరమును, ఆలింగనమందు చొక్కుటయు, చుంబనమం దాశ లేకుండుటయు, కొంచెము వేగముగల రతమును గల స్త్రీలు వంగ గౌళ దేశస్త్రీలని యెఱుంగుడు.

## కామరూపజాతిస్త్రీ లక్షణము

శ్లో.శిరీషమృద్వీ బహుళో ద్రవంతీ రతే విలీనా కరమాత్రసంగాత్|
అనంగరంగైకరసా ప్రియోక్తిః స్యాత్కామరూపప్రభవా పురంధ్రీః||

క.తను వతిమృదువగు రతికిన్
దనివి సనదు ముట్టినపుడు ద్రవ ముప్పతిలున్
మనసిజతంత్రరసైకవ
చనకామిని కామరూపజాతిఁ దలంపన్.

తా.మెత్తనిశరీరమును, రతియందు తృప్తిలేకయుండుటయు, అంటగనే మదనజల ముప్పొంగుటయు, రతివిషయమగు మాటాడుటయు గలస్త్రీ కామ రూపజాతిస్త్రీగా తెలియవలెను.

## ఉత్కళదేశస్త్రీ లక్షణము

శ్లో.ఉత్కళీ బహుళరాగవిహ్వలా దన్తఘాతకరజక్షతప్రియా|
ఔపరిష్టకరతా విశేషతో హ్యంగవంగయువతిః కళింగజా||

శ్లో.వివిధనఖవికారైః ప్రౌఢపాణిప్రహారైర్జనితపరమమోదమౌపరిష్టప్రకారైః|
అవిరతరతయుద్ధాకాంక్షిణీం వీతలజ్జాం వదతి బహుళరాగాముత్కళీం మూలదేవః||

చ.పరుషనఖప్రహారములఁ బాణితలాంగుళఘట్టనంబులన్
జరణవిఘట్టనంబులను సంతతమన్మథతంత్రభంగులన్
స్మరగృహచుంబనంబులఁ బ్రమత్తమధూదకపానలీలలన్
గరఁగి సుఖించు నుత్కళపుఁ గామిని రాగవిహీనలజ్జయై.

తా.కఠినములగు నఖక్షతములచేతను, హస్తతాడనములచేతను, రతిరీతుల చేతను, భగచుంబనములచేతను, మద్యపానములచేతను, ప్రీతిలేనిసిగ్గుచేతను, ద్రవించి సుఖించునది ఉత్కళదేశస్త్రీగా తెలియందగినది.

శ్లో.ఇతి కిమపి యదూచే దేశసాత్మ్యం మునీంద్రో
యువతిరితరదేశ్యాప్యూహనీయా తథైవ|
అనుభవమనుసృత్య స్వం చ సాత్మ్యం భవేద్యద్
భవితి సహజసాత్మ్యం దేశసాత్మ్యాద్బలీయః||

శ్లో.ఇతి కిమపి యదుక్తం యోషితాం దేశసాత్మ్యం
స్ఫుటమకథితదేశేప్వన్నయేత్తద్దిశా తత్|
సహజమపి చ సాత్మ్యం భావయేత్ స్వానుభూత్యా
బలవదుభయమధ్యే విద్ధి సంసిద్ధికం యత్||

శ్లో.ఇతి ప్రమాణం సమయం చ వేగం స్వభావదేశోద్భవసాత్మ్యభేదాత్|
స్వస్థామవస్థాం ప్రకృతిం ప్రతీక్య ప్రయుంజతే బాహ్యరతం రతం చ||

శ్లో.అదౌ రతం బాహ్యమిహ ప్రయోజ్యం తత్రాపి చాలింగన పూర్వమేతత్|
అజాతజాతస్మరకేళిభేధాద్ద్విధా పునర్ద్వాదశధా చ తత్ స్యాత్||

వ.ఇవ్విధంబున నీశాస్త్రంబునఁ జెప్పిన దేశస్త్రీల ననుభవించి తదీయాత్మల నిశ్చ యం బెఱింగి తత్ప్రమాణస్వస్థానస్థాప్రకృతిదేశసాత్మ్యంబులఁ బరికించి కాము కులు ఫలశుద్ధి విచారించి బాహ్యాభ్యంతరరతుల న్బరికించి ప్రథమంబున ద్రవో ద్భవకారణంబగు బాహ్యరతి యొనర్పం జను అందులకు నాందియైన యాలింగన భేదంబులు చెప్పంబడియె నందుల నజాతస్మర మనియు, జాతస్మర మనియు నాలింగనము రెండువిధంబు లయ్యె. అజాతస్మరమునందు నాలుగును జాతస్మర మందు పదిరెండును భేదంబులు గలవు. అందుఁ బ్రథమంబైన యజాతస్మర మను నాలింగనమందు—

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే దేశజ్ఞానాధికారో నామ పంచమః పరిచ్ఛేదః

# ఆలింగనాధికారః
# షష్ఠః పరిచ్ఛేదః

## స్పృష్టక లక్షణము

శ్లో.యద్యోషితస్సమ్ముఖమాగతాయా అన్యాపదేశాద్వ్రజతో నరస్య|
గాత్రేణ గాత్రం ఘటతే రతజ్ఞా ఆలింగనం స్పృష్టకమేతదాహుః||

క.ఎదురై మానినిదేహం
బెదురై యొకవంకఁ బనికి నేగెడుపురుషుం
గదిసి తొలంగుట స్పృష్టక
మది యని చెప్పుదురు రసికు లానింగనమున్.

తా.తనపనికై జనుపురుషుని మోహించినస్త్రీ వాని కెదురుగా వచ్చి యొరసి తొలగుటయే స్పృష్టక మనంబడును.

## విద్ధక లక్షణము

శ్లో.యద్గృష్ణతీ కించన వంచితాక్షం స్థితోపవిష్టం పురుషం స్తనాభ్యామ్|
నితంబినీ విధ్యతి తాం చ గాఢం గృహ్ణాత్యసౌ విద్ధకముచ్యతేతత్||

క.ఒకవంకనున్నవిభు నో
ర్వకడగ్గరి కౌగిలించు వనితను వెనుది
య్యక కౌగిలింప నది వి
ద్ధక మను నాలింగనంబు దానై వెలసెన్.

తా.ఒంటరిగా నొకచోటనుండు పురుషుని గాంచి మదనవేదన కోర్వక దగ్గర జేరి యాతని కౌగిలించినవనితను యాపురుషుడు వెనుదియ్యక కౌగిలించి మేభావ విద్ధకమనంబడును.

## ఉద్ఘృష్టక నిపీడనముల లక్షణములు

శ్లో.యాత్రోత్సవాదౌ తిమిరే ఘనే వా యద్గచ్ఛతోః స్వాచ్ఛిరమంగసంగః|
ఉద్ఘృష్టకం తత్పునరేవ కుడ్యే నిపీడనాత్పీడితసంజ్ఞకం స్యాత్||

క.యానోత్సవతిమిరంబుల
మేనులు సోఁకుటయుఁ బతికి మెలఁత కుద్ఘృష్టం
బై నెగడె గోడ నొత్తన్
గానదియె నిపీడనాఖ్య కౌగిలి యయ్యెన్.

తా.తీర్థయాత్రలయందుగాని, దేవాదిమహోత్సవములయందుగాని, చీకటి యందుగాని స్త్రీపురుషులకు మేనులు తగులుటయే ఉద్ఘృష్టక మనబడును. యాకా లమునందే స్త్రీగాని పురుషుడుగాని గోడకు జేర్చి యొత్తబడునదియే నిపీడితమ నంబడును.

శ్లో.భావప్రబోధార్థమజాతరత్యోశ్చతుర్విధోక్తా పరిరంభలీలా|
సంజాతరత్యోస్త్వనురాగవృద్ధ్యైబుధ్యైరసావష్టవిధోపదిష్టా||

వ.భావప్రబోధకంబులయి పురుషులచే నాచరింపఁబడు సురతరహితము లగు నజాతకాలింగనంబులు నాలుగును జెప్పితిని. ఇంక నుపభర్తలగు పురుషులచే

నాచరింపంబడు జాతిస్మరాలింగనము లెనిమిదియు నెట్లంటేని—

## లతావేష్టిత లక్షణము

శ్లో.ప్రియమనుకృతవల్లీభ్రమా వేష్టయంతీ
ద్రుమమివ సరళాంగీ మన్దసీత్కా తదీయమ్।
వదనముదితఖేలాక్రన్దమాచుంబనార్థం
సమయతి వినమన్తీ తల్లతావేష్టితం స్యాత్॥

చ.ఎదురుగనున్న నాయకుఁ బ్రియేశ్వరి డగ్గరి యూరుయుగ్మ
న్పదములఁ జుట్టి వృక్షమునఁ బ్రాఁకినతీవెయుఁబోలెఁ గౌఁగిటన్
వదలక చిక్కనొక్కి తలవంచి గళధ్వను లుల్లసిల్లఁగా
నధరము గ్రోలుచున్న యది యాది లతాపరివేష్టితం బగున్.

తా.ఎదురుగ నిలిచియున్నపురుషునియొద్దకు వెళ్ళి యతనితొడలను తనకాళ్ళ చేత చుట్టుకొని చెట్టును అల్లుకొనియున్నతీగవలె అతని యాలింగన మొనర్చి తల వంచి కంఠధ్వని పుట్టునట్టుల యాస్త్రీ అధరపానము చేయుటయే లతావేష్టిత మనంబడును.

## వృక్షాధిరూఢ లక్షణము

శ్లో.రమణచరణమేకేనాంఘ్రిణాత్క్రమ్య ఖిన్నం
శ్వసితమపరపాదేనాశ్రయన్తీ తదూరమ్।
నిజమథ భుజమేకం పృష్ఠతోఽస్యార్పయన్తీ
పునరపరభుజేవ ప్రార్థయన్తి తదంసమ్॥

శ్లో.స్థితపతిమధికృత్య ప్రోక్తమాశ్లేషయుగ్మం
సపది చ కథనీయాః సుప్తసంశ్లేషభేదాః।
తరుమివ కమితారం చుమ్బనార్థాధిరోఢుం
యదభిలషతి నారీ తచ్చ వృక్షాధిరూఢమ్॥

చ.పతిచరణంబుమీఁద నొకపాదము నిల్పి ద్వితీయపాదమున్
బతితొడఁ గీలుకొల్పి నిజబాహువు వీపునఁ బెట్టి క్రమ్మఱన్
బతిమెడఁ జుట్టి తాళగతబద్ధఘటంబును గ్రోలురీతిఁ ద
త్పతి యధరంబుఁ గ్రోలు సతిభావము వృక్షనిరూఢమై చనున్.

తా.పురుషునిపాదముమీద నొకపాద ముంచి వేఱొకపాదముతో పతియొ క్కతొడను పెనవైచి తనచేతిని పతివీపుమీదుగా పతిమెడను జుట్టిపట్టి తాటిచె ట్టున గట్టియుండిన దుత్తలోనుండు కల్లును త్రాగురీతిగా పురుషుని యధరపానము చేయుస్త్రీభావమే వృక్షాధిరూఢ మగును.

## తిలతండుల లక్షణము

శ్లో.అసకృదపి విగాఢాశ్లేషలీలాం వితన్వన్
జనితజఘనబాహువ్యత్యయం స్పర్ధయేవ।
మిథునమథ మిథోఽంగే లీయతే నిస్తరంగం
నిగదతి తిలపూర్వం తండులం తన్మునీన్ద్రః॥

క.తరుణియుఁ బురుషుఁడుఁ బాన్పునఁ
గరచరణాంగములు బిగియఁ గౌఁగిలి యిడుచున్

బొరిపొరి వదలుచు బిగియుచుఁ
గరఁగుట తిలతండులంపుఁ గౌఁగిలి యయ్యెన్.

తా.స్త్రీపురుషులు పానుపునందు బరుండి కాళ్ళుచేతులు దేహము గట్టిగా నాలింగనము చేయుచు ఊగుచూ నొకరినొకరు బిగపడుచు నాలింగనమున ద్రవించు చున్నభావము తిలతండుల మనబడును.

## క్షీరనీర లక్షణము

శ్లో.అభిముఖముపవిష్టా యోషిదంతేఽథ తల్పే
రచితరుచితగాఢాలింగనో వల్లభశ్చ|
ప్రసరదసమరాగావేశనశ్యద్విచారా
విశత ఇవ మిథోంగే క్షీరనీరః తదాహుః||

ఉ.పానుపునందు నిద్దరును బైకొని చిక్కనఁ గౌఁగిలించి యా
మేనులు రెండుగూడి యొకమేనుగ వల్లభుఁడు న్వధూటియున్
జానుగ మోహ ముప్పతిల సారెకుఁ జేరి భగద్వయంబు సం
స్థానము లంటియున్న తమిసంగతి క్షీరజలంబు నాఁబడున్.

తా.స్త్రీపురుషులు పాన్పునందు యొకరిపైనొకరు పండుకొని గాఢాలిం గన మొనర్చి రెండుశరీరము లొక్కటిగా నుండ వలపు లుప్పొంగునటుల భగద్వయ స్థానముల ముట్టుభావమే క్షీరనీరం బనబడును.

## ఊరూపగూఢ లక్షణము

శ్లో.మనసిజతరళాయాః సంభృతానంగరంగో
యది పతిరబలాయాఃపీడయత్యూరుయుగ్మమ్|
దరదళితనిజోరుద్వన్ద్వసన్దంశయోగాత్
తదిహ మునిమతజ్ఞైరుక్తమూరూపగూఢమ్||

క.తనతొడల నడుమ నిడుకొని
వనితామణితొడలు బిగియ వల్లభుఁ డాలిం
గన మొనరించినఁ గోరిక
ననుపమ మూరూపగూఢమం చనఁబరఁగున్.

తా.పురుషుడు తనతొడలనడుమ స్త్రీతొడల నుంచి బిగించి ప్రీతి రెట్టింప నాలింగనము చేయుభావమే ఊరూపగూఢ మనంజనును.

## జఘనోపశ్లేష లక్షణము

శ్లో.జఘనకలితకాంతశ్రోణిరస్యోపరిష్టా
ప్రణతి యణహ నారీ ప్రస్తకేశోత్తరీయా|
కరజరదనకృత్యం చుమ్బనం వా విధిస్సు|
కథయతి జఘనోసశ్లేషమేతన్మునీన్ద్రః||

ఉ.కొప్పరవీడఁబెట్టచును గుబ్బలఁ బయ్యెద జార మోహమున్
గప్పఁగ నాథుగుహ్యమున గామిని దా జఘనంబుఁ గూర్చి పైఁ
దప్పకయుండఁ జుంబనము దంతనఖక్షతముల్ రచింపఁగా
నొప్పుగఁ జెప్పుచుండ్రు జఘనోపరిగూహన నామధేయమున్.

తా.స్త్రీ చన్నులమీది పయ్యెద జారేటట్టుగా, సగము జారినకొప్పు చక్క బెట్టుచుండ వలపు పుట్టునట్టు పురుషునిమర్మస్థానమందు తనజఘనము నుంచగా పురు షుడు దంతలఖక్షతచుంబనములు చేయచు నాలింగన మొనర్చునది జఘనోపశ్లేష మనంబడును.

## కుచాశ్లేష లాలాటికముల లక్షణము

శ్లో.ఉరసి కమితురుచ్చైరావిశన్తీవరాంగీ
స్తనభరముపధత్తే యత్స నాలింగనం తత్|
ముఖమభిముఖమక్ష్మోరక్షిణీ న్యస్య హన్యా
దలికమలికపట్టేనేతి లాలటికం స్యాత్||

క.పెనిమిటియురమునఁ గామిని
ఘనకుచములఁ గదియనొత్తి కరకరిలీలన్
జనువిచ్చి కొసరిపల్కుల
వినుతి కుచాశ్లేషణంబు విదితం బయ్యెన్.

తా.స్త్రీ తనకుచములను పురుషునిఱొమ్మున గట్టిగా నదిమి చనువిచ్చి కొసరికొసరి మాట్లాడుచు కౌగలించినదియే కుచాశ్లేష మనంబడును.

క.నుదురును నుదురును వదనము
వదనము నేత్రములు నేత్రవారిరుహంబుల్
గదియించి కౌగిలించిన
నది లాలాటిక నిరూపణాఖ్యం బయ్యెన్.

తా.స్త్రీపురుషు లిరువురును మొగములు ముక్కులు కన్నులు యొకటిగా చేర్చి కౌగిలించినభావమే లాలాటిక మనంబడును.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే ఆలింగనాధికారో నామ షష్ఠః పరిచ్ఛేదః

# చుమ్బనాధికారః
# సప్తమః పరిచ్ఛేదః

## చుమ్బనస్థానములు

శ్లో.నయనగళకపోలం దన్తవాసో ముఖాన్తః
స్తనయుగళలలాటం చుమ్బనస్థానమాహుః|
దధతి జఘననాభీమూలకక్షాసు చుమ్బ
వ్యతికరసుఖముచ్చైర్దేశసాత్మ్యేన లాటః||

ఉ.కన్నులు మోవి చన్నుగవ కంఠము చెక్కులు ముక్కు ఫాలమున్
మున్నుగఁ జుంబనంబునకు మూలము లయ్యెను గక్షయుగ్మమున్
గ్రొన్ననవిల్తునిల్లును ద్రికోణముఖంబును జుంబితంబులై
హొన్ను వహించు దేశహిత మొప్పఁగ లాటవధూటి యింపునన్.

తా.నేత్రములు, అధరము, కుచములు, కంఠము, చెక్కులు, ముక్కు, లలాటము, ఇవి చుంబనమునకు తావులు. మఱియి చంకలు, భగము, బొడ్డు యీ తావులను చుంబింపగా లాటదేశపుస్త్రీలు సంతోషింతురు.

## నిమిత స్ఫురితచుంబనముల లక్షణము

శ్లో.నిమితకమిదనూహుర్యోజితా యద్బలేన
ప్రియముఖమభివక్త్రం న్యస్య తిష్ఠత్యుదాస్యా|
స్ఫురితమథ ముఖాన్తర్న్యస్తమోష్ఠం జిఘృక్షుః
స్ఫురదధరపుటాభ్యాం యన్న గృహ్ణాతి భర్తుః||

ఆ.తనకు సఖులు చెప్పఁ దరుణివక్త్రము దన
కభిముఖంబుఁ జేసి హత్తు గొలువ
నందుఁ దొలుత నధర మాసఁ దానానుట
నిమితకం బటంచు నెగడె భువిని.

తా.తనయొక్కసఖులు చెప్పగానివి తనను బొందెడి పురుషునిముఖమునకు సమముగా దనముఖము నుంచగా తొలుత పురుషు డాస్త్రీ అధరమును ఆశతో చుంబించుటయే నిమితచుంబన మనబడును.

ఆ.వనిత మీఁది పెదవి వరుఁడు చుంబించుచు
నధర మతివనోట నదుముటయును
నధరపానమాన నది సిగ్గువడియున్న
స్ఫురిత మనెడిపేరి చుంబనంబు.

తా.పురుషుడు స్త్రీయొక్క పైపెదవిని చుంబించుచు తనక్రిందిపెదవిని స్త్రీయొక్కనోటియందదుమగా ఆస్త్రీ సిగ్గుచేత అధరపానము చేయకుండినయెడల స్ఫురితచుంబనమని తెలియదగినది.

## ఘట్టితచుంబన లక్షణము

శ్లో.రమణరదనవాసః స్వాననే న్యస్తమోష్ఠ

ద్వితయమ్మృదుగృహీతం యస్మనాక్ జిహ్వయాన్తః|
కరపిహితధవాక్షీ ఘట్టయేద్ ఘట్టితం స్యాత్
త్రితయమపి తదేతత్కన్యకాయాం ప్రయోజ్యమ్||

ఆ.అధిపుఁ డధరపాన మానుచో సిగ్గునఁ
గరముతోడ నతని కనులు మూసి
జిహ్వచేతఁ బెదవి చిట్టము లంటుట
కనుఁగొనంగ నదియె ఘట్టితంబు.

తా.పురుషు డధరపానమును జేయుచుండగా సిగ్గుచేత యాస్త్రీ పురుషుని యొక్క కన్నులను దనచేతులతో మూసి తననాలుకచేత యతనిపెదవుల నంటుటయే ఘట్టితచుంబన మనబడును.

## భ్రాంతి తిర్యగ పీడిత విఘటిత అధర ఉత్తరచుంబనముల లక్షణములు

శ్లో.యువతిచిబుకదేశం వల్లభః పృష్టవర్తీ
భ్రమయతి ముఖమీషద్యత్కరాభ్యాం గృహీత్వా|
అధరమథ విలీఢస్తౌ మిథో భ్రాన్తమేతద్
ప్రజతి దయితపా చీభావతస్తిర్యగాఖ్యామ్||

శ్లో.ద్వయమిదమనపీడ్య గ్రాహతః పీడితాఖ్యం
విఘటితమథ జిహ్వగ్రేణ కృష్ట్వాంగులీభ్యామ్
అరదమధరమస్యాః పీడయేత్ ప్రీతికృష్టం
దశతి కమితరి స్యాదుత్తరం తూత్తరోష్ఠమ్||

సీ.వెనుక నొయ్యన వచ్చి విభుఁడు హస్తంబులఁ
గామినీమణి చిబుకంబుఁ బట్టి
యానన మొకయింత యటు త్రిప్పి సరసుఁడై
యాను చుంబనము భ్రాంతాఖ్య మయ్యె
వనిత యడ్డము నిల్చి వరు నధరోష్ఠంబు
చుంబింప తిర్యగాఖ్యంబు చెలఁగె
పట్టి యీరెండు చుంబనములఁ బీడింపఁ
బీడితాఖ్యం బను పేరఁ బరఁగె

ఆ.తరుణి మోవిచిగురు దనచేతివ్రేళ్ళకుఁ
జివరపట్టి తీసి జిహ్వఁ బరపి
చుంబనంబు సేయ సూరిజనంబులు
విఘటితాఖ్య మనిరి విశదముగను.

తా.పురుషుడు స్త్రీకి వెనుకదిక్కుగా వచ్చి తనచేతితో దానిగడ్డమును బట్టుకొని మొగము కొంచెము త్రిప్పి చుంబనము చేయునదియే భ్రాంతిచుంబన మనబడును. స్త్రీ యాతనిచేతులలో యడ్డముగా నుండి పురుషునియొక్క క్రింది పెదవి చుంబించినదియే చిర్యగచుంబన మనబడును. ముందు చెప్పబడిన భ్రాంతి, తిర్యగ, చుంబనముల రెంటిచేతను స్త్రీపురుషులిరువురు చుంబించునదియే పీడిత చుంబన మనంబడును. స్త్రీయొక్క మోవి తనచేతివ్రేళ్ళతో పట్టుకొని కొంచెము ముందుకు లాగి నాలుకను జాపి చుంబించునదియే విఘటితచుంబన మనబడును.

ఆ.పల్లు మోపకుండ భామినియధరంబు

జిహ్వాచుంబనంబుఁ జేసెనేని
యధర మనఁగఁ బరఁగె నట్లె పై పెదవి దా
హత్తుకొలుప నుత్తరాఖ్య మయ్యె.

తా.పురుషుడు స్త్రీయొక్క అధరమున పల్లు ఆనకుండా నాలుకతో చుంబ నము చేయునదియే అధరచుంబన మనబడును. పైమాదిరిగనే పైపెదవిని చుంబించు నదియే ఉత్తరచుంబన మనంబడును.

## సంపుట అనువదనచుంబనముల లక్షణము

శ్లో.యది పతిరబలాయాః శ్మశ్రుహీనోఽస్య సా వా
సుమృదురదనవాసఃసంపుటం సంపుటేన|
ప్రణయపరిగృహీతం చుమ్బనం సంపుటం స్యా
దనువదనమిదం తత్కేళి జిహ్వారణేవ||

ఉ. మీసము పుట్టినట్టి నెఱమిండడు కామినియోష్ఠయుగ్మమున్
దీసి నిజోష్ఠయుగ్మమునఁ దీపులు వుట్టగఁ గూర్చి చుంబనో
ల్లాసముఁ జూపఁ గాంతయుఁ బదంపడి నాయకునందు నట్టు తాఁ
జేసిన సంపుటం బనుచుఁ జెప్పిరి చుంబనవేదు లీక్రియన్.

తా.పురుషుడు స్త్రీయొక్క పెదవులు రెండును దీసి తనయొక్క పెదవుల యందు రుచి కలుగున ట్లుంచి చుంబనము చేయ నుల్లాసము చూపగా యాస్త్రీ యా పురుషునియం దట్లు చేసిన సంపుటచుంబనమని పెద్దలు వచించిరి.

క.ఈలాగు చుంబనంబుల
కేళిన్ జిహ్వారణంబుఁ గీలించినచోఁ
బోలఁగ ననువదనం బని
సీలించిరి చుంబనంబుఁ జెప్పెడిపట్లన్.

తా.ముందు చెప్పబడిన సంపుటచుంబనమువలెనె యొనరించుచు పరస్ప రము నాలుకతో జగడమాడునదియె ననువదనచుంబన మగును.

## అన్వితచుంబన లక్షణము

శ్లో.మృదు సమమనపీడ్యాభ్యర్థితం చేతి శేషే
ష్వపి కథిపదేషు ప్రోక్తమన్వర్థమేతత్||

ఆ.సమము మృదువుగాఁగ సల్పెడి యాచుంబ
నంబు కంఠ గండ నయనముఖ్య
చుంబనములఁ గలికి చూపులుఁ బలుకులు
నడర నన్వితాఖ్య మయ్యెఁ గృతుల.

తా.సమముగను మృదువుగను చేయుచుండెడి యాచుంబనమునందు మెడ చెక్కులు నేత్రములు మొదలగు చుంబకస్థానములయందు చుంబనములును శృంగా రపుచూపులును మాటలును ఒప్పునదియే అన్వితచుంబన మయ్యెను.

## ప్రాతిబోధ ఛాయిక క్రాంతమచుంబనంబుల లక్షణము

శ్లో.యదిసుచిరసమేతః ప్రేయసీమగ్రసుప్తాం

రహసి కృతకనిద్రాం చుంబతి ప్రాణనాథః|
కథితవిధమిదం స్యాచ్చుంబనం ప్రాతిబోధం
ద్వయమిదమపరం స్యాచ్చుంబనం ఛాయకాఖ్యమ్||

శ్లో.అభినవమనురాగం వ్యంజితుం దర్పణాదౌ
ప్రతికృతివిషయం వా చుంబనం పుంస్త్రియోః స్యాత్|
ప్రతికృతిశిశుచిత్రాశ్లేషణం చుంబనం వా
ద్వయముపహితభావం తచ్చ సంక్రాన్తమాహుః||

క.దూరగతుఁడైన పురుషుఁడు
చేరినచోఁ గపటనిద్రఁ జెందినవనితన్
గూరిమితోఁ జుంబించిన
నారయఁ బ్రతిబోధ మిదియె యాయిద్దఱికిన్.

తా.స్త్రీగాని పురుషుడుగాని యిరువురియందొకరు కార్యార్థులై దూరము పోయివచ్చినదినమున యింటియం దున్నవారు మేలుకొనియుండియే నిద్రపోవున ట్లభినయించుచున్న వారిని ప్రేమతో అధరమును చుంబిచుటయే ప్రాతిబోధచుంబ న మనంబడును.

ఉ.కాంతునిమీఁద మోహము ప్రకాశముఁ జేయఁదలంచి చందమః
కాంతశిలాదిదర్పణవికాసముల న్బొడసూపునీడలన్
జెంతలఁ జేరి చుంబనముఁ జేయుట ఛాయిక మయ్యె బాలురన్
దంతపుబొమ్మల న్నఖరతంబులఁ జేయుట క్రాంతమం బగున్.

తా.స్త్రీ పురుషునిమీదివలపును బయలుపరపదలంచి చంద్రకాంతశిలలు అద్దములయందు కనబడుచుండు యాపురుషుని ప్రతిబింబమువద్దకు జని చుంబనము చేయుటయే ఛాయికచుంబన మగును. బిడ్డలను బొమ్మలను వలపుచేత చుంబించు టయే క్రాంతచుంబన మనబడును.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే చుమ్బనాధికారో నామ సప్తమః పరిచ్ఛేదః

# అధికాధికరణము

ఈ గ్రంథమున బద్మినిస్త్రీ పాంచాలుని, చిత్రిణిస్త్రీ కూచుమారుని, శంఖినిస్త్రీ భద్రుని, హస్తినిస్త్రీ దత్తుని, ప్రేమించునని తెల్పియుండునేగాని యాయా పురుషుల లక్షణములను దెలుపకయుండుట వలన నెల్లూరు శివరామకవిచే రచింపబడిన 'కామకళానిధి' నుండి భద్ర కూచిమార పాంచాల దత్తుల లక్షణము లిందు జేర్ప నీ యధికాధిరణ మేర్పడెను.

సీ.దివ్యనాయకులు నదివ్యనాయకులును
నుభయనాయకులన నొప్పుమొదల
నలకూబరజయంతనలినబాణాదులు
దివ్యు లర్జునబలదేవముఖ్యు
లరయ వీర లదివ్యు లగుదురు విక్రమా
ర్కాదులు నుభయనాయకులు దలఁప
నీ త్రివిధంబుల నెనయు నాయకులకు
నాల్గుజాతులు ప్రధానంబు లవియు

ఆ.భద్ర కూచిమార పాంచాల దత్తుల
నాఁగనొప్పు దేవనాథుఁడాది
భద్రజాతి, మాణిభద్రాదు లలకూచి
మారజాతి యగుచు సౌరుగంద్రు.

తా.నలకూబరుఁడు, జయంతుడు, బాణుడు, మొదలగువారు దివ్యనాయ కులనియు; అర్జునుడు, బలదేవుడు మొదలగువారు అదివ్యనాయకులనియు, విక్ర మార్కుడు మొదలగువారు ఉభయనాయకులనియు ప్రసిద్ధి. ఈత్రివిధనాయకు లును భద్రుడు, కూచిమారుడు, పాంచాలుడు, దత్తుడు అను జాతులపురుషులుగా నెన్నబడిరి. దేవేంద్రుడు భద్రజాతియనియు, మాణిభద్రుడు కూచిమారజాతి యనియు తెలియందగినది.

ఆ.పంచబాణముఖులు పాంచాలజాతియౌ
చంద్రముఖులు దత్తజాతివారు
ఇంక నుభయులందు నెఱిఁగింతు బలభద్ర
ముఖులు భద్రజాతి ముఖ్యు లరయ.

తా.మన్మథముఖులు పాంచాలజాతియు, చంద్రముఖులు దత్తజాతియనియు తెలియదగినది. ఇంక వీరిలో బలభద్రుఁడు భద్రజాతియని తెలియవలెను.

ఆ.కూచిమారజాతిఁ గొమరొందు భీముండు
రఘుకులేంద్రుఁడైన రామవిభుఁడు
ప్రౌఢయశుఁ డొకండె పాంచాలపురుషుండు
తపనతనయుఁ డాది దత్తజాతి.

తా.భీముడు కూచిమారజాతియనియు, రాముడు పాంచాలజాతియనియు, సుగ్రీవుడు దత్తజాతియనియు తెలియందగినది.

ఆ.ఇపుడు పలికినట్టి యీ పురుషులకెల్ల
లక్షణములఁ గన నలక్షితములు
నైన మనుజులందు నభిహితలక్షణం
బుల నెఱుంగవలయు ముదముతోడ.

తా.పైన చెప్పంబడిన పురుషుల లక్షణములు తెలిసికొనజాలనివైనను మను ష్యులయందు యుక్తమగులక్షణములను దెల్పెదను గాన నెఱుంగవలయును.

## భద్రుని లక్షణము

సీ.అతిబలసంపన్నుఁ డభిమాని పృథుకాయుఁ
డరుణనేత్రుఁడు క్రోధి యతులతేజుఁ
డతివిశాలంబగు నాస్యంబు వక్షంబు
గలవాఁడు వక్రోక్తి బలుకువాఁడు
ఆర్ద్రదేహుఁడు నీతిశాలి గభీరుండు
బవిరిగడ్డమువాఁడు బల్లిదుండు
సాహసాంకుఁడు దాత సత్యవాక్యరతుండు
మేరుధీరుఁడు రాగమేదురుండు

గీ.వళులు గలవాఁడు పొడవగుపాండుమేన
రోమములు చాలగలవాఁడు రూఢిఁజెందు
భద్రపురుషుండనంగ విభ్రమముతోడ

విక్రమార్కుఁడు మొదలగు వీరవరులు.

తా.ఎక్కువబలము అభిమానమును, విరివియైనదేహమును, ఇంచుకయెఱ్ఱ పగుకండ్లును, క్రోధత్వమును, ఎక్కువతేజస్సును విశాలముగల ముక్కును బొమ్మును గలిగియుండుటయు, క్రూరమైనమాటలును, చెమటపట్టుదేహమును, నీతి గలిగి యుండుటయు, గంభీరము గలిగియుండుటయు, గుండ్రమైనగడ్డమును, మిక్కిలి బలమును సాహసమును గలిగియుండుటయు, దాతృత్వమును, నిజము మాట్లా డుటయు, ఎక్కువధైర్యమును గాఢమైన అనురాగమును, కడుపుమీది ముడుతలు ను, పొడవై తెలుపు మించిన పచ్చనిశరీరమున చాలవెంట్రుకలు గలిగియుండు టయు గలవాడు భద్రుఁడని తెలియవలయును. విక్రమార్కుడు మొదలగువీరు లీభద్రజాతివారని తెలియంజనును.

## కూచిమారజాతి పురుషలక్షణము

సీ.సమబలుఁ డతిఖర్వుఁ డమలనేత్రుఁడు కామి
ద్యూతపరుండు నిమ్నోదరుండు
అతినీలవర్ణుండు మతిశాలి తంత్రజ్ఞుఁ
డధికమత్సరి మూర్ఖుఁ డల్పరతుఁడు
మర్యాదలేమి సమ్మతముగానియతండు
పరనిందరతుఁడు నిష్కరుణుఁ డెపుడు
ఇంగితజ్ఞానవిహీనుండు మత్సర
గ్రస్తుండు కఠినవాక్భాషణుండు

ఆ.సంతతంబు తనదు సంస్తుతికలరెడి
స్వార్థపరుఁడు పరహితార్థవైరి
నాస్తికుండు కోపి ప్రస్తువాక్యుండు
కూచిమారుఁ డనఁగఁ గొమరుజెందు.

తా.సమానమగుబలమును, మిక్కిలిపొట్టిదనమును, తెల్లనికండ్లును, జూద మాడుటయం దాసక్తియు, ఎత్తగుపొట్టయు, మిక్కిలినల్లనిరంగుగల దేహమును, ఇచ్చవచ్చినట్లు జిత్తుల పన్నుటయు, ఎక్కువక్రోధమును, తెలిసితెలియనితన మును, కొద్దిసంభోగమును, ఇతరులను సన్మానించుటయం దనిష్టమును, ఇతరులను నిందించుటయు, కరుణలేకయుండుటయు, పొందినమేలు మరచుటయు, ఈర్ష్య కలిగియుండుటయు, కఠోరమగుమాటలును, ఎల్లప్పుడు తన్ను స్తుతించుకొనుట యందు ప్రీతియు, ఇతరులకు మేలుకలుగుకార్యములయం దిష్టములేక అపకారిగా నుండుటయు, నాస్తికత్వమును, కోపమును, మిక్కిలిస్తుతించు స్వభావముగల మాట లును గలవాడు కూచిమారుడని తెలియందగినది.

## పాంచాలపురుషుని లక్షణము

సీ.అతికరుణాశాలి యతిధర్మనిష్ఠుఁడు
ప్రియవాది మితభాషి ధీరహితుఁడు
నిండుచందురునవ్వు నెమ్మోముగలవాఁడు
వెడఁదకన్నులవాఁడు వినుతయశుఁడు
ఆజానుబాహుండు రాజలక్షణశాలి
మత్తమాతంగసమానయాయి
నిమ్మపండువితాన నెమ్మేనుగలవాఁడు
మంజుభాషయుతుఁడు మానధనము

ఆ.కలుగువాఁడు మేను చులకనగలవాఁడు

సత్యకర్మరతుఁడు సత్యవాది
విక్రమించునెడను వీరాధివీరుండు
పూతచరితుఁ డార్యపూజితుండు.

గీ.దేవతాగురుపూజలఁ దేలువాఁడు
ఏకపత్నీవ్రతుఁడు వివేకశాలి
దానమును నుబ్బు విద్యయుఁ దనరువాఁడు
పురుషవర్యుఁడు పాంచాలపురుషుఁ డగును.

తా.ఎక్కువకరుణయు, ధర్మాచరణమునం దిష్టమును, ప్రియమై మితమైన మాటలును, వెఱపరులకోర్కెను నెరవేర్చుటయు, పున్నమచందురు నెకసక్కె మాడుమొగమును, విశాలమైనకన్నులును, వినుతింపదగిన కీర్తియు, దీర్ఘమైన బాహువులును, రాజలక్షణములచే నొప్పుటయు, మదించినయేనుగువలె నడకయు, నిమ్మపండువలె శరీరచ్ఛాయయు, మంచిమాటలును, మర్యాద కాపాడుకొనుటయు, చులకనయగు శరీరమును, సత్కర్మలయందును సత్యవాక్పరిపాలనముననను ప్రియ మును, ఎదుర్కొనునెడల వీరులలో నగ్రగణ్యత్వమును బొందుటయు, పరిశుద్ధ మగు చరితము గలిగియుండుటయు, పెద్దలచే పూజింపబడుటయు, దేవగురుపూజల నొనర్చుటయు, ఒక్కభార్యతో నుండుటయే వ్రతముగా గలిగియుండుటయు, ధర్మమును, సంతోషమును, విద్యయు, కలిగియుండుటయు పాంచాలజాతి పురుషుని లక్షణములని తెలియందగినది.

## దత్తుని లక్షణము

సీ.అలసుఁడు మత్సరి యతిశయధృతిమంతుఁ
డల్పబలుండు మిథ్యాగుణుండు
అతిదంభయుతుఁడు విహారశీలుఁడు కామి
కుటిలచిత్తుఁడు రక్తకుంతలుండు
అతికృశదేహుండు వితతాధరాంగుండు
కూచిగడ్డమువాఁడు కుత్సితుండు
చెక్కుల వెన్నునఁ జేతుల రోమముల్
మొలవనివాఁడు సమున్నతుండు

గీ.మఱపుగలవాఁడు చింతల మలయువాఁడు
కర్కశాంగుఁడు దుర్నీతి గలుగువాఁడు
కృపణచిత్తుండు మందుండు విపులకేశి
దత్తుఁ డని పల్కఁబడియె సమ్మతముగాఁగ.

తా.సోమరితనమును, మాత్సర్యమును గలిగియుండుటయు, కొద్దిబలమును, గుణములేమియు, మిక్కిలికపటమును, వేడుకగా దిరుగుటయం దిష్టమును, కాముకత్వ మును, కుటిలస్వభావమును, ఎఱ్ఱనివెంట్రుకలును, మిక్కిలి కృశించినదేహ మును, పెద్దపెదవియు చిన్నగడ్డమును కుత్సితస్వభావమును, చెక్కులను వెన్ను నను చేతులయందును రోమములు మొలవకయుండుటయు, సాధారణమైనయెత్తును, మఱపుజెందుటయు, కోర్కెలతో తపించుటయు, కఠినమైన అవయవములును, దుర్నీతితో ప్రవర్తించుటయు, కుత్సితమును, మూర్ఖత్వమును, విరివియైనవెంట్రు కలును గలవాడు దత్తుడని తెలియందగినది.

అధికాధికరణము సంపూర్ణము

# నఖచ్ఛేదాధికారః
# అష్టమః పరిచ్ఛేదః

## నఖక్షతస్థాన సమయలక్షణము

శ్లో.కక్షాకరోరుజఘనస్తనపార్శ్వపృష్ఠహృత్కన్ధరాసు నఖరాః ఖరవేగయోః స్యుః|
ఆప్యన్యయోర్నవరతే విరతే చ మానే పుష్పే మదే ప్రవసనే విరహే ప్రయోజ్యాః||

చ.కరములు నూరుయుగ్మములు కక్షములు న్గటిపార్శ్వపృష్ఠకం
ధరహృదయస్తనద్వయవితానము తానఖరక్షతాళికిన్
విరహవిదేశయాన నవవిభ్రమకోప మతిప్రమత్తలన్
నరు లతిచండవేగమున నాటరు మార్దవ మాచరింపుచున్.

తా.చేతులు, తొడలు, చంకలు, గజ్జలు, పక్కలు, పిఱుదులు, మెడ, ఱొమ్ము, చన్నులు, యివి నఖక్షతము లొనరించుటకు స్థానములు. విరహిణి చాలదూ రము నడచినస్త్రీ భ్రాంతిపొందినస్త్రీ కోపముజెందినస్త్రీ ముట్టయినస్త్రీ మద్య పానాదులచే మత్తుగొనియున్నస్త్రీ వీరలను పురుషులు చండవేగమున నఖక్షతములు చేయక మృదురీతిం జేయంజనును.

## నఖక్షతగుణ లక్షణము

శ్లో.సాత్మ్యేన వా రదవిధేరపి నిర్ణయోఽయం
ప్రత్యగ్రభూరిశిఖరా అతిచండయోః స్యుః|
వర్ధిష్ణుతామలినతామృదుతోజ్జ్వలత్వం
నీరేఖతాఽస్ఫుటితతేతి గుణా నఖానామ్||

వ. స్త్రీపురుషులు దేశసాత్మ్యగుణానురాగంబులచే నిపుడెన్నంబడు కారణంబు లకు స్థానంబుల నెఱింగి నఖదంతక్షతములు రచింతురు. అవి చండవేగ మంద వేగములచే స్త్రీపురుషు లుపయోగించుటవలన దంతనఖంబులచే కలిగిన వ్రణములు వర్ధిష్ణుత=వృద్ధిపొందుస్వభావము గలదియు, అమలినత=మాలిన్యము కానిదియు, మృదుత=కఠినముగా నుపయోగింపనిదియు, ఉజ్జ్వలత=కాంతి గలదియు, నిరే ఖత=గీఱ లేనిదియు, అస్ఫుటిత=స్పష్టముగా కనుపించనిదియు, అని యారు విధంబుల వాడబడుచున్నవి.

## నఖక్షతనామములు

క.ఛురి తార్ధచంద్రమండల
శరశిఖిపద కుముదపత్త్ర శశకప్లుతముల్
వరుసగ నామము లయ్యెను
బరికింపఁగ నఖము లొత్తు ప ట్లెఱిఁగింతున్.

తా.ఛురితము అర్ధచంద్రము మండలము మయూరపదకము శశకప్లుతము కుముదపత్త్రము యని నఖక్షతవికారము లారయ్యె తల్లక్షణంబు లెఱింగించెద.

## ఛురితనఖక్షత లక్షణము

శ్లో.అవ్యక్తరేఖమణుకర్మ నఖైః సమస్తై
రోమాంచకృచ్ఛుటచటాధ్వనియోజితాస్తమ్|

అంగుష్ఠజాగ్రనఖతాడనతో నఖానాం
గండస్తనాధరగమాచ్ఛురితం వదన్తి||

ఉ.అన్నినఖంబుల న్వ్రణము లంటఁగనియ్యక మీఁదమీఁదనే
సన్నముగా గగుర్పొడువఁ జప్పుడుగాఁగ రచించి వీఁకపు
న్జన్నులసందున న్నగవు చల్లెడుచెక్కులఁ బెద్దవ్రేలిపై
నున్ననఖంబున న్గదియనొక్కుటబో ఛురితంబు నాఁబడున్.

తా.పైన చెప్పియున్న నఖక్షతస్థానములగు స్త్రీయంగములయందు పురు షుడు తన అయిదుగోళ్ళచేతను అంటీఅంటనటుల పైపైననే శరీరము జలదరించు నటుల జేసి చనులసందునను చెక్కులసందునను తనపెద్దవ్రేలిగోరుతో నొక్కు నదియే ఛురితమనబడును.

## అర్ధచంద్ర మండలక మయూరపాద నఖక్షతముల లక్షణము

శ్లో.వక్త్రోర్ధచన్ద్ర ఇతి యత్ స్తనకాన్ధరాంక
స్తౌ సంముఖౌ వదతి మండలకం మునీంద్రః|
స్థానం చ తస్య భగమూర్ధకకున్దరోరు
ద్విత్యందుశోపరిత ఏవ లిఖన్తి రేఖామ్||

శ్లో.అంగుష్ఠజం నఖమధో వినివేశ్య కృష్టైః
సర్వాంగులీకరరుహైరుపరి స్తనస్యః|
యచ్చూచుకాభిముఖమేత్య భనన్తి రేఖా
స్తద్జ్ఞా మయూరపదకం తదుదాహరన్తి||

సీ.భగముమీఁదను గండభాగంబు తొడలను
చంద్రార్ధకంబుల స్థానము లగు
చంద్రార్ధకంబులు సంగతంబై రెండు
నభిముఖంబై కొనలదికెనేని
మండలకం బయ్యె మఱి తత్ప్రమాణంబు
నై యుండు రెండుమూఁడంగుళములు
పెనువ్రేలిగోటిని జనుగవక్రిందుగా
నూది తక్కినగోళ్ళు మీఁద నునిచి

గీ.చంటికొనదాఁక రేఖపై సాఁగదివియ
కామశాస్త్రోక్తసరణిచేఁ గలుగు సురత
ముగ్గడింతురు దీని మయూరపాద
మనుచు నిది సేయుచుంద్రు బాహ్యాంతరముల.

తా.పురుషుడు స్త్రీయొక్కభగముమీదను కంఠముమీదను తొడలమీ దము తనగోరుతో అర్ధచంద్రాకృతిగా నొక్కునదియె అర్ధచంద్రము. పురుషుడు స్త్రీయొక్క పైనజెప్పినస్థానములయందు రెండుగోళ్ళచేత నభిముఖముగా కొనలు అతుకుకొనునటుల నొక్కునదియే మండలకమగును. పురుషుడు స్త్రీయొక్క చంటిక్రిందభాగమున పెద్దవ్రేలిగోరు నుంచి మీదిభాగమున నాలుగువ్రేళ్ళగోళ్ళు నుంచి చంటిమొనవరకు గీఱునదియె మయూరపాద మనంబడును.

## శశకప్లుత కుముదపత్త్రనఖక్షతముల లక్షణము

శ్లో.సర్వైః శశప్లుతమిదం కరజైః కుచాగ్రేహ్యాన్వర్థముత్పలదళం స్తనగుహ్యాపృష్ఠే|

రేఖా ఘనాస్త్రీచతురా జఘనేస్తనే వా స్మర్తుం ప్రవాసగమనే విధదుర్విదగ్ధాః||

క.అన్నినఖంబులు భామిని
చన్నులపై విటుఁడు నాట శశకప్లుతమై
యెన్నంబడు రమణీమణి
కిన్నియుఁ దముఁదలఁచుకొఱకు హేతువు లగుటన్.

తా.పురుషుడు తన్ను తలంచుటకుగాను స్త్రీయొక్క చన్నులపై తన యన్నిగోళ్ళచేతను నాటునటుల నొక్కుటయే శశకప్లుత మగును.

క.వలిచన్నుల జఘనంబున
నడివీపున మూఁడునాల్గు నఖరేఖ లొగిన్
నిలుపుదురు కుముదపత్త్రం
బులక్రియఁ దముఁబాసిచనఁగ బూర్వస్మృతికై.

తా.పురుషుడు స్త్రీయొక్క చన్నులు పిఱుదులు వీపు వీటియందు స్త్రీ యెడబాసినపుడు తనను దలంచునిమిత్తము గోళ్ళతో కలువరేకులవలె మూడు నాలుగు రేఖలుగా గీఱునదియె కుముదపత్త్రం బనంబడును.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే నఖచ్ఛేదాధికారో నామాష్టమః పరిచ్ఛేదః



# దంతచ్ఛేదాధికారః
# నవమః పరిచ్ఛేదః

## దంత నఖక్షతముల లక్షణము

శ్లో.స్నిగ్ధత్విషః శితనఖానతిదీర్ఘఖర్వా
రాగస్పృశ్యః సమఘనా దశనాః ప్రశస్తాః।
అన్తర్ముఖోత్తరరదచ్ఛదనేత్రవర్జం
స్థనేషు చుంబనవిధిః కథితేషు యోజ్యః॥

చ.ఘనములు గాక స్వల్పములు గాక వినిర్మలకాంతిఁ బోల్చి క్రొ
న్మొనలను వాఁడి గల్గి పలుమొగ్గలు తెల్లన మోవి యెఱ్ఱనై
తనరు రదంబు లివ్విధపు దంతనఖక్షతము ల్ఘటింపుఁడీ
యనయము నుత్తరోష్ఠనయనాననము ల్దొలఁగించి యన్నిటన్.

తా.గొప్పయు కొద్దియు గాక ప్రకాశముగాను కొనలయందు పదును గలిగి పలుమొనలు లేక కొంచెము యెఱ్ఱనైయున్న దంతనఖములచేతను మీదిపెదవి కన్నులు, ముఖము, వీటినిగాక మిగిలినస్థానములయందు దంతనఖక్షతము లొనర్ప వచ్చును.

## గూఢక, ఉచ్ఛూనక, ప్రవాళమణి దంతక్షతముల లక్షణము

శ్లో.రాగైకలింగమధరే కిల గూఢకం స్యా
దుచ్ఛూనకం దశనవాససి వామగండే।
స్యాత్పీడనాత్తదధరోష్ఠవిశేషయోగా
త్తత్ర ప్రవాళమణిరభ్యసనేన సాధ్యః॥

ఉ.అనుచు వాతెర న్గుఱుతు లంటఁ గలంచిన గూఢకం బగున్
మానుగ వామగండరదనచ్ఛదము ల్గదియంగఁ జేర్ప ను
చ్ఛూనమగు న్బ్రవాళమణి చొప్పడు దంతగళాధరోష్ఠసం
స్థానవిశేషయోగకృతసంభృతమౌ రదనక్షతం బగున్.

తా.పురుషుడు స్త్రీయొక్క క్రిందిపెదవిని చుంబించుచు పంటిచే గురుతు లంటునటుల నొక్కునది గూఢక మనబడును. పురుషుడు స్త్రీయొక్క యెడమ చెక్కిలియందు పంటిచేత నొక్కునది ఉచ్ఛూనక మగును. పురుషుడు స్త్రీయొక్క క్రిందిపెదవిని చెక్కులను పంటిచేత నొక్కునది ప్రవాళమణి యనంబడును.

## బిందువు, బిందమాలదంతక్షతముల లక్షణములు

శ్లో.మధ్యేఽధరం తిలశ ఏవ విఖండనే స్యాద్
బిన్దూ రదద్వయకృతే సకలైః కృతేతు।
స్యాతాం శితాగ్రదశనైర్మణిబిన్దుమాలే
కక్షాలలాటగళవక్షణభూషణే తే॥

ఆ.పెదవినడుమ నొక్క బిందువు నిల్పిన
బిందువంబు గాఁగ నంద మయ్యో
నళిక కక్ష గళము లందున రదములు
చాల మోప బిందుమాలి కయ్యో.

తా.పురుషుడు స్త్రీయొక్క క్రిందిపెదవినడుమ నువ్వుగింజవలె రెండు పండ్లచేత నొక్కునది బిందు వనంబడును. పురుషుడు స్త్రీయొక్క నుదురు, చంక, గళము, వీటియందు అన్నిపండ్లచేతను నొక్కునది బిందుమాలయని తెలియందగినది.

## ఖండాభ్రక, కోలచర్వితదంతక్షతముల లక్షణము

శ్లో.ఖండాభ్రకం స్తనతటే దశనాగ్రలేఖ్యం
స్యాన్మండలాకృతియుతం విషమైశ్చ కూటైః।
తామ్రాన్తరా రదనరాజిరఖర్వసాన్ద్రా
స్యాత్కోమలచర్వితమియం స్తనపృష్ఠభూషా॥

క.వాటపుగుబ్బలసందున
నాటిన ఖండాభ్రకంబు నామం బయ్యెన్
గాటముగఁ బండ్లు నాఁటిన
ధాటిగ నది కోలచర్వితం బనఁ బరఁగున్.

తా.పురుషుడు స్త్రీయొక్క చన్నులసందున పండ్లచేత నొక్కునదిటయె ఖండాభ్రక మనంబడును. పురుషుడు స్త్రీయొక్క చంటివెనుకప్రక్కను దట్టముగా పండ్లచేత నొక్కునది కోలచరిత్వ మనంబడును.

క.జాతిస్వభావచేష్టిత
చాతుర్యగుణేంగితాదిసంపూర్ణకళా
న్వీత శుభమూర్తివైభవ
నీతిసురాచార్యవైరినృపహతశౌర్యా.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే దంతచ్ఛేదాధికారో నామ నవమః పరిచ్ఛేదః

గద్యము
ఇది శ్రీమదష్టభాషాకవితాప్రవీణ నవఘంటాసుత్రాణ మాచనామాత్యపుత్త్ర
సుజనకవిమిత్త్ర సజ్జనవిధేయ యెల్లయనామధేయ
ప్రణీతంబైన కొక్కోకంబను గళాశాస్త్రంబునందుఁ
బ్రథమాశ్వాసము సంపూర్ణము





# ద్వితీయాశ్వాసము

## సురతాధికారః
## దశమః పరిచ్ఛేదః

క.శ్రీ వనితావల్లభపద
సేవా హేనాకవిజయ శృంగారకళా
భావజ్ఞ సకలవిద్యా
ప్రావీణ్యా కుంటముక్ల భైరవమల్లా.

శ్లో.విలసదమలదీపే పుష్పదామావకీర్ణే
ప్రసృతసురభిధూపే ధామ్ని కామీసువేషః|
సహ సహచరవర్గైర్వామపార్శ్వే నివేశ్య
స్త్రియముపహితభూషాం భావయే న్మర్మగోష్ఠీమ్||

శ్లో.కృతలఘుపరిరంభో వామదోష్ణా పటాన్తాం
చలకుచయుగకాంచీః సంస్పృశేద్భాయ ఏవ|
కలితలలితగాథాగీతిరుత్పాద్యచైవం
యువతిహృదయరాగం భగ్నగోష్ఠీప్రబన్ధః||

శ్లో.అలికచుబుకగండం నాసికాగ్రం చ చుమ్బన్
పునరుపహితసీత్కం తాలు జిహ్వాం చ భూయః|
ఛురితలిఖితనాభీమూలవక్షోరుహోరుః
శ్లథయతి ధృతధైర్యః స్వాపయిత్వాఽథ నీవీమ్||

సీ. పట్టెమంచము దూదిపఱుపు ముక్కలిపీట
యగరుధూపము వెలుగైనదివ్వె
పూవుల గంధపుఁబొడి పున్గుబరిణెయు
జాలవల్లిక వన్నెమేలుకట్లు
తమ్మపడిగమును దలగడ చిటిచాప
సానఱా యడపంబు సంచి గిండి
గొడుగు పావలు గాజుగుడిక సున్నపుఁగ్రోవి

గంధంపుఁజిప్ప బాగాలబరిణె

గీ.చిన్నిబిందెయుఁ జిరుతెర గిన్నెబోన
నిలువుటద్దము వీణెయుఁ జలుకసురటి
మిద్దెయిల్లును ముంజూరు మిగిలినట్టి
పంచయును గల్గు కేళికాభవనమందు

తా.పట్టెమంచము దూదిపఱుపు మూడుకాళ్ళుగలపీట అగరువత్తులపొగ వెలుతురుగల దీపము పువ్వులు గంధపుపొడి పునుగుల బరిణెయు చిత్రపుపనిచేసిన తమలపాకులకట్ట వన్నియగలిగిన తలిమము కళాంజి తలగడ చిఱుచాప సాన ఱాయి వక్కలాకులుంచుకొనుసంచి సన్నపుమెడగలచెంబు గొడుగు పావకోళ్ళు గాజుగులిక సున్నపుకాయ గంధపుగిన్నె వక్కపొడిబరిణె చిన్నబిందె చిన్నతెర భోజనపళ్లెము వీణె శుకము వట్రువవిసనకఱ్ఱ మిద్దెగలయిల్లు ముందు చూరుగలపంచయు గలిగిన కేళికాభవనమునందు.

సీ.పొగకంపు గలుగక మిగుల వెచ్చనగాక
తెలియైన నీటను జలకమాడి
కరము పల్చనయును గాక పిప్పియుఁ గాక
మృదువైన గంధంబు మేన నలఁది
గడిదంబుఁ జిలుగును కాక మేలైయున్న
పంచెపై వలిపదుప్పటము గట్టి
చెమ్మలేకయు వన్నె చెదరక వాసనఁ
గులుకు పువ్వులతోడఁ గొప్పు ముడిచి

గీ.మదనరతికోవిదులు పీఠమర్దకాది
విటులు సల్లాపములుఁ జేసి వేడ్కఁజేయ
మోహనాకారుఁడై మరుమూర్తివోలె
పల్లవుడు కేళిమందిరాభ్యంతరమున.

తా.పొగవాసనయు మిక్కిలివేడియులేని తేటయగు నీటితో స్నానము చేసి పల్చనయు పిప్పియుకాక మెత్తనిగంధమును శరీరమున పూసి ముదుగును అల్పమును కాని మేలగు పంచె కట్టి పరిశుద్ధమై వెలగల సన్నపాటి వెడల్పు వస్త్రము పైన వైచుకొని తడిలేక రంగుమారక పరిమళోపేతమగు పువ్వులను ముడిచి రతికళావేత్తలును పీఠమర్దకవిదూషకులును పరస్పరసంభాషణములతో సంతోషమును గలుగజేయు శృంగారరూపము గలవాడై మన్మథునివోలెనున్న వరుడు ఆ కేళీగృహమునందు —

సీ.వలిపపయ్యెదలోన నిలువక వలిగుబ్బ
చనుదోయిమెఱుఁగులు చౌకళింపఁ
బగడంపువాతెఱపై నొకించుక దాఁగి
మొగమునఁ జిఱునవ్వు మొలకలెత్త
కొలుకుల నునుగెంపుఁ జిలికించు గ్రొవ్వాఁడి
దిట్టచూపులు తలచుట్టుఁ దిరుగ
నునుకొప్పులోపల నునిచినపువ్వుల
తావి పైకొని తుమ్మెదలను బిలువ

గీ.తొడవులకునెల్లఁ దొడవైన యొడలితోడ
వలపుకునెల్లఁ దనమేని వలపుఁ దెలుప
పరఁగు కామిని దనవామభాగమునకుఁ
గదియఁగా వేడ్క లెంతయుఁ గడలుకొనఁగ.

తా.గుబ్బచన్నులయొక్కఠీవి పయ్యెదలోనిండి యచ్చటనే యుండక కనులకు మిఱుమిట్లు గొలుప, ఎఱ్ఱనికాంతిగల పెదవులపై దాగియుండిన మొలక నవ్వు మొగమున కనుపింప, కనుగొలకుల నెఱ్ఱనిఛాయను ప్రకాశింపచేయు వాడి చూపులు తలచుట్టును దిరుగ, కొప్పున ముడిచిన పువ్వులయొక్క పరిమెళము తుమ్మెదలనుబిలువ, భూషణముల కన్నిటికిని భూషణమగు యొడలితో, మోహ ముల కన్నిటికిని తనదేహమం దలమిన వలపుపూత మదనోపశ్లేషముచే పొంగి స్రవిం చుచు విటునకు వలపు దెలుపునట్లుండిన కాంతను తన యెడమదిక్కునకు దీసికొని కోరిక లీరిక లెత్త సంతసంబున —

ఉ.సన్నపుఁబాటఁ బాడి రతిసంభ్రమ మొప్పఁగఁ గౌఁగిలింపుచు
న్జన్నులు చీరెకొంగు కచసంచయమున్ రచనాకలాపమున్
మున్నుగ వామహస్తమున ముట్టుచు హస్తము గీలుకొల్ప నా
సన్న యెఱింగి యొండొకఁడు జారిన నెచ్చెలికాండ్రు నంతటన్.

తా.పురుషు డాస్త్రీని సంతోషమున కౌగిలించుచు కుచములును చీరె కొంగును కొప్పును ముందుగ యెడమచేత ముట్టుచు చేసన్న జేయ చెలికాండ్రం దరు తెలిసికొని యొక్కొక్క రాస్తలమును బాసిన తరువాత —

చ.పొలఁతుక నాసికాగ్రము కపోలమును న్జుబుకంబు ఫాలమున్
జెలు వలరంగఁ జుంబనముఁ జేసి పదంపడి తాను జిహ్వలన్
గళరవ మొప్పఁ జుంబనవికారముల న్ఘటియించి మన్మథ
స్థలనకుఁ జేరఁజొచ్చి రతిసంగతిఁ జేసి ద్రవింపఁజేయుచున్.

తా.పురుషు డాస్త్రీయొక్క ముక్కుకొన దవడ చుబుకము నొసలు ముద్దాడి మరియు తాను కంఠధ్వని యొప్పునట్లు చుంబించుచు పొన్పునందు జేర్చి రతిసాంగత్యముచేత ద్రవింపజేయవలయును.

## రతిప్రేరేపణక్రియాలక్షణము

శ్లో.యతి విమతిముపేయాద్ గణ్డపాలీం విచుంబ్య
స్మరగృహమపి లింగాగ్రేణ సంపీడ్య దత్త్వా|
ముఖమభిముఖమస్యా అంగమాలింగ్య దోర్భ్యాం
మదనసదనహస్తక్షోభలీలా విదధ్యాత్||

ఆ.అతివ రతికి విముఖ మైనను బురుషుండు
చెక్కుచుంబనంబుఁ జేసి మదన
గృహము లింగమునను గీటుచుఁ గౌఁగిట
హత్తి చేత గుహ్య మలమవలయు.

తా.స్త్రీ రతికి సమ్మతింపకయుండునపుడు పురుషు డా నాతిదవడలు ముద్దాడి మదనగృహమును కామదండముచేత తాకింపుచు కౌగిలించుకొని చేతితో మదనగృహమును గవియవలయును.

## భగభేద లక్షణము

శ్లో.సరసిజమృదురన్తః కోపి కీర్ణోంగులీభి
ర్భవతి చ వలితోన్యః కోపి గోజిహ్వికాభిః|
ఇతి మదననివాసో యోషితాం స్యాచ్చతుర్ధా
వ్రజతి శిథిలతాం చ శ్లాఘ్యతాం పూర్వపూర్వః||

సీ.నాల్గుచందములు మన్మథమందిరములందు
నుండు తామరరేకు నోజ నొకటి
పులినసంగతి మించి పొడవున మిక్కిలి
తరులచాయలు గల్గి తనరు నొకటి
విరివి లోఁతై చేతివ్రేళ్ళన్ని గూడంగఁ
జొనుపక పన్ను కాదనెడి దొకటి
వరుసనై గోజిహ్వా తెఱఁగున నధమమై
యేపట్ల కందక యెసఁగు నొకటి

ఆ.యిందులోన మొదల నెన్ని దెయ్యది
యదియె ద్రవము నించు ననుగుణముగఁ
గొదువమూఁడు నొకటికొకటికి నధమమౌ
నెన్నిచూడఁ దనరు నన్నులకును.

తా.స్త్రీలకు భగములు నాలుగుతెరంగులైయుండు. అందొకటి తామర రేకువలె మృదువుగా నుండును. మఱియొకటి యిసుకదిన్నెవలె పొడవుగా మడ తలు గలిగియుండును. వేరొకటి మిక్కిలి లోతై చేతివ్రేళ్ళన్నియు బ్రవేశింప జేయక పరిపక్వముగాక యుండును. ఇంకొకటి ఆవునాలికవలెనే అధమమై యేవిధముగాను స్రుక్కక యుండును. ఈ నాలుగువిధముల భగములలో మొదట చెప్పిన తామరరేకువంటిదే పురుషున కనుకూలముగా ద్రవించును. కడమ మూ డును వరుసగా నొకటికంటె యొకటి అధమమని యెరుంగవలయును.

శ్లో.నివసతి భగమధ్యే నాడికా లింగతుల్యా
మదనగమనదోలా ద్వ్యంగులక్షోభితా సా|
సృజతి మదజలౌఘం సా చ కామాతపత్రం
ద్వయమిహ యువతీనామిన్ద్రియం నిర్దిశన్తి||

ఉ.కామినిగుహ్యమధ్యమునఁ గల్గిననాడియు లింగతుల్యమై
కాముకుఁడోలఁ జేసి యది కామగదల్చియు నంగుళీయక
భ్రామక మాచరించినను బట్టఁగ రెండుతెఱంగులందు న
క్కామగృహంబు భేదిలినఁ గామజలం బుదయింపకుండునే.

తా.స్త్రీయొక్క భగమధ్యమందు లింగమునకు సమానమై మేఢ్రమునకు నుయ్యెలగా నొకనాడి యుండును. ఆనాడిని కామముగా దలంచి వ్రేళ్ళచేత త్రిప్పిన ద్వివిధములైన నా కామగృహ ముప్పొంగి రతిద్రవము పుట్టును.

శ్లో.మదనసదనరన్ధ్రాదూర్ధ్వతో నాసికాభం
సకలమదశిరాఢ్యం మన్మథచ్ఛత్రమాహుః|
వసతి మదనరన్ధ్రస్యాన్తరే నాతిదూరాత్
స్మరజలపరిపూర్ణా పూర్ణచన్ద్రేతి నాడీ||

క.మరునికి ఛత్రం బనఁగా
మరునింటికిమీఁద ముక్కుమాడ్కి నెసంగు
న్నరమొకటి చంద్రనాడియు
పొరుగుననే యుండు నుదకపూర్ణం బగుచున్.

తా.మన్మథునికి గొడుగా యనగా యోనికి మీదిభాగమున ముక్కువలె యొకనరముండును. దానికి సమీపముననే జలపూర్ణమైన చంద్రనాడి యుండును.

శ్లో.నివసతి బహునాడీచక్రమన్యత్ప్రధానం
త్రితయమిదమహోక్తం హస్తశాఖావిమర్దే।
కరికరఫణిభోగార్ధేన్దుకామాంకుశాద్యై
రలమిహ కరశాఖా యోగభేదాభిధానైః॥

శ్లో.శిథిలయతి కఠోరాం తర్జనీమధ్యమాభ్యా
మసకృదుదితనాడీం క్షోభయిత్వా యథోష్టమ్।
ఇతి నఖరదచుమ్బాశ్లేషగుహ్యోపచారై
ర్విలసతి మదరాజ్యే యన్త్రయోగం విదధ్యాత్॥

సీ.సవరించు బహునాడిచక్ర మంగజుమంది
రంబులోపలను నరంబుఁ గూడి
చంద్రనాడి స్మరచ్ఛత్రంబులును బహు
నాడిచక్రము ప్రధానత్రయంబు
కరికరఫణిభోగకామాంకుశార్ధేందు
వులుగాఁగ వ్రేళ్ళు నంగుళుల కయ్యె
నీవ్రేళ్ళలోపల నిన్నిటికంటెను
ముఖ్యంబు పెనువ్రేలు మొదటివ్రేలు

గీ.గాన నీరెండువ్రేళ్ళను గదియఁగూర్చి
మొదటఁ జెప్పిన త్రితయంబు నదిమి పుణికి
మెదపి కలయించి యలయింప మదనజలము
వొడము భువియందు నెటువంటి పొలఁతికైన.

తా.భగములోని నరమును గూడి బహునాడిచక్ర మని యొకటి యుం డును. ఇదియు చంద్రనాడియు మన్మథునిగొడుగును ఈ మూడును ప్రధాన ములు. కరికరము, ఫణిభోగము, కామాంకురము, అర్ధేందము, అని వ్రేళ్ళకు పేరులు. ఈవ్రేళ్ళలో అన్నిటికంటె పెద్దవ్రేలును మొదటివ్రేలును ముఖ్యము గావున ఈరెండువ్రేళ్లను యొకటిగా చేర్చి ముందుచెప్పిన చంద్రనాడియు కామాతపత్రము బహునాడిచక్రమును యీ మూడింటిని యీరెండువ్రేళ్లచే నదిమి మెదిపి, కలయబెట్టి అలియునటుల జేసిన యేలాటి కఠినమైన స్త్రీకైనను మదన ద్రవము పుట్టును.

క.ఈరీతిని నఖదంతప
రీరంభణచుంబనాదిరీతుల మదనా
గారోపచారముల యెడ
నోరిచి మరురాజ్యతంత్ర యోగోన్ముఖుఁడై.

తా.ఈ విధముగా నఖక్షత దంతక్షత చుంబన యాలింగన కరకరి క్రీడలు మొదలగు భగోపచారముల యందు సహించి మదనరాజ్యతంత్రములయం దాసక్తి గలవాడై —

శ్లో.అథసాత్మ్యవశాత్కృతబాహ్యరతః పరతః ప్రమదాం కలయేత్సమదామ్।
స్మరమందిరమానసనమానగతిః స్మరయన్త్రవిధిం విదధీత పతిః॥

చ.హితమగుదేశరీతి సతియిచ్చ యెఱింగి విటుండు బాహ్యపున్
రతులఁ గలంచి కామగృహరంధ్రచరత్పరిమాణకోశుఁడై
యతనుకళావిధిజ్ఞు లగునార్యులు చెప్పినభంగి నుల్లస
త్ప్రతికరణప్రసక్తుల విరాజితుఁడై రతి సల్పఁగావలెన్.

తా.విటుడు తన కనుకూలమైన స్త్రీయొక్క మనస్సును దేశాత్మీయ మును తెలిసికొని నఖక్షత దంతక్షత ఆలింగన చుంబనాది బాహ్యరతులచే స్త్రీని కరగించి యోనికి సమానమైన పరిమాణముగల శిశ్నము గలవాడయి మన్మథశాస్త్ర వేత్తలు చెప్పిన ప్రకారము బంధనాదులచే రతి చేయవలయును.

శ్లో.శిథిలస్మరసద్మఘనీకరణం యది సంయమితోరు భవేత్కరణం|
సుఘన్ జఘనే శిథిలీకరణం వివృతోరుకమేన మతం కరణం||

ఆ.పెద్దమదనగృహము పిన్నగాఁ జేయను
బిన్నగృహము మిగులఁ బెద్ద సేయ
విటుఁడు సంవృతోరు వివృతోరువు లనెడి
కరణముల నెరింగి కవయవలయు.

తా.విటుడు స్త్రీయొక్క భగము పెద్దదిగా నుండిన చిన్నదిగా చేయను చిన్నదిగా నుండిన పెద్దదిగా చేయను సంవృతోరు వివృతోరువులను బంధములను దెలిసికొని రమింపవలయును.

శ్లో.ఇహ నీచరతే ఘటయత్యఘనం జఘనం ప్రమదాతిమదాకులితా|
ధ్రువముచ్చరతే ప్రవిశాలయత ప్రగుణం సమమేవ సమే స్వపితి||

గీ.నీచరతియందు మదమెక్కి నీరజాక్షి
సంకుచిత మొనర్చును దన జఘనతలము
ఒడ్డుగా నుంచు జఘనంబు నుచ్చరతిని
చాన కదలక నిదురించు సమరతాన.

తా.స్త్రీ నీచరతమందు మదోద్రేకము గలదై జఘనమును సంకుచితమును జేయును. ఉచ్చరతియందు విశాలమును జేయును. సమరతియందు నిద్రించు చున్నటుల కదలక పరుండును.

## బంధ భేదములు

శ్లో.ఉత్తానకతిర్యగథాసితకం స్థితనానతమిత్యపి పంచవిధమ్|
సురతం గదితం మునినా క్రమశః కథయామి విశేషమశేషమతః||

వ. మఱియు నాకరణంబుల లక్షణంబు లెఱింగించెద — నారీరత్నము పర్యంకంబున వెల్లకిలగాఁ బరుండినపుడు తత్పాదంబులు కరంబుల న్బట్టి పట్టుబంధంబు లుత్తానకరణంబు లనఁ జను — పువ్వుఁబోఁడి ప్రక్కవాటుగా నెడమపార్శ్వంబుగానైనఁ గుడిపార్శ్వంబుగానయినఁ బవళించియుండఁ బురుషుఁడభిముఖముగాఁ బవ్వళించి పట్టుబంధంబులు తిర్యక్కరణంబు లనంబడు —అంగనామణి కూర్చుండియుండఁ బురుషుండు పైకొని పట్టు బంధంబులు స్థితకరణంబులని యనంబడు — మగువ నిలిచియున్నపుడు స్తంభకుడ్యాదు లానికగా నుంచి పురుషుండు పట్టుబంధంబు లుద్ధితకరణంబు లనఁ జను — కోమలాంగి పాదంబులు కరంబులు పానుపున నాని తిర్యగ్జంతువులరీతి వాలియున్నపుడు పురుషుండు వెనుకభాగమున నిలిచి పట్టుబంధంబులు వ్యానకరణంబు లనంబడు — నివియైదును బురుషకృత్యంబు లగు నింకఁ బురుషుండురతివిశ్రాంతుఁడయి పవళించియున్నపుడు ప్రేమాతిశయంబునఁ దనివి సనకలతాంగి పురుషుని బైకొని పట్టుబంధంబులు విపరీతకరణంబులు నాఁ బరఁగె.వీటికి యథాక్రమంబుగా లక్షణంబులు వివరించెద.

శ్లో.ఉత్తానరతప్రచయే కరణ ద్వయమత్ర సమే, త్రయముచ్చరతే|
క్రమతోథ చతుష్టమల్పరతే గదితం మునినాథ వినా నియతేః||

గీ.కరణములు గ్రామ్య నాగరకములు రెండు
జృంభి తోత్ఫుల్ల నింద్రాణి చెలఁగు మూఁడు
పీడి బాడబ సంపుట వేష్టి నాల్గు
సమరతులను నీచోచ్చులఁ జనును వరుస.

తా.ఉత్తానరతసమూహమునందుగల గ్రామ్య, నాగరక బంధములు రెం డును సమరతమునందును, ఉత్ఫుల్లక, జృంభిత, ఇంద్రాణి బంధములు మూడును నుచ్చరతమునందును, సంపుటకము, పీడితము, వేష్టితము, బాడబకబంధములు నాలుగును నీచరతియందును నుపయోగింపవలెను.

## 1 గ్రామ్య, 2 నాగరక బంధముల లక్షణములు

శ్లో.ఉత్తానితయోషిత ఏవ భవేదుపవిష్టవరోరుగమూరుయుగమ్|
తద్గ్రామ్యమథాస్య బహిః కటితో యది యాతి తదా కిల నాగరకమ్||

చ.చిలుకలకొల్కి పాన్పుపయి జల్వమరం బవళించియుండఁగా
నలువుగ దానియూరువులు నందకుమారుఁడు నైజజానుసీ
మలఁ దగనిల్పి పల్మరును మారునికేళిని గూడెఁ గావునన్
దెలియఁగ గ్రామ్యబంధమని తెల్పిరి దీని ముదంబు మీఱగన్.

తా.స్త్రీ పానుపునందు పండుకొనియుండ నాస్త్రీయొక్క తొడలను కృష్ణమూర్తి తనయొక్క మోకాళ్లయందుంచుకొని పలుమారు రతి సల్పెను కనుక నాభావమును వాత్స్యాయనాదులు గ్రామ్యబంధ మని తెల్పిరి.

మ.యమునాసైకతసీమలందుఁ గడునొయ్యారంబునన్ రాధికా
రమణి న్పూవులసెజ్జఁ జేర్చి చెలువారం దత్పదాంభోజయు
గ్మముఁ దా గజ్జలఁ జేర్చి యూరువుల దత్కాంతోరువు ల్చేర మో
దమున న్గూడిన నాగరాఖ్యమను బంధం బండ్రు ధాత్రీజనుల్.

తా.కృష్ణమూర్తి యమునానదీతీరమునం దున్న యిసుకదిబ్బలయందు పుష్పవేదికపయి రాధికనుంచి యారాధయొక్క పాదములు రెండును తన గజ్జల యందుంచుకొని తనయొక్క రెండుతొడలచే నాపెయొక్క తొడలను బిగించి రమించిన భావమే నాగరాఖ్యబంధ మందురు.

## 3 ఉత్ఫుల్లక బంధలక్షణము

శ్లో.కరయుగ్మధృతత్రికమూర్ధ్వలసజ్జఘనం పతిహస్తనివిష్టకుచమ్|
స్ఫిగ్బింబబహిర్ధృతపార్ష్ణియుగం హ్యుత్ఫుల్లకముక్తమిదం కరణమ్||

ఉ.కామిని కించిదున్నతముగా జఘనం బెగనెత్తి తత్కటీ
సీమలక్రిందఁ బాదములు చేరిచి కృష్ణు కటీద్వయం బొగిన్
బ్రేమను జేతులందు నిడఁ బ్రీతి విభుండు కుచంబు లాని యు
ద్ధామగతిన్ రమించినది ధారుణి ఫుల్లకనామబంధమౌ.

తా.స్త్రీ కొంచెము ఎత్తుగా మొలనెత్తి తన పిరుందుల క్రింద పాదములను జేర్చుకొని కృష్ణుని యొక్క రెండుపిరుందులను తన చేతులతో పట్టుకొనియుండ పురుషు డాస్త్రీయొక్క కుచములను బట్టుకొని యేపుగా రమించుభావమును ఫుల్లక బంధమనియు నుత్ఫుల్లక బంధమనియు శాస్త్రజ్ఞు లెఱింగించెదరు.

## 4 జృంభిత బంధ లక్షణము

శ్లో.యది తిర్యగుదంచితమూరుయుగం దధతీ రమతే రమణీ రమణమ్|
విహితాపసృతిర్వివృతోరుభగా భువి జృంభితముక్త మిదం కరణమ్||

మ.అరులంబోణి నిజోరువు ల్కరములం దడ్డమ్ముగా సాఁచి ని
శ్చలమై యుండఁగ నెత్తి కామునిలు విస్తారంబుగాఁగ న్పిరుం
దులఁదోడ్తో నెదురొడ్డుచుండ హరి చేతోరాగ ముప్పొంగఁ జె
న్నలరం గూడఁగ జృంభితాఖ్యమగు బంధంబయ్యెఁ జిత్రంబుగన్.

తా.స్త్రీ తనయొక్క తొడలను చేతులయం దడ్డముగా సాచి కదలకుండున టు లెత్తియుంచి యోని విరివిచెందునటుల పిరుదులను వెంటవెంటనే యెదురొడ్డు చుండ కృష్ణమూర్తి యుల్లాసముతో నాస్త్రీని రమించిన భావమే జృంభితబంధ మనబడును. ఈబంధము బాడబావృషభులకు ప్రియము.

## 5 ఇంద్రాణిక, 6 ఇంద్రక బంధముల లక్షణము

శ్లో.నిజమూరుయుగం సమమాదధతీ ప్రియజాను నియోజయతి ప్రమదా|
యది పార్శ్వత ఏవ చిరాభ్యసనాదిన్ద్రాణికముక్త మిదం కరణమ్||

ఆ.తొడలు సమముఁ జేసి తొయ్యలి విటుని మో
కాలిమీఁదఁ బారఁ గీలుకొల్పి
ప్రియుని చంక నిడుద పిక్కలు నిలుప నిం
ద్రాణికంబు నృత్యరమణి కయ్యెఁ.

తా.స్త్రీ తనయొక్క తొడలను సమముచేసి పురుషుని మోకాళ్లమీద బారచాచి ప్రియునియొక్క చంకల రెండుపార్శ్వములయందు తనపిక్కల నుంచి రమించిన భావమే ఇంద్రాణికబంధ మగును. ఈ బంధము నాట్యస్త్రీకి యొప్పి యుండును. ఇది హరిణీతురగులకు బ్రియంబు.

చ.సతి తనబాహుమూలములసందున గట్టిగ నాత్మజానువుల్
వెతికిలఁబెట్టి పాన్పుపయి వెల్లకిలం బవళించియుండఁగా
మితిగ మురారిపాదములమీఁదను దత్కటియుగ్మ ముంచి యు
న్నతకుచయుగ్మ మాని రమణన్ రమియించిన నింద్రకం బగున్.

తా.కాంత తనచంకలసందులలో తనయొక్క పిక్కలను గట్టిగా పట్టి పానుపుమీద వెల్లకిల పరుండియుండ కృష్ణమూర్తి తనపాదములమీద నాస్త్రీ యొక్క పిఱుదుల నుంచి కుచంబులను బట్టి రమించుభావమే యింద్రకబంధ మగును. ఇది కరిణీజాతిస్త్రీకిని శశజాతిపురుషునకును బ్రియము.

## 7 పార్శ్వసంఘటిత, 8 ఉత్తానసంఘటిత, 9 పీడిత బంధముల లక్షణములు

శ్లో.సరలీకృతజంఘముభౌ మిళితౌ యది సంపుటకో భవతి ద్వివిధః|
ఉత్తానకపార్శ్వవశాద్ యుపతేః స చ పీడితమూరునిపీడనతః||

క.చిక్కన్పిక్కల నాథుని
ప్రక్కల బిగియించి పాన్పుపైఁ బవళింపన్
జక్కెరవిల్తునికేళిన్
జక్కఁగ హరిఁ గూడఁ బార్శ్వసంఘటిత మగున్.

తా.స్త్రీ తనయొక్క పిక్కలచే పురుషుని యొక్క పక్కలను బలముగా బిగించి పరుండియుండగా

పురుషుడు రతిసల్పుభావమును పార్శ్వసంఘటిత బంధమనిరి.

చ.చెలి తన రెండుపిక్కలను శ్రీహరిగౌను బిగించిపట్టి భూ
తలమునఁ జేతు లానుకొని తల్గడమీఁదను జేరియుండఁగా
గులుకుమెఱుంగుగుబ్బలను గోరుల నొక్కుచు మోవి యాని తా
నలరుచుఁ గ్రీడ సల్ప నది యౌత్తనసంఘటితంబు నాఁదగున్.

తా.స్త్రీ తనపిక్కల రెంటిచేతను కృష్ణమూర్తియొక్క నడుమును బిగించి పట్టి భూమిమీద చేతు లానుకొని తలగడమీదను జేరియుండగా నాస్త్రీయొక్క చన్నులను గోళ్లతో నొక్కుచు నధరపాన మానుచు శ్రీకృష్ణుడు రమించుభావ మును యుత్తానసంఘటిత బంధమనిరి. ఇది హరిణీశశులకు బ్రియమైనది.

చ.జలజదళాక్షి పాదములు సక్కఁగ రెండును గూర్చి సాఁచి పూ
దలిమమున న్బరుండ ప్రమదంబునఁ బైకొని యమ్మురారి బో
ర్గిలఁ బవళించియుండ మృదురీతిగ నూరువుల న్దదీయ ని
శ్చలమదనధ్వజంబు సరస న్బిగియించినఁ బీడితం బగున్.

తా.సతి తనయొక్క రెండుపాదములను సమముగా చేర్చి జాచుకొని పానుపుపై బవళించియుండగా కృష్ణమూర్తి యాసతిపై బోరగిల్లుగా పండుకొన నాసతి తనయొక్క తొడలతో కృష్ణమూర్తి శిశ్నమును బిగింప మురారి రతి సల్పినభావమును పీడితబంధమనిరి. ఇది శశజాతి యువతికిని తురగజాతి పురుషునకును బ్రియము.

## 10 వేష్టిత, 11 బాడబక బంధముల లక్షణములు

శ్లో.పరివర్తితమూరుయుగే తు భవేదితమేవ హి వేష్టితనామధరమ్|
గృహ్ణాతి భగోష్ఠపుటేన యది ధ్వజమస్ఫురమిత్యాపి బాడబకమ్||

మ.నళినీలోచన యూరుకాండముపయి న్నాథోరువు ల్సుట్టి దో
ర్బలత న్మే న్బిగియారఁ గౌఁగిటను జేర్పన్ శౌరియున్ మోహ మ
గ్గలమై క్రమ్మఱ మీఁద వ్రాలి ధర మోకా ళ్ళూనియు న్మోవియు
న్గళన న్బట్టుచుఁ గూడ వేష్టితసమాఖ్యంబైన బంధం బగున్.

తా.స్త్రీ తననాథునియొక్క తొడలను తనయొక్కు తొడలతో చుట్టి యాతని శరీరమును గట్టిగా యాలింగనము జేయ కృష్ణుడు మోహము రెట్టింప భూమియందు మోకాళ్ళ నుంచి నాసతిపై వ్రాలి యధరపానము చేయుచు కళలను ముట్టి రతిసల్పుభావమును వేష్టితబంధ మనబడును. ఇది బాడబవృషభులకు బ్రియము.

మ.మితిగాఁ గాళ్ళు గుదించి పాదములు భూమి న్నిల్పి మేనెల్ల నా
యతశయ్యన్ గదియించి మన్మథగృహప్రాంతంబున న్గట్టిగాఁ
బతిలింగంబు బిగించి పల్మరు నితంబం బెత్తుచు న్గాంత యు
ద్ధతిగాఁ గూడిన బాడబాఖ్యమను బంధం బయ్యెఁ జిత్రంబుగన్.

తా.కాంత తనపాదములు భూమిమీద నానునటుల మితముగా కాళ్ళను ముడుచుకొని పరుపుమీద నిడుపుగా శరీరమంతయు నానునటుల పండుకొని పురుషునిదండమును తనయోనిప్రదేశమునందు గట్టిగా బిగించి పిరుదులను మాటి మాటికి నెత్తుచు నేరుపుగా రమించుభావమును బాడబాఖ్యబంధ మనిరి. ఇది బాడబావృషభులకు బ్రియము.

## 12 ఉద్భుగ్న, 13 ఉరస్ఫుట బంధముల లక్షణములు

శ్లో.యది సంహతమూర్ధ్వగమూరుయుగం యువతీం పరిరభ్య రమేత నరః|
తదుభ్గ్నమురఃస్ఫుటనం తు భవేదురసి ప్రమదాచరణద్వయతః||

మ.తరుణీలోకశిఖావతంసము కరద్వంద్వంబుచే నూరువు
ల్సరిగా రెండును గూర్చి పట్టుకొని లీలాహాసము ల్మీఱఁగా
విరిసెజ్జం బవళించియుండ హరి పృథ్వి న్గొంతుకూర్చుండి మే
నొరువంకన్ రమియింపఁగా నదియె తా నుద్భుగ్నబంధం బగున్.

తా.సతి తనరెండుచేతులతో తనయొక్కతొడలను సరిగా జేర్చి పట్టుకొని పుష్పశయ్యపై బవళించియుండ కృష్ణమూర్తి యాసెజ్జపయి గొంతుకూర్చుండి యొకప్రక్కకు రమించుభావమును ఉద్భుగ్నబంధ మనబడును. (ప్రక్కకు రమిం చుట యనగా — సతి పడమరవైపునకు తలబెట్టి పండుకొనియుండ పురుషుడు నైరుతిమొగంబుగా గూర్చుండి రమించుట.) ఇది కరిణీవృషభులకు ప్రియము.

చ.వనిత నిజోరుకాండములు వంచి సమంబుగ రెండుఁ గూర్చి నా
థునియురమందు నించిన మృదుక్రియ దోపఁ బ్రియంవదుండు చ
య్యనఁ జెలి రెండుమూఁపులు కరాబ్జయుగంబునఁ బట్టి లాఘవ
మ్మున మురవైరి గూడునది భూమి నురస్ఫుటబంధమై తగున్.

తా.కాంత తనయొక్క రెండుతొడలను సమముగా జేర్చి వంచి పురుషుని యొక్క రొమ్ముపయిభాగమునం దానించగా నత డాసతియొక్క రెండుభుజ ములను తనరెండుచేతులతో బట్టుకొని నెమ్మదిగా రమించుభావమును ఉరస్ఫుట బంధమని తెలియందగినది.

## 14 అర్ధాంగనిపీడిత, 15 జృంభక, 16 ప్రసారిత బంధముల లక్షణములు

శ్లో.అర్ధాంగనిపీడితమేకపదప్రసృతావథ జానుయుగం యువతేః|
స్కన్దే యది జృంభకమేకమధః ప్రసృతం యది పారితముక్తమిదమ్||

మ.ఒకపాదాబ్జము నాథుపే రురమునం దొప్పార మై వంచి వే
ఱొకపాదంబు తదీయహస్తతలమం దుద్యత్క్రియన్ సాచి బా
లిక పూసెజ్జను బండియుండగను బాళిన్ శౌరి పైకొన్న సా
ర్థక మర్ధాంగనిపీడితాఖ్యమగు బంధం బయ్యె నిద్ధారుణిన్.

తా.కాంత తనకాలొకటి పురుషునిరొమ్ముమీదను బెట్టి వేరొకపాదము నతనిచేతియం దుంచు పాన్పుపయి పవళింపగా మోహముతో కృష్ణమూర్తి తనరొ మ్మునందున్న యాసతియొక్కపాదమును నదేవిధముగా వంచి ప్రక్కగా తాను యొరగి చేతియందున్న పాదమును యట్లే వంచి పిఱుదులక్రిందుగా నింకొకచెయ్యి వీపు ననుసరించి భుజమును బట్టి స్త్రీపాదమును బట్టినచేతితో తొడయు బాదమును నణచి తాను గొంతుకూర్చుండి యొకమోకాలు వరుగుగా యుంచి రమించుభావ మును యర్ధాంగపీడితబంధ మనిరి. ఇది బాడబతురగులకు బ్రియము.

మ.చెలిజానుద్వయమున్ భుజాగ్రములచే జిక్కన్బిగన్ బట్టి యం
ఘ్రులమీఁద న్గటియుగ్మ ముంచుకొని వక్షోజద్వయిన్ రెండుచే
తులచే గట్టిగఁ బట్టి మో నధరమందు న్దంతము ల్నిల్పుచున్
గలయన్ జృంభకనామబంధ మని విఖ్యాతంబు లోకంబులన్.

తా.కాంతయొక్కకాళ్ళను తనభుజములయందు బెట్టుకొని మెడచే చిక్క బట్టి గొంతుకూర్చుండి తనయొక్కకాలివ్రేళ్ళ నాసతియొక్కపిఱ్ఱలను దాటి మొల కట్టువరకును బోవునట్లు జొనిపి

సళ్లు లేకుండునట్లు గట్టికా రెండుచేతులతో కుచ ములను బట్టుకొని దంతక్షతములను జేయుచు రమించుట జృంభకబంధ మందురు.

చ.చెలువుని ఫాలభాగమునఁ జేరిచి యొక్కపదాంబుజాతమున్
దలిమముమీఁద వేఱొకపదం బొగిఁజాఁచి పరుండిన న్మదం
బలరఁగ, దత్కుచద్వయమునైన భుజంబులనైనఁ బార్శ్వసీ
మలనయినన్ గరంబుల నమర్చి రమింపఁ బ్రాసరితం బగున్.

తా.సతి తనపాదమొకటి పురుషునియొక్క మొగమునం దుంచి రెండవ కాలును పానుపుపై జాచుకొని పండుకొనియుండ పురుషు డాసతియొక్క చన్నులనయినను భుజములనయినను ప్రక్కలనయినను బట్టుకొని రమించిన భావమును ప్రసారితబంధ మనిరి.

## 17 వేణువిదారిత, 18 శూలచిత బంధముల లక్షణములు

శ్లో.పరివర్తనతో బహుశః ప్రథితం కథితం భువి వేణువిదారితకమ్।
జంఘాగ్రమధో యదథోర్ధ్వగతం శిరసో యువతేర్యది శూలచితమ్॥

గీ.అతివపదమొక్కటి భుజంబునందు నిల్పి
శౌరి రెండవపదముపైఁ గూరుచుండి
మాటిమాటికి నీగతి మార్చి మార్చి
కలియ వేణువిదారితకం బటండ్రు.

తా.సతి తనయొక్కకాలు పురుషుని భుజంబునం దుంచి రెండవకాలు జాచుకొనియుండ నాకాలుమీద పురుషుడు కూర్చుండి కుచంబులను బట్టి మాటిమాటి కిని నాసతియొక్క కాళ్ళను మార్చుచు రమించుభావమును వేణువిదారితబంధ మందురు.

గీ. ఒక్కపాదంబు శిరముపై నుంచి యొకటి
భుజముపై నుంచి క్రీడింపఁ బుడమి నదియు
శూలచితబంధ మనఁగను సొంపు మీఱె
ననుచు వచియించె మొదల వాత్స్యాయనుండు.

తా.సతి కాలొకటి పురుషుడు నెత్తిపయి బెట్టుకొని రెండవకాలును భుజ ముపయి నుంచుకొని రమించుభావమును శూలచితబంధమని వాత్స్యాయను డనెను.

## 19 మార్కటక, 20 ప్రేంఖాయత బంధముల లక్షణములు

శ్లో.యది కుంచితపాదయుగం యువతే
ర్నరనాభిముదంచతి మార్కటకమ్।
ప్రేంఖా భవతి ప్రసభం యువతిః
ప్రమదా స్వపదా యది తంచ తదా॥

మ.తెలియన్బానుపుమీఁదఁ జంద్రముఖి ప్రోదిన్వ్రాలి పాదాంబుజం
బుల నడ్డంబుగ నాథునాభిపయి సొంపు ల్మీఱఁగా నుంచినన్
జలజాతాక్షుఁడు వానిపై నదిమి మించ న్దత్కటి న్బట్టి తా
నలువై కూడి రమింప మార్కటకబంధం బయ్యెఁ జిత్రంబుగన్.

తా.కాంత సెజ్జపయి పవళించి పాదముల నడ్డముగా వంచి పురుషునియొక్క బొడ్డునం దుంచగా కృష్ణమూర్తి నాభితో దానిపాదముల నదిమి దానిపిఱుదులను తనచేతులతో బట్టుకొని రమించినభావమును మార్కటకబంధ మందురు.

మ.చిగురుంబోణి పదద్వయాతరమునన్ శ్రీకృష్ణుమధ్యం బొగి
న్దగఁగా నిల్పి కరద్వయి న్గరము లంట న్బట్టి యుయ్యాల లూ
గు గతి న్బల్మరు చండవేగ మమరన్ గూడ న్మురారాతి చె
ల్వుఁగ ప్రేంఖాయతబంధ మండ్రు జనము ల్పావిల్తుశాస్త్రంబునన్.

తా.సతి తనయొక్కపాదములను కృష్ణునియొక్క మధ్యమమునం దుంచి తనచేతులతో పురుషునియొక్క చేతులను బట్టుకొని యుయ్యల యూగునటుల చండవేగమున రమించుటయే ప్రేంఖాయతబంధ మనిరి. ఇది హరిణీవృషభులకు బ్రియము.

## 21 పద్మాసన, 22 అర్ధపద్మాసన బంధముల లక్షణములు

శ్లో.జంఘాయుగళస్య విసర్యయతః పద్మాసనముక్తమిదం యువతేః|
జంఘోకవిపర్యయతస్తు భవేదిదమేవ తదర్ధపదోపపదమ్||

చ.సరసిజనేత్ర దక్షిణభుజంబున దక్షిణపాద ముంచి యా
చరణముమీఁద నడ్డముగ జాఁచిన వామపదాంబుజాత మ
చ్చెరువుగ వామబాహువునఁ జేర్చి పరుండిన లేమఁ గూడినన్
హరువుగఁ బంకజాసనము నా నుతిగాంచినబంధమై చనున్.

తా.కాంత పురుషునియొక్క కుడిభుజమందు తనయొక్క కుడికా లుంచి యాకాలుపై యడ్డముగా జాచిన యెడమకాలు పురుషునియెడమభుజమునం దుంచి పండుకొనియుండగా పురుషు డామెయొక్క కాళ్ళు నడ్డముగా మడుప నియోగించి సం దున్నంతవరకు తాను ముందునకు జేరి యోనియందు దండ ముంచి ఆపెయొక్క రెండుతొడలసందునుండి తనచేతులను దూర్చి చండ్లను బట్టి రతిసేయుచుండ నాసతి తనకాళ్ళు జరిగిపోకుండ పురుషునిభుజములయం దుంచినపాదములవ్రేళ్ళతో పురుషునిమెడను బట్టియుండుభావమే పద్మాసనం బగును. ఇది బాడబాశశులకు బ్రియము.

గీ.పతిభుజముమీఁద నొక్కపదంబు సాచి
దానిపై నడ్డముగను బదంబుఁ దాల్చి
పడఁతి పవళింప శ్రీహరి పైకొనంగ
నర్ధపద్మాసనం బన నమరియుండు.

తా.లేమ పురుషునియొక్క కుడిభుజమందు కుడికా లుంచి రెండవకాలు నాకాలుపై నడ్డముగా యుంచి పండుకొనియుండగా కృష్ణమూర్తి పైవిధముగా ఆపెతొడలసందునుండి తనచేతులను పోనిచ్చి చండ్లను బట్టుకొని రమించుభావ మును యర్ధపద్మాసన మనిరి.

## 23 బంధురిత, 24 నాగపాశ బంధముల లక్షణములు

శ్లో.నిజజానుయుగాన్తరనిర్గమితౌ స్వభుజౌ పతికంఠమసౌనయతే
రమణీ రమణోఽపి తమేవ భుజద్వితయేన చ బన్ధురితం కురుతే|
తత్కూర్పరమధ్యగతేవ తదాపి ఫణిపాశమిదం మునయో జగదుః||

మ.సతి దా సాధనఁ జేసినట్టి వగ హెచ్చన్ మోహ ముప్పొంగ సం
గతి మోచేతుల రెండుసందులను మోకాళ్ళ న్దగన్ గ్రుచ్చి హ
స్తతలంబు ల్వడిఁ గూర్చిపట్టి మెడక్రింద న్జేర్చి పన్నుండఁ గా
జతురుం డప్పుడు కూడ బంధురితసంజ్ఞం బైన బంధం బగున్.

తా.సతి తనయొక్క మోచేతులరెంటిసందులలో తనమోకాళ్ళను గూర్చు కొని చేతులు రెండును గూర్చి పట్టుకొని తనకంఠముక్రిందగా నుంచుకొని పండు కొనియుండగా పురుషుడు

రమించుభావమును బంధురితబంధ మనిరి. ఇది కరిణీ శశులకు బ్రియము.

మ.చెలి మోకాళ్ళను బైకిఁ జాచుకొని మోచేతు ల్తగన్మధ్యఁ జే
తులు రెండొక్కటిగాఁగఁ గూర్చి మెడక్రింద న్జేర్చి పన్నుండ నె
చ్చెలి ముంజేతులు రెండు శౌరి తనమోచేతు ల్జత న్గూర్చి చె
న్నలర న్గూడీన నాగపాశ మనుబంధం బయ్యెఁ జిత్రంబుగన్.

తా.కాంత తనయొక్కమోకాళ్ళను మోచేతిసందులలో గ్రుచ్చి పైకిజాచు కొని చేతులురెండునూ యొకటిగా గూర్చిపట్టి మెడక్రిందుగా జేర్చి పండుకొని యుండ పురుషు డామెయొక్క ముంజేతులు రెండును తనమోచేతులసందులయందు గూర్చి రమించుభావమును నాగపాశబంధ మనిరి.

## 25 సంయమనబంధ లక్షణము

శ్లో.అంగుష్ఠసమర్పితపాణిభృతో
జంఘాయుగళం యువతేః పురుషః|
నిజకూర్పరయోర్నిదధాతి భుజౌ
తత్కంఠ ఇదంకిల సంయమనమ్||

ఉ.ముద్దులగుమ్మ పానుపున ముందుగఁ దాఁ బవళించి పాదముల్
ముద్దుగఁ జేతులం దిడిన మోదమునన్ హరి రెండుచేతు లా
ముద్దియజానుసందుల సముజ్వలవైఖరి గ్రుచ్చి కంఠమున్
బద్దుగఁ గౌగిలింప నది బంధము సంయమనాఖ్యమై తగున్.

తా.మగువ తనయొక్కకాళ్ళను మితముగా ముడిచి కాళ్ళవెలుపలనుంచి చేతులను రానిచ్చి పాదములను బట్టుకొని పండుకొనియుండ పురుషుడు గొంతు కూర్చుండి తనమోకాళ్ళతో దానితొడల నదిమి తనచేతులను తొడలక్రిందుగా చంకలసందులలోనుండి పోనిచ్చి మెడక్రింద జేర్చి రతిసల్పుభావమును సంయమన బంధ మనిరి. ఇది కరిణీశశులకు బ్రియము.

## 26 కూర్మ, 27 పరివర్తిత, 28 నిపీడనబంధముల లక్షణములు

శ్లో.భుజయోర్భుజమాననమాననతో జంఘామభి జంఘమసౌ రమతే|
విన్యస్య నరో యది కౌర్మమిదం పరిపతిన్ తమూధన్వాగతోరు యుగమ్|
యదిపీడితమూరుయుగం తు భవేద్వనితోరువరాంఘ్రినిపీడినతః||

చ.మొగము మొగమ్ముమీఁద భుజము ల్బుజయుగ్మముమీఁద జంఘికా
యుగళము జంఘలందు నిడి యొక్కటిగాఁ దగగూర్చి యుంచి య
మ్మగువపయి న్మురారి గరిమంబునఁ బైకొనఁ గూర్మబంధమై
నెగడు ధరిత్రిసాధనకు నేరనివా రొనరింతు రింతయున్.

తా.పురుషుడు సతిని పైకొని ముఖము ముఖముమీదను భుజములను భుజము లమీదను పిక్కలను పిక్కలమీదను యొక్కటిగా చేర్చి పండుకొని రమించుభావ మును కూర్మబంధ మనిరి. ఇది బంధములం జేయుటను అశక్తులగువా రుపయో గింతురు.

ఆ.మొగము మొగముఁ జేర్చి భుజములు బిగియించి
చాన రెండుతొడలు సాఁచి శౌరి
నడుము బిగియ నదిమి ముడివేయఁ బరివర్తి
తాఖ్యబంధమై నయంబు గాంచు.

తా.పురుషుడు సతిముఖముతో ముఖము జేర్చి భుజములను పట్టుకొనియుండ ఆపె తనరెండుతొడలను జాచి పురుషునియొక్కనడుమును బిగించి మెలివేయగా రమించుభావమును పరివర్తితబంధ మనబడును.

గీ.ముదిత యూరువు ల్నిజపాదములును బార్శ్వ
ముల నొదుగఁ ద్రోసి యందుపై మోవ నిల్పి
కూడెనేనియు నిదియ నిపీడనాఖ్య
బంధమగు గామశాస్త్రప్రపంచసరణి.

తా.కాంతయొక్కతొడలు తనమోకాళ్ళసందుపార్శ్వములయందు యొదు గునటుల ద్రోసి పురుషుడు తనపాదములయం దూనికనిల్పి రమించుభావము నిపీడ నబంధ మగును.

## 29 ఉపవీతబంధలక్షణము

శ్లో.ఏకం యువత్యాహృదయం స్వపాదౌ తదార్పితం తల్పగతం తదన్యమ్।
ప్రౌఢాంగనా వల్లభ ఏష బన్ధః ఖ్యాతః పృథివ్యాముపవీతకాఖ్యాః॥

(ఇతి పంచసాయకః)

గీ.అతివతొడలమధ్యగఁ జేరు యతనుతంద్రి
యాపెహృదయ మందొకపాద మమర నిల్పి
వేఱొకపదంబు ధర నూని వేడు కలర
నమితరతిఁ జేయ నుపవీత మనిరి మునులు.

తా.పాన్పుపై పవళించియున్న కాంత తొడలసందునఁ బురుషుండు చేరి యాపెవక్షస్థలమున తనకాలొకటి యుంచి రెండవకాలును పాన్పుపై నుంచి రతి సల్పుభావము ఉపవీతబంధ మనిరి.

## 30 సమపాదబంధ లక్షణము

శ్లో.నిధాయ పాదౌ రమణాంసయోశ్చేదుత్తనసుప్తా రమతే పురన్ధ్రీ।
ప్రతిప్రబన్ధం సమపాదసంజ్ఞా ప్రోచుస్తదా భోగవిధానదక్షః॥

(ఇతి అనంగరంగకః)

క.తరుణి తనపాదయుగళము
వరునూరువులందు నిల్పి పవళింపంగా
నురమురముఁ జేర్చి పైకొనఁ
బరువడి సమపాదనామబంధం బయ్యెన్.

తా.కాంత తనయొక్క రెండుకాళ్ళను కృష్ణునియొక్క తొడలయం దుంచి పాన్పుపయి పండుకొనియుండ కృష్ణమూర్తి యాసతియొక్క ఱొమ్ముతో తన తనఱొమ్మును జేర్చి పైకొని రమించుభావము సమపాదబంధ మందురు.

## 31 త్రివిక్రమబంధ లక్షణము

శ్లో.స్త్రియోంఽఘ్రిమేకం వినిధాయ భూమా
వన్యం స్వమాలౌ నిజపాదయుగ్మం।
పృధ్వ్యాం సమాధాయ రమేత భర్తా
త్రైవిక్రమాఖ్యం కరణం తధా స్యాత్॥

(ఇతి అనంగరంగకః)

గీ.సతిపదం బొకటి ధరిత్రి సాచి యొక్క
పదము బురుషుఁడు తనతలపైన నిల్పి
రెండుచేతులు భువి నానియుండఁ గూడ
నిది త్రివిక్రమకరణమై యింపుఁ జెందు.

తా.స్త్రీ తనకాలొకటి శయ్యయందు సాచి రెండవకాలు పురుషునితలకు సమముగా సాచి రెండుచేతులతో భూమి నానుకొని యుబికియుండగా పురుషు డాకాంతను రమించినభావము త్రివిక్రమబంధ మనంబడును.

## 32 వ్యోమపదబంధ లక్షణము

శ్లో.తల్పప్రసుప్తా నిజపాదయుగ్మమూర్ధ్వం విధత్తే రమణీ కరాభ్యామ్।
స్తనౌ గృహీత్వాఽథ భజేత కాన్తో బన్ధస్తదా వ్యోమపదాఖ్య ఉక్తః॥

(ఇతి అనంగరంగకః)

గీ.కాంత తనరెండుపదములఁ గాంతుశిరము
నందునను నిల్పి పవళింప నతఁడు ప్రేమఁ
గుచయుగము రెండుచేతులఁ గూర్చిపట్టి
కలియ నిది వ్యోమపదనామకరణ మయ్యె.

తా.సతి తనయొక్క రెండుకాళ్ళను పురుషునితలమీద యుంచి పండుకొని యుండగా పురుషు డాసతియొక్క కుచములను బట్టి రమించుభావమును వ్యోమ పదబంధ మనిరి.

## 33 స్మరచక్రబంధ లక్షణము

శ్లో.కాన్తోరుయుగ్మాన్తరగః స్వహస్తౌ నిధాయ భూమౌ రమతే పతిశ్చేత్।
బన్ధస్తదోక్తః స్మరచక్రనామా ప్రేష్ఠః సదా కామిజనస్య లోకే॥

(ఇతి అనంగరంగకః)

గీ.నలినముఖి రెండుపదముల నడుమ నిలిచి
విభుఁడు చేతుల రెండు పృథ్వీతలంబు
నానుకొని క్రీడ యొనరించెనేని నదియుఁ
దనరు స్మరచక్రనామ బంధంబు జగతి.

తా.సతియొక్క రెండుతొడలనడుమను బురుషు డుండి చేతులు రెండును భూమియం దానించి రమించుభావము స్మరచక్రబంధమని దెలియందగినది.

## 34 అవధారితబంధలక్షణము

శ్లో.నారీ స్వపాదౌ దయితస్య పక్షఃస్థితౌ సమాలింగ్య కరద్వయేన।
కించిన్నతోరు రమతే తదాసౌ ప్రోక్తో మునీంద్రైరవదారితాఖ్యా॥

(ఇతి అనంగరంగకః)

గీ.తామరసనేత్ర తనదుపాదములు రెండు
నధిపునుదరంబుపైఁ జేర్చి యాపెయూరు

వులను వంచి భుజద్వయి నొకట కౌఁగ
లింప నవదారితాఖ్యమై పెంపుఁ జెందు.

తా.సతి తనయొక్కపాదములరెంటిని పురుషునియొక్క కడుపుపయి నుంచి యాపె తనతొడలను వంచి పురుషుని భుజములను రెంటిని తనభుజములతో కలిపిపట్టుకొనియుండ పురుషు డాసతిని రమించుభావమును అవదారితబంధ మనిరి.

## 35 సౌమ్యబంధ లక్షణము

శ్లో.ఉత్తానితోరుద్వయమధ్యగామీ దృఢం సమాలింగ్య భజేత యత్ర|
కాన్తాం విలాసిప్రియ ఏష బంధః సౌమ్యాఖ్య ఉక్తః కవిభిః పురాణైః

(ఇతి అనంగరంగకః)

గీ.కాంత తనయూరువులు రెండు గగనమునకు
నిలిపి వళింప విభుఁడు చేతులను రెండు
నూరువులమధ్యమం దుంచి తారుకొన్న
సౌమ్యకరణంబునా నగు సంజ్ఞ లలరు.

తా.స్త్రీ తనతొడలు రెండును మీదికెత్తుకొని పండుకొనియుండగా పురు షుడు సతియొక్కతొడలమధ్యగా తనజేతులను బోనిచ్చి కుచంబులను బట్టి రమించుభావము సౌమ్యబంధ మగును.

## 36 జృంభితబంధ లక్షణము

శ్లో.ఊరుద్వయం వక్త్రముదంచితంచ కృత్వాంబుజాక్షీ భజతే పతించేత్|
ఆనందకర్తా తరుణీజనానాం బన్ధోఽయముక్తః కిల జృంభితాఖ్యః||

(ఇతి అనంగరంగకః)

ఆ.చిగురుబోఁడి యూరుయుగళంబు తనఫాల
భాగమందుఁ జేర్చి పట్టియుండ
బ్రియుఁడు దానిగూడి పిఱుఁదులం బట్టఁగ
జృంభితం బనంగఁ జెలువు మీఱె.

తా.స్త్రీ తనరెండుతొడలను ముఖముదగ్గఱకు వచ్చునటుల చేతులతో చేర్చి పట్టుకొనియుండ పురుషుడు దానిపిఱుందులను బట్టుకొని రమించుభావము జృంభితబంధ మనంబడును.

## 37 నౌకాబంధ లక్షణము

గీ.ఒకరొకరిప్రక్కసందుల నొక్కరొకరి
పాదయుగళంబు గీలించి పవ్వళించి
యొకరొకరిహస్తములఁ బట్టి యొప్పుమీఱఁ
గూడ నౌకాఖ్యబంధమై రూఢిఁ గాంచు.

తా.పురుషునియొక్క నడుము ప్రక్కసందులో స్త్రీయొక్కపాదము లును సతియొక్కప్రక్కసందులలో పురుషునియొక్కపాదముల నుంచి పురుషుని హస్తముల సతియు సతిహస్తములను బురుషుడును బట్టుకొని రమించుభావము నౌకా బంధ మనిరి.

## 38 ధనుర్బంధ లక్షణము

చ.తరుణియు మొగ్గవ్రాలిన విధంబున నుండి కరద్వయంబునన్
జరణము లానియుండ సరస న్జఘనంబునఁ దత్కటిద్వయిన్
హరువుగఁ గూర్చి మధ్యము కరాబ్జముల న్బిగఁబట్టి కూడినన్
ధరపయిఁ జాపబంధమును నామము గాంచు మహాద్భుతంబుగన్.

తా.సతి పాన్పుపయి బోరగిల పండుకొని మ్రొగ్గ వ్రాలినటుల తనరెండు చేతులతో పాదములు పట్టుకొనియుండ బురుషుడు తనమొలకు సమముగా నాసతి యొక్కమొల నుంచుకొని సతినడుమును తనరెండుచేతులతో గట్టిగా పట్టుకొని రమించుభావము ధనుర్బంధ మనిరి.

## 39 కరపాదబంధ లక్షణము

ఆ.ఉవిద బారసాచి యూరువు లాగతిఁ
బొడవు సాచి కావ బొటనవ్రేళ్ళం
బట్టి పాన్పుపైని బవళింపఁ గరపాద
నామబంధ మయ్యె సాముపలన.

తా.సతి తనయొక్కచేతులను బారసాచుకొని తనయొక్కతొడలను గూడ బారసాచి కాలిబొటనవ్రేళ్ళను చేతివ్రేళ్ళతో బట్టుకొనియుండగా పురుషుడు రమించుభావము కరపాదబంధ మనిరి.

## 40 సాచీముఖబంధ లక్షణము

క.పదములు తిరుగఁ బిరుందులఁ
గదియించి శిరంబు రెండుకరములు శయ్యన్
గదియించి యున్న తరుణిం
గదిసిన సాచీముఖంబుగా నుతి కెక్కున్.

తా.సతి తనయొక్కపాదములను ద్రిప్పి పిఱుదులక్రింద నుంచుకొని తలయు చేతులును పరుపుపయి యుంచి పండుకొనియుండగా పురుషుడు రమించుభావము సాచీముఖబంధ మనిరి.

## 41 అర్ధచంద్రబంధ లక్షణము

ఆ.ఊరుయుగము మింట నున్నతంబుగ సాచి
కరయుగంబుచేతఁ గటియుగంబుఁ
బట్టి మీఁది కెత్తి పవళించుచెలిఁ గూడ
నర్ధచంద్రబంధ మనఁగ నొప్పు.

తా.సతి తనయొక్కతొడలను పొడవుగా మీదికెత్తి చేతులతో పిఱు దులను బట్టుకొని మీదికెత్తి పండుకొనియుండ పురుషుడు రమించుభావము అర్ధ చంద్రబంధ మనిరి.

## 42 ఉపాంగబంధ లక్షణము

ఉ.నారివరాంగమందు మదనధ్వజ ముంచి బిగించి యూరువుల్
చేరిచి చక్కఁగా శయనసీమఁ బరుండిన దానిమీఁదుగా
శౌరియుఁ బవ్వళించి నిజజానువుజానువు ఱొమ్ముఱొమ్మునన్
జేరిచి మోముమోముపయిఁ జేర్చి రమింప నుపాంగకం బగున్.

తా.తనయొక్కయోనిలో పురుషునిదండ ముంచుకొని రెండుతొడలను దగ్గరగా జేర్చి బిగించి

పండుకొనియుండిన స్త్రీని పురుషుడు పైకొని సమముగా బండుకొని ఆస్త్రీయొక్క పిక్కలమీద పిక్కలను బొమ్మమీద బొమ్మను ముఖముమీద ముఖము నుంచి రమించుభావము ఉపాంగబంధమని తెలియందగినది.

శ్లో.ఉత్తానరతాని గతాని వదామ్యథ తిర్యగహంసురతద్వితయమ్|
మధ్యేవనితోరు నరోరుగతౌ కథితో మునిభిస్తు సముద్గ ఇతి||

వ.ఈబంధములు నలువదిరెండును ఉత్తానబంధ భేదములని తెలియందగినది. ఇఁక పువ్వుఁబోఁడి ప్రక్కవాటుగా నెడమపార్శ్వంబుగానైన గుడిపార్శ్వంబుగా నైనఁ బవళించియుండఁ బురుషుం డభిముఖముగాఁ బవ్వళించి పట్టు బంధములగు తిర్యక్కరణంబులను రెండవవిధమైన బంధములం దెల్పెద.

## 43 సముద్గకబంధ లక్షణము

చ.కమలదళాక్షి తా నభిముఖంబుగఁ బార్శ్వముగాఁగ శయ్యపై
సమముగఁ బవ్వళింప హరి సంతసమందుచుఁ గౌఁగలించి చి
త్రముగఁ దదూరుమధ్యమున దాను నిజోరువు లుంచి కాంతయూ
రములను బట్టి కూడ గరణంబు సముద్గకనామమై తగున్.

తా.సతి తనకెదురుగా బ్రక్కవాటుగా బాన్పుపై సమముగా పండుకొని యుండ కృష్ణమూర్తి సంతోషముతో గౌఁగలించి యాసతియొక్క తొడలసందున తనతొడలను జొనిపి యాసతియొక్కకాళ్ళను బట్టుకొని రమించుభావము సముద్గక బంధ మగును.

## 44 పరివర్తనబంధ లక్షణము

శ్లో.అవిభజ్య సముద్గకయన్త్రమిదం
యువతిర్యది వా పురుషో భజతే|
పరివృత్తమితి స్ఫుటమాభ్యసనాల్లఘు
పూర్వతనోః పరివర్తనకమ్||

క.జగతి సముద్గకనామం
బగు కరణమవలెఁ బురుషుని యంకద్వయ మ
ధ్యగయై తదూరువులపై
వగగా నూరువుల నునుపఁ బరివర్త మగున్.

తా.సతి మునుపు జెప్పియున్న సముద్గకబంధమువలెనె పురుషుని తొడల నడుమ నున్నదై యతనితొడలలో తనతొడల నునిచి రమించుభావము సం వర్తనబంధమని తెలియదగినది.

## 45 సమాంగకబంధ లక్షణము

చ.ఒక రొక రూరుభాగముల నొద్దికతోఁ దొడ లుంచి గట్టిగా
నొక రొక రాభిముఖ్యముగ నుండియుఁ గౌఁగిట గ్రుచ్చిపట్టి తా
మొక రొక రూరుమధ్యముల నూరువుఁ జొన్పి రమింపఁగా సమాం
గకమను బంధ మయ్యె హిమకాలములం దిది యోగ్యమై తగున్.

తా.సతీపతులు యొకరొకరి కెదురై తల లొద్దికగా నుంచి కౌగలించుకొని యొకరితొడలనడుమ యొకరితొడల నుంచి రమించుభావము సమాంగకబంధ మ గును. ఈబంధము చలికాలమం దుపయోగింప శ్రేయస్కరము.

## 46 అభిత్రికబంధ లక్షణము

చ.పొలయలుక న్లతాంగి తనమోము నొసంగక పార్శ్వభాగసం
వలిలతముగాఁ బరుండ బహువారమ్మృదూక్తుల సంతరింపుచున్
జెలువుఁడు వెన్కభాగమునఁ జిన్నెలఁ జూపుచుఁ బల్మిఁ గూడినన్
జెలఁగు నభిత్రికం బనఁగఁ జెల్వగుబంధము శాస్త్రవైఖరిన్.

తా.సతి పురుషునిపై ప్రణయకోపముచే ముఖమివ్వక వెనుదిరిగి ప్రక్క వాటుగా బండుకొనియున్నకాంతను మంచిమాటలచేత కుస్తరింపుచు నాపెతొడల సందుగా తనతొడలను జొనిపి వెనుకదిక్కునుండి రమించుభావము అభిత్రిక బంధ మనబడును.

## 47 నాగబంధ లక్షణము

శ్లో.పార్శ్వస్థితాయాః మృగశకామకాక్ష్యాః పృష్ఠావలంబీ రమణః ప్రసుప్తః|
లింగస్మరాగారనివేశయోగాద్ ఇహోపదిష్టః ఖలు నాగబంధః||

గీ.బోరగిల్లగఁ బండిన పొలఁతివీపు
తనదువక్షంబున న్హత్తి వనజభవుఁడు
అతివ యూరులమధ్యగా నతనుగృహము
నాటునటుల రతి యొనర్ప నాగ మగును.

తా.పొలయల్కచే వెనుదిరిగి ప్రక్కగా పరుండియుండిన కాంతను పురుషుడు మంచిమాటలచే కుస్తరించుచు యాపెవీపును కౌగలించుకొని యాపె తొడలసందునుంచి యోనిలోనికి తనశిశ్నమును బ్రవేశింపఁజేసి రతిసల్పినభావమే నాగబంధ మనిరి.

## 48 సంపుటబంధ లక్షణము

శ్లో.పార్శ్వప్రసుప్తా ప్రమదోపరిస్థః కాన్తాం సమాలింగ్య రతిం కరోతి|
యత్ర ప్రదిష్టో మునిభిః పురాణై ర్బన్ధస్తదా సంపుటనామధేయః||

(ఇతి అనంగరంగః)

మ.చెలి పార్శ్వంబుగఁ బవ్వళింపఁ గుదురై చెల్వుండు తాఁదత్తరం
బొలయ న్దానికడ న్బరుండి యొకకాలూర్ధ్వంబుగా జాను సం
ధులమీఁద న్బటియించి తత్కటితటి న్మూల్కొన్న మోహంబు రం
జిలఁ బాణిద్వయిఁ బట్టి సంపుటితమై చెల్వొందు నిర్ధారుణిన్.

తా.సతి ప్రక్కవాటుగా పండుకొనియుండ పురుషు డాసతి కెదురై ప్రక్కవాటుగా బవళించి సతియొక్క పైకాలును పొడుగుగా తనపిక్కలపై నుం చుకొని సతియొక్కపిరుదులను బట్టుకొని రమించుభావము సంపుటిత బంధ మన బడును.

## 49 వేణుదారణబంధ లక్షణము

ఆ.పురుషు మూఁపుమీఁద బొందించి యొకకాలు
కాళ్ళక్రింద నొక్కకాలుఁ జాచి
నప్పుడపుడ గదియ నదియును వీడ్వడఁ
దరుణిఁ గూడ వేణుదారణంబు.

తా.సతి పురుషుని వీపుమీదుగా నొకకాలును జాచి యతనికాళ్ళ క్రిందుగా నొకకాలును జాచి రెండుకాళ్ళను పెనవేసియుండగా పురుషుడు మాటిమాటికి యాపెకాళ్ళు వీడుచుండ

రతిసేయుభావమును వేణుదారణబంధ మనిరి.

## 50 కర్కటబంధ లక్షణము

శ్లో.యద్యంగనాకుంచితపాదయుగ్మం స్వనాభిదేశే పరికల్ప్యభర్తా|
రతిం ప్రకుర్యా దితి కర్కటాఖ్యం తదా మునీంద్రైః కరణం ప్రదిష్టమ్||

(ఇతి అనంగరంగః)

చ.ఎదురెదురై సతీపతు లహీనముదంబునఁ బవ్వళింప నా
సుదతి పదద్వయం బురము సోఁకఁగ నిల్పి కటీతటి న్ముదం
బొదవఁగఁ గౌఁగలింప నలయుగ్మలినై జగళంబు కౌఁగిటన్
గదియ బిగించి కూడునది ఖ్యాత మగు న్ధరఁ గర్కటాఖ్యమై.

తా.స్త్రీపురుషులు సంతసముతో నొకరికొక రెదురుగా పండుకొని స్త్రీ యొక్క రెండుకాళ్ళను తనఱొమ్మునకు తగులునట్లుగా యుంచి తనపిఱుదులను స్త్రీ పట్టుకొనియుండ పురుషుడు విల్లురీతిగా వంగి సతియొక్కకంఠమును కౌగ లించి రమించుభావము కర్కటబంధ మగును.

## 51 మానితబంధ లక్షణము

చ.సతియొకవంక వాటముగ శయ్యపయిం బవళించి యుండగా
నతివ నిజోరుమధ్యమున నడ్డముగాఁ బవళించి తత్పదం
బొతికిలఁ బెట్టి యొక్కటి మఱొక్కటి మేనిపయి న్ఘటించి సం
మ్మతి రతిఁ జేయఁ జెల్వగను మానితబంధమగు న్వసుంధరన్.

తా.స్త్రీ ప్రక్కవాటుగా పానుపుపై పండుకొనియుండ పురుషుం డెదు రుగా పండుకొని తనతొడలు నాస్త్రీయొక్క తొడలనడుమ దూర్చి నాస్త్రీకా లొకటి దనదేహముపై వైచుకొని రెండవకాలును తనకాళ్ళతో వెనుకకు త్రోచి పట్టి విల్లంబురీతిగా స్త్రీని వెనుకకు వంచి రమించుభావము మానితబంధ మనబడును.

వ.పైన చెప్పంబడిన తొమ్మిదిబంధములును దిర్యక్కరణములని తెలియందగినది ఇంక నంగనామణి కూర్చుండియుండఁ బురుషుండు పైకొని పట్టు బంధంబులగు స్థితకరణంబులను మూడవవిధమైన బంధములను దెల్పెద—

## 52 యుగ్మపదబంధ లక్షణము

శ్లో.స్థితమాసితసున్దరి పాదయుగం యది కుంచితమేకత ఏవ భవేత్|
లఘుతిర్యగథో పురుషోఽపి తథా మిలతీతి మతం కిల యుగ్మపదమ్||

చ.ఒకపద మోరగా ముడిచి యొక్కటి చాఁచి లతాంగి శయ్యపై
నొకట వసింపఁ దత్పదము నొయ్యనఁ జాచిన దానిపై నిజాం
ఘ్రిక మటుచాచి కుంచినది క్రిందుగఁ దా ముడుచు న్గవుంగిటన్
సకలవిలాసము ల్దెలియ సంగతిగై యుగపాద మై తగున్.

తా.సతి యొకపాదమును ముడుచుకొని రెండవపాదమును జాచుకొని పాన్పుపై కూర్చుండియుండ పురుషు డాసతి జాపియుంచినకాలుక్రిందుగా తన కాలును జాపి రెండవకాలును సతి ముడిచియుంచిన కాలుక్రిందిగా తాను ముడుచు కొని సతి కెదురుగా కూర్చుని కౌగలించి రమించుభావము యుగ్మపదబంధ మనబడును.

## 53 విమర్దిత, 54 మర్కట బంధముల లక్షణములు

శ్లో.యదిసున్దరికూర్పరమధ్యగతః స్వకటిం భ్రమయన్పురుషోరమతే|
భవతీహ విమర్దతకం తదిదం కిల సమ్ముఖసంగతిమర్కటకమ్||

మ.చెలి కూర్చుండఁగఁ గౌఁగిట న్నిలిచి పార్శ్వీభూతదేహంబుతో
చెలువుం డున్న మితాంగుఁడై కటితటిన్ శీఘ్రంబుగాఁ ద్రిప్పుచున్
బలుమారు న్గళలంటుచున్ గలయుచోఁ బ్రౌఢాంగనాకల్పితం
బలరున్ ధాత్రి విమిర్దితాఖ్య కరణం బత్యంతసౌఖ్యాఢ్యమై.

తా.స్త్రీ పురుషునితొడయందు యోరగా మొగము పెట్టి కూర్చుండ పురుషు డాసతిని గౌఁగలించుకొని తాను కొంత వెనుకకు వ్రాలి యోనియందు లింగమును బెట్టి సతియొక్క నడుమునుగాని కుచములనుగాని పిఱుదులనుగాని బట్టుకొని మిత శరీరముగలవాడై పిఱుదులను ద్రిప్పుచు కళ లంటుచు రమించుభావము విమర్దితబంధ మగును. ఈబంధము ప్రౌఢాంగన చేయందగినది.

క.పురుషుఁడు తన జఘనముపైఁ
దరుణి న్గూర్చుండఁబెట్టి తంత్రజ్ఞుండై
సురత మొనరింప సతి వె
న్దిరిగిన మర్కట మనంగఁ దెల్లం బయ్యేన్.

తా.పురుషుడు తనవడిలో తనకెదురుగా సతిని కూర్చుండబెట్టుకొని రతి చేయుచుండ సతి వెనుకకు మళ్ళునట్టు లొనరించి ముందువై పాసతి చూచుచుండ రతి సల్పుభావము మర్కటబంధ మనజెల్లును.

## 55 ఘట్టితబంధ లక్షణము

క.కరములు కరములచేతన్
వరుస న్బట్టుకొని రెండు పదతలములు త
చ్చరణతలమ్ముల నానఁగ
గరిమ న్గూర్చుండి కూడ ఘట్టిత మయ్యేన్.

తా.పురుషుడు తనచేతులతో స్త్రీయొక్క చేతులను బట్టుకొని తనపాద ములురెండును స్త్రీపాదములకు సమముగా జేర్చి కూర్చుండి రమించుభావము ఘట్టితబంధ మనబడును.

## 56 సమ్ముఖబంధ లక్షణము

శ్లో.తథా స్థితాయా నాయక్యాః పాదమేకం ప్రసారితమ్|
సకూర్పరేణ విష్టభ్య రమేత్తత్సమ్ముఖం రతమ్||

(ఇతి రతిరత్నప్రదీపికః)

ఆ.తరుణి పాదయుగముఁ దనభుజంబుల వైచి
నడుము బిగియఁబట్టి పడఁతికెదురు
గొంతుకూరుచుండి కూడిన సమ్ముఖ
కరణ మనఁగ వినుతిఁ గాంచు జగతి.

తా.స్త్రీయొక్క పాదములు రెండు తనభుజములమీద నుంచుకొని చేతు లతో దానినడుము బిగించి పట్టుకొని పురుషుడు స్త్రీకెదురుగా గొంతుకూర్చుండి రమించుభావము సమ్ముఖబంధ మనబడును.

## 57 ప్రస్ఫుటబంధ లక్షణము

ఆ. ఉవిద పాదయుగళ మురముపై నుంచుచుఁ
గదలకుండ బిగియఁ గౌఁగిలించి
జఘనసీమఁ దనదు చరణము లిడి కూడఁ
బ్రస్ఫుటాఖ్యమైన బంధ మయ్యె.

తా.కాంతయొక్కపాదములురెండును తనఱొమ్ముమీద నుంచుకొని పురు షుడు సతిచంకలసందుగా తనచేతులను బోనిచ్చి భుజములను బట్టి కదలకుండ రమిం చుభావము ప్రస్ఫుటబంధ మనఁబడును.

## 58 ఉద్గ్రీవబంధ లక్షణము

ఆ.గొంతు కూరుచుండి కోమలిచేతులు
వెనుకభాగమందు వేగ నిల్పి
యూర్ధ్వముఖము గాఁగ నుండఁగఁ గూడ ను
ద్గ్రీవబంధ మనఁగ దెలియఁబడియె.

తా.కాంత గొంతుకూర్చుండి చేతులు తనవెనుకదిక్కున పాన్పు నాను కొని ముఖము నాకాశమువైపునకు సాచియుండగా పురుషుడు రమించుభావము ఉద్గ్రీవబంధ మనిరి.

## 59 జఘనబంధ లక్షణము

ఆ.నారితొడలమీఁదఁ గూరుచుండి గళంబుఁ
గౌఁగిలించి మేను గదియఁజేర్చి
శౌరియుండఁ దరుణి జఘన మెత్తి రమింప
జఘన మనెడి సంజ్ఞ జగతి వెలయు.

తా.సతియొక్కతొడలపై పురుషుడు తనతొడల నుంచి యెదురుగా కూర్చుండి శరీరము దగ్గరకు చేర్చి కౌగలింప కాంత తనపిఱుదుల నెత్తుచు రమిం చుభావమే జఘనబంధ మనఁబడును.

శ్లో.ఉక్తమేతదిహ యుక్తసంగమే భేదజాతమథ చిత్రమోహనమ్|
స్తంభకుడ్యమథవా సమాశ్రితాదుర్ధ్వగౌ యది తదా చతుర్విధమ్||

వ.పైన చెప్పఁబడిన యెన్మిదిబంధములును స్థితకరణములని తెలియదగినది. ఇంక మగువ నిల్చియున్నపుడు స్తంభకుడ్యాదులానికగా నుంచి పురుషుండు పట్టు బంధములగు ఉద్ధితకరణములను నాల్గువవిధమైన బంధముల నెఱింగించెద—

## 60 జానుకూర్పరబంధ లక్షణము

శ్లో.కూర్పరేణ పరివేష్ట్య యోషితో జానుకంఠమవలంబ్యయత్పదా|
ఊర్ధ్వమున్మదవరస్య మేహనం యోజయేత్తదిహ జానుకూర్పరమ్||

మ.సతిభిత్తిస్థలిఁ జేరియుండ విభుఁ డచ్చంబైన ప్రేమంబున
న్మతియాహ్లాదము గూర్ప జానువులపై నైజాంఘ్రుల న్నిల్పి కం
ఠతలం బొయ్యనఁ గౌఁగలించి యటుకూడ న్గామశాస్త్రజ్ఞు లు
న్నతిగాఁ గూర్పరజానుకం బనఁ దగు న్నవ్యప్రమోదంబుగన్.

తా.కామిని గోడయొద్ద జేరి నిలిచియుండగా పురుషు డాస్త్రీయొక్క మోకాళ్ళకు దనమోకాళ్ళను దగిలించి యాపె కంఠమును గౌగలించి రతిసల్పు భావము జానుకూర్పరబంధ మనిరి.

## 61 హరివిక్రమ, 62 ద్వితలబంధముల లక్షణములు

శ్లో.యోషిదేకచరణే సముచ్ఛ్రితే జాయతేచ హరివిక్రమాహ్వయమ్|
భిత్తికప్రియకరస్య సున్దరీ పాదయోర్ద్వితలసంజ్ఞకం రతమ్||

ఆ.కంబ మొద్ద నిలిపి కామిని యొకపాద
మిల ఘటించి యొకటి యెత్తిపట్టి
యదిమి గళము కూడ హత్తి కౌఁగిటఁ జేర్చి
విటుఁడు గవయ సింహవిక్రమంబు.

తా.సతి స్తంభమునకు వీపు నానుకొని యొకకాలు భూమిమీద నుంచి మఱియొకకాలు చేతితో నెత్తిపట్టియుండగా పురుషు డాసతికంఠమును గౌఁగ లించి ప్రక్కవాటుగా యదిమి రమించుభావమును హరివిక్రమబంధ మనిరి. దీనినే సింహవిక్రమ మందురు.

మ.కళుకు న్బంగరుభిత్తిభాగముల నాకాంతుండు తాఁ జేరి ని
శ్చలభంగి న్గరయుగ్మమందు సరసీజాతాక్షి పాదద్వయి
న్నిలువంబట్టిన నైజకంఠము బిగ న్నిండారఁ గౌఁగిళ్ళఁ దొ
య్యలి గూర్పన్ ద్వితలాఖ్యబంధ మగు సాంద్రానందసంపాదియై.

తా.పురుషుడు స్తంభముయొద్ద నిలిచియుండి కాంతయొక్కపాదములను దనచేతులతో బట్టియుండగా నాసతి పురుషునికంఠమును గౌగలించుకొని రమిం చుభావమును ద్వితలబంధ మనిరి.

## 63 కీర్తిబంధ లక్షణము

శ్లో.కణ్ఠే భుజాభ్యా మవలంబ్య భర్తుః శ్రోణిం నిజోర్వోర్యుగళేన గాఢమ్|
సంవేష్ట్య కుర్యా ద్రతమంగనా చే దుక్తః కవీన్ద్రై రితి కీర్తిబంధః||

(ఇతి అనంగరంగః)

చ.కలికి విలాసభంగిఁ దనకంఠము గౌఁగిటఁ బట్టియుండఁగా
నల జఘనప్రదేశముల నాచెలి యూరువు నిల్పి నేర్పుగా
సలలితలాఘవం బమర సాంద్రవినీతలసీమలందుఁ బెం
పలరఁగ శౌరి గూడ నిది యార్యనుతం బగు కీర్తిబంధమౌ.

తా.కాంత శృంగారముగా పురుషునికంఠమును గౌగలించుకొని పురు షునిమొలయం దాపెతొడ నుంచి గోడ కొరగగా పురుషుడు రమించుభావము కీర్తిబంధ మనఁబడును.

## 64 పార్శ్వవేష్టిత, 65 ధృతబంధముల లక్షణములు

శ్లో.భిత్తిగస్య కరపంకజే స్థితా ప్రేయసో విధృతకంఠదోర్లతా|
ఊరుపాశపరివేష్టితప్రియశ్రోణిరంఘ్రితలతాడనాశ్రయా|
దోలతి శ్వసితి సీత్కృతాకులా యోషి దేవమవలంబితం మతమ్||

చ.సతి జఘనప్రదేశమునఁ జాతురి మీఱఁగఁ గూరుచుండి సం
స్తుతగతిఁ బార్శ్వభాగమున సొంపులు గుల్కఁగ రెండుచేతులు
న్నతముగఁ గంఠ మందముగన న్గదియించి కడంగి కూడిన
న్జతురిమఁ బార్శ్వవేష్టితము నా వచియింతురు దీని నెంతయున్.

తా.కాంత పురుషునియొక్క మొలయందు కూర్చుండి చేతులతో నతనికంఠ మును గౌగలించి

ప్రక్కలకు దిరుగుచూ రమించుచుండ పురుషు డొకస్తంభ మాని కగా నిలిచియుండుట పార్శ్వవేష్టిబంధ మగును.

ఆ.అబల జఘనదేశమందుఁ బాదము లుంచి
కరయుగమున గళముఁ గౌగలించి
డోల యూచినట్లు లీలగాఁ గూడినఁ
బరఁగు నది ధృతాఖ్యబంధ మంచు.

తా.కాంత గోడకు నానుకొనియుండ యాపెతొడలసందుగా పురుషుని కాళ్ళుంచి కంఠమును కౌగలించుకొని యుయ్యల యూచినట్లు రమించుభావము ధృతబంధ మనబడును.

## వ్యానకరణముల లక్షణము

శ్లో.వ్యానతం రతమిదం యది ప్రియ స్యాదధోముఖచతుష్పదాకృతిః|
తత్కటిం సమధిరుహ్య వల్లభః స్యాద్వృషాదిపశుసంస్థితిస్థితః||

చ.పొలతుఁక పాణిపాదములు భూమిపయి న్దగ నిల్పియుండఁగాఁ
జెలువుఁడు వెన్కభాగమునఁ జిన్నెలు చూసిన వ్యానతంబులౌ
నలఘుబహుప్రకారముల నార్యులు బల్కి రవెట్టివైన నే
నెలమిని గొన్ని బంధముల నే రచియింతు సచింత నెంతయున్.

తా.కోమలాంగి పాదములు, కరములు పానుపున నాని తిర్యగ్జంతువులరీతి వాలియున్నపుడు పురుషుడు వెనుకభాగమున నిలిచి పట్టుబంధములు వ్యానకర ణంబు లనఁబడును. ఈ వ్యానకరణములను పెద్ద లనేకవిధములుగా జెప్పిరి. అవి యెట్టివైనను నందు కొన్నిబంధములమాత్రమే తెల్పెదను.

## 66 నిపీడితబంధ లక్షణము

క.తరుణీమణి వెనుచక్కిన్
బిఱుఁదులు కరయుగముచేత బిగఁబట్టి రహిన్
వారి యానుచుఁ గ్రీడించిన
హరువమరు నిపీడితాఖ్యమను బంధ మగున్.

తా.కాంత తనయొక్క కాళ్ళు చేతులు నేల నానుకొని ముందుకు వంగి యుండగా పురుషుడు దానివెనుక చేరి పిఱుదులు పట్టుకొని రమించినభావమే నిపీడితబంధ మనబడును.

## 67 నిఘాతకబంధ లక్షణము

గీ.సాధనల నేర్పుఁ జూపుచు జలజనేత్ర
వెనుకభాగంబునకు నీడ్చి వేఱుగతులఁ
గదిసి రమియించిన నిఘాతకం బనంగఁ
గరణమగు శాస్త్రసరణి విఖ్యాతి మీఱ.

తా.స్త్రీ మునుపటివలెనే వంగియుండ దానిపాదములను తనవెనుక భాగమునకు లాగుకొని దానికాళ్ళమధ్య నిలిచి తొడలను బట్టుకొని రమించుభావ ము నిఘాతకబంధ మనబడును.

## 68 చటకవిలసితబంధ లక్షణము

క.తరుణీమణి తనపదములఁ
కరములఁ గూడంగఁ జేర్చి కడువంగినచో

మురవైరి నిలిచినిలిచియుఁ
బెరిమన్ రమియింపఁ జటకవిలసిత మయ్యెన్.

తా.సతి తనకాళ్ళతోకూడా చేతులు జేర్చుకొని వంగియుండగా పురు షుం డాసతివెనుకదిక్కున నిలిచి రమించుభావము చటకవిలసితబంధ మనిరి.

## 69 జుప్పబంధ లక్షణము

క.పడఁతి పిఱుందులపైఁ దన
కడు పానిచి చంద్రవదన కడుపునఁ గరముల్
గడుబిగియఁ గూర్చి కదలక
నడరన్ రమియింపఁ జుప్ప మనఁ జెలు వొందున్.

తా.సతి మునుపటివలె వంగియుండ యాపె పిరుదులపై తనకడుపు నానించి యాపె కడుపును కదలకుండా పురుషుడు తనచేతులతో బట్టి రమించు భావము జుప్పబంధ మనంబడును.

## 70 వరాహఘాతబంధ లక్షణము

క.వనితపిఱుందులఁ గృష్ణుఁడు
తనచేతులు బిగియఁబట్టి తద్దయువేగం
బొనరఁగఁ గ్రిందునఁ దాఁకులఁ
గనఁగూడ వరాహఘాతకం బనఁ బరఁగున్.

తా.వనిత మునుపటివలె వంగి పాదములను బట్టుకొనియుండగా పురుషు డా సతియొక్కపిఱుదులను తనచేతులతో గట్టిగా పట్టుకొని క్రిందుగా తాకులు తాకుచు రమించినది వరాహఘాతబంధ మనబడును.

## 71 వృషాభిఘాతబంధ లక్షణము

క.ఇరుపార్శ్వంబులఁ బదములు
పరిపరిగతి మార్చిమార్చి పైభాగమునన్
గుఱిగాఁ దాఁకులు దాఁకుచుఁ
గరము రమింపన్ వృషాభిఘాతక మయ్యెన్.

తా.సతి పూర్వమువలెనే యుండగా పురుషు డాసతిపదముల రెండువైపుల నుంచి తనపాదములను మార్చుచు గుఱిగా పైభాగమునకు తాకులు తాకుచు రమించుభావము వృషాభిఘాతబంధ మగును.

## 72 ధేనుకబంధ లక్షణము

శ్లో.న్యస్తహస్తయుగళా నిజే పదే యోషిదేతి కటిరూఢవల్లభా|
అగ్రతోయది శనైరథోముఖీ ధేనుకం వృషపదున్నతేప్రియే||

చ.చందనగంధి భూమిపయి సంగతిగాఁ గరపాదపద్మము
ల్పొందుపడంగ నిల్పి కనుబొమ్మలఁ జూపుచుఁ గాళ్ళసందులన్
గ్రిందుగఁ జూడ నాయకుఁడు కేవలము న్బయి నిల్పి చేతు లిం
పొందఁ దదీయహస్తముల నూని రమించిన ధేనుకం బగున్.

తా.సతి భూమిమీద తనకాళ్ళను చేతులను యాని వంగి తనకాళ్ళసందుగా వెనుకపార్శ్వమును జూచుచుండ పురుషు డాసతి వెనుక నిలిచి యాపెచేతులతో చేతులను జేర్చి వంగి

రమించినభావము ధేనుకబంధ మనబడును.

## 73 గజబంధ లక్షణము

శ్లో.అవనిగతస్తనమస్తకవదనా మౌన్నిత్యవస్త్విజం నేతా|
తిష్ఠేత్ కరేణ యోనిం పూర్వం విక్షోభయేద్రమేద్దైభమ్||

(ఇతి రతిరత్నప్రదీపికః)

చ.స్తనములు మోము బాహువులు ధారుణిపై దగఁజేర్చి యానుచు
న్వెనుకటిభాగ మూర్ధ్వముగ నిల్పి వధూమణి శ్రోణిదేశమం
దును వసియించి యొక్కకయితో మదనధ్వజ మూననిల్పుచు
న్దనియఁగఁ గూడ దంతికరణం బన నొప్పు విచిత్రవైఖరిన్.

తా.స్త్రీ తనయొక్కచన్నులును భుజములును ముఖమును భూమిమీద నానేటట్టుగా పండుకొని వెనుకభాగమును పొడవుగా యెత్తియుండగా పురుషు డాపె పిరుదులయొద్ద నిలిచి తనచేతితో శిశ్నమును యోనిలో దూరునట్లు నిలుపుచు రమించునది గజబంధ మనబడును.

## 74 మార్జాలబంధ లక్షణము

క.చేతులు కాళ్ళను జాపుచు
వాతెర నయనములు పూలపానుపునకునై
నాతిపిఱుం దిడ కూడిన
నాతత మార్జాలకరణ మనఁగాఁ బరఁగెన్.

తా.సతి వెనుకటివలె బోరగిల్ల పండుకొని కాళ్ళను జాపి పిఱులను కొంచె ము యెత్తగా నాపెపిఱులవద్ద పురుషుడు కూర్చుండి రమించుభావము మార్జాలబంధ మనబడును.

## 75 హరిణబంధ లక్షణము

శ్లో.అధోముఖస్థాం రమయేచ్చ నారీం తత్పృష్టవర్తీ పశుతుల్యరూపః|
భర్తా పరిక్రీడతి భావహీనో నిర్దిశ్యతే హారిణబన్ధ ఏషః||

(ఇతి పంచసాయకః)

గీ.ముందునకు వంగి యుండిన ముదిత వెనుక
భావహీనతఁ జెందిన భర్త జేరి
పశువుచందంబునను రతిఁ బరపెనేని
యదియ హరిణబంధ మటందు రవనిజనులు.

తా.ముందునకు వంగియున్న సతియొక్క వెనుకభాగమున పురుషుఁడు నిలచియుండి భావహీనుఁడై పశువులవిధమున రతిసల్పుట హరిణబంధ మనబడును.

## 76 చాటుకపేలుకబంధ లక్షణము

శ్లో.నితంబబింబం కిల నాయకస్య నార్యాస్త్రికం హస్తయుగేన ధృత్వా|
గుల్ఫౌ నిధాయ స్థిత ఏవ తస్యాబన్ధోఽస్యసా చాటుకపేలుకః స్యాత్||

గీ.వసుధఁ జూచుచు నెదుటకు వంగి భామ
వెనుక నిల్చినమాధవు వెన్నుఁ బట్ట

నాపెపదముల మునివ్రేళ్ళ నదిమిపట్టి
కలియ "చాలుకపేలుక" కరణ మనిరి.

తా.కాంత ముందునకు వంగి వెనుకకు చేతులను జాపి వెనుకనున్న పురు షుని బట్టుకొనియుండ పురుషు డామెమడమలను తనపదములయొక్క మునివ్రే ళ్ళతే బట్టి రతి యొనర్చిన చాటుకపేలుకబంధ మగును.

శ్లో.భూగతస్తనభుజాస్య మస్తాముస్తస్ఫిచదుధోముఖీం స్త్రీయమ్|
క్రామతి స్వకరకృష్ణమేహనో వల్లభః కరిదదైభముచ్యతే|
ఏణగార్దభికశౌనసైరిభప్రాయమేవమపరం చ కల్పయేత్||

వ.మఱియు నీ వ్యానకరణములయందు ననేకభేదంబులు గలవు. అందుఁ గొన్ని నామంబు లెఱింగించెద — సృగాలంబును, గార్దభంబును, యౌష్ట్రంబును, బౌండరీకంబును, మండనంబును, విపరీతంబును, నైణంబును, బారావతంబును, మయూరంబును, మౌషికంబును, భేరుండంబును, గారుడంబును, ననునవియు నింకనధికంబులుం గలవు. అవియన్నియు భావధూషితంబులు గానఁ బలుకఁబడవు. అవియన్నియుఁ దత్తదాకార పరిమాణంబై యుండు. కలాకోవిదులగువారలు తదన్వేషణరూపంబులును నృత్యసతులు గావించిన క్రియాగుణకార్యనిర్వాహ కుఁడై వ్యానతంబురీతిగా నాకారవికారం బెన్నుచు సంతతంబుగాఁ గ్వచిత్సం పర్కం బుపయోగింప శ్రేయస్కరంబు. ఇంక విపరీతంబుల నెరింగించెద.

## 77 పురుషాయితబంధ లక్షణము

శ్లో.జాతశ్రమం వీక్ష్య పతిం పురన్ధ్రీ స్వేచ్ఛాతయైనాథ రతే ప్రవృత్తిమ్|
కందర్పవేగాకులితా నితాంతం కుర్వంతి తుష్ట్యై పురుషాయితం తత్||

(ఇతి అనంగరంగః)

చ.పురుషుఁడు బ్రాంతిఁ జెందఁ బువుఁబోఁడి చివాలున లేచి యూరువు
ల్విరళముఁ జేసి పైకొని చలింపఁ గుచద్వయము న్బిఱుందుల
య్యురమురమున్ మొగంబుమొగ మూని విభుం డెదురానుచుండఁగా
హరువమరంగఁ గూడఁ బురుషాయితబంధ మన న్నుతి న్గనున్.

తా.పురుషుడు రతివలన నలసి శయ్యయందు పవళించియుండ సతి తటా లున లేచి పురుషుని పైకొని తొడలను విశాలము చేసి చండ్లును పిరుదులు కదులగా రొమ్ము రొమ్మునను ముఖము ముఖమునను యుంచి పాన్పుపై చేతులాని యాసతి రమించుభావము పురుషాయితబంధమని తెలియదగినది.

## 78 భ్రామరబంధ లక్షణము

శ్లో.సుప్తస్య పుంసో జఘనోపరిస్థితా సంభ్రామయంత్యంఘ్రియుగం వికుంచితమ్|
చక్రాకృతిః స్త్రీ నరవద్విచేష్టతే తద్ భ్రామరాఖ్యం కరణం సమీరితం||

(ఇతి అనంగరంగః)

చ.నిదురతమిన్ మురారి తననేరుపుఁ జూపక పవ్వళింపఁగా
ముదిత వరాంగమధ్యమున మోహమున న్బ్రియులింగ ముంచి స
మ్మదమునఁ జక్రమట్లు తనుమధ్యమున న్గటిసీమఁ ద్రిప్పుచున్
గదలుట భ్రామరాఖ్య మనఁగాఁదగు బంధ మగున్ జగంబునన్.

తా.పురుషుడు నిద్రాసక్తతచేత తనరతిచాతుర్యము జూపక నిలువుగా పండుకొనియుండ కాంత మోహముతో నాతని పయికొని యోనియం దాతనిదం డము నుంచుకొని తనచేతులును మోకాళ్ళను శయ్యయం దానించి పిఱుదులను చక్రాకృతిగా ద్రిప్పుచు నతినికి నిద్రాభంగము కలుగకుండునట్లు రమించుభా వమె భ్రామరబంధ మనబడును.

## 79 ఉత్కలితబంధ లక్షణము

శ్లో.ప్రేష్య విభ్రమవతీ స్మరాలయే భర్తృలింగముపధాయ పురన్ధ్రీ|
భ్రామయేత్కటిమనందవిలోలా స్యాత్తదా కరణముత్కిలితాఖ్యమ్||

(ఇతి అనంగరంగః)

మ.చనుదోయి న్బతిఱొమ్ముపై నదిమి మించ న్గౌగిట న్బట్టి మా
రునియింటన్ ధ్వజ మూననిల్పి పలుమారున్ ధూర్తసామీధవా
యనుచున్ మోవి చురుక్కుమన్నఁ గురు లాయాసంబు దా నీడ్చినన్
దనివిన్ దిట్టుచుఁ గొట్టుచున్ గలియు బంధం బుత్కలీతం బగున్.

తా.స్త్రీ వెనుకటిరీతిగా పురుషుని పైకొని తనపదములు పురుషునిపార్శ్వ ములం దుంచి చేతులను యాతనిచంకలక్రిందుగా పోనిచ్చి భుజంబులను పట్టుకొని చన్నుల నాతనిఱొమ్ముభాగమున నదిమి మోవి యానుచు రమించుభావము ఉత్క లితబంధ మనబడును.

## 80 ప్రేఖాయతబంధ లక్షణము

శ్లో.ఉత్తానశయితస్యోపర్యువిష్టా వధూస్తదా|
కిమప్యాలంబ్య హస్తాభ్యాం రమేత్ప్రేంఖోలితం హి తత్||

(ఇతి రతిరత్నప్రదీపికః)

గీ.శౌరి మీఁగాళ్ళపైఁ దనచరణయుగము
నిల్పి కరముల భుజములు నిక్కఁబట్టి
రతికిఁ బైకొని తోరణగతిని గూడ
వసుధఁ బ్రేంఖాయతం బను బంధ మయ్యె.

తా.పురుషుడు పాన్పుపై పండుకొనియుండ స్త్రీ తనపాదముల నతనిపాద ములపైభాగమున నుంచి యతనిభుజములను చేతులతో బట్టుకొని తనశరీర మతనికి తాకింపక తోరణాకృతిగా రమించుభావము ప్రేంఖాయతబంధ మనఁదగును.

## 81 సంఘాటక, 82 ఉపపదబంధముల లక్షణములు

శ్లో.యన్మిథస్తు విపరీతసక్థికం స్త్రీయుగం యుగపదేతి కాముకః|
కాముకావసి మదాకులాబలా సంపదోపపదఘాటకం విదుః||

శ్లో.ఇత్థమన్యదపి యోషితైకయా రమ్యతే వరచతుష్టయం యది|
కాముకేన యుగపచ్చ ఖండనాద్వక్త్రహస్తపదలింగసంగతః||

సీ.మరుమదంబునఁ జొక్కు మగువలిద్దఱు నొక్క
పాన్పుపై నిర్భరభంగి నున్నఁ
బురుషుఁ డందుల నొక్కపొఁలతి రమించుచుఁ
దరువాతి జవరాలి మరునియింట

జేతివ్రేళ్ళైనను జిహ్వయైనను బెట్టి
త్రిప్ప సంఘాటక మొప్పుఁ బుడమి
నీరీతినే నాథు లిరువురు పవళింపఁ
గాంతయొక్కతి రతికౌశలమున

ఆ.నుపరతంబునందు నొక్కని నలరించి
యొకని బాహ్యరతుల నుబుసు పుచ్చి
విహగపశుమృగాదివిహ్వలరతులచేఁ
బరఁగునదె యుపపదబంధ మగును

తా.ఇద్దరుస్త్రీలు శయ్యపైఁ బవళించియుండ పురుషుం డందొకస్త్రీతో రతి చేయుచు రెండవదానిభగమందు చేతివ్రేళ్ళయినను నాలుకయైనను బెట్టి త్రిప్పుచు రమించుభావము సంఘాటకబంధ మనబడును. ఆలాగుననే పాన్పుపై పురుషు లిద్దరు పండుకొనియుండ యొకస్త్రీ యందొకనితో నుపరతి చేయుచు రెండవపురు షునిదండమును చుంబించుచు బాహ్యరతిచే రమించుభావము ఉపపదబంధ మన బరగెను.

## 83 గోయూధకబంధ లక్షణము

శ్లో.పరస్పరం విశ్వసనీయయోషిత్సంఘాటకేన క్రమశోయువాఽథ
రమేత గోయూధక మేతదేకా క్రాన్తాఽపి కాంతైర్బహుభిస్తథైవః||

(ఇతి రతిరత్నప్రదీపికః)

గీ.కాంతు నొక్కని జీరి పెక్కండ్రు స్త్రీలు
పడకటింటను జేర్చి యా పడఁతు లెల్ల
నొకరితరువాయి వరుస నింకొకరు వాని
గలసి రతి సల్ప గోయూధకరణ మయ్యె.

తా.స్నేహితురాండ్రైన స్త్రీ లనేకమంది జేరి యుమ్మడిగా రమించుటకు బురుషు నొకనిని జేర్చుకొని యొకరితరువాత నొకరు వరుసగా రమించుట గోయూ ధకబంధ మనంబడును.

## 84 జలకేళితబంధ లక్షణము

శ్లో.కరీ జలక్రీడకాలే కరిణీయూథమధ్యగః|
క్రమేణ రమతే సర్వాస్తద్వత్స్యాత్ వారికేళితమ్||

(ఇతి రతిరత్నప్రదీపికః)

గీ.జలక మాడుచుఁ గొలనులో సంచరించు
గోపికలఁ జేరి కృష్ణుఁడు కూర్మి హెచ్చ
నొకరితరువాయివరుస నింకొకరిఁ గూడి
కేళిఁ దనిపినవిధి జలకేళి యండ్రు.

తా.ఆడయేనుగులను నీటియందు వంతులుప్రకార మొకదాని విడిచి యొక దానిని మగయేనుగు రతిసల్పినప్రకారమే కొలనులో జలకమాడుచున్న గోపిక లను నొకరితరువాత నొకరివంతున వరుసగా నాగోపికలతో గృష్ణుఁడు రతిసల్పిన భావమే జలకేళి యనంబడును.

## మన్థపీడితము మన్థవరాహముల లక్షణము

శ్లో.చిత్రయంత్రవిధిరేష భాషితో లింగయోనిపరిఘట్టనావిధౌ|
మంథపీడితవరాహఘాతఃద్యుక్తయోఽవతిఫలా మయోజ్ఝితాః||

శ్లో.ఊర్ధ్వతోధ పరితోప్యధస్తథా పీడనాహననఘట్టనావిధాః|
మన్మథాకులనితంబినీభగే యోజయేత్కరధృతం ధ్వజం పుమాన్||

సీ.మన్థపీడితమును మన్థవరాహఘా
తంబును ననఁగ నత్యంతయుక్తు
లప్రయోజనము లీయనువులు కరకరి
క్రీడనంబును మందకృత్య మరయ
మీఁదఁగ్రిందును రెండుమేరల యోనిలోఁ
బీడింప నది మన్థపీడితంబు
చేత లింగముఁ బట్టి స్త్రీ యోనిలోఁ బెట్టి
కరముఁ ద్రిప్ప వరాహఘాతకంబు

గీ.నీచరతులఁ దృప్తిని గనని కాంతకుఁ
దనివిగాఁగఁ దారుదండమునను
నుచ్చరతులఁ బ్రీతి నొందెడు నెలనాగఁ
జూచి యుపరతికిని జొనుపవలయు.

తా.మంథపీడిత మంథవరాహఘాతలు రెండును అత్యంతయుక్తులును ప్రయోజనము లేనివియునై యున్నవి. మఱియు నీయుపాయములు క్రూరమైన యాటలును యలసకృత్యములునై యున్నవి. పురుషుడు కాంతయోనిలో దండ ముంచి మీదకును క్రిందకును ద్రిప్పుట మంథపీడిత మనబడును. సతి తనచేతితో పురుషు నిదండమును బట్టి తనయోనిలో నుంచుకొని మీదకును క్రిందకును ద్రిప్పినయెడల మంథవరాహఘాత మనబడును. నీచరతులతో తృప్తినొందనికాంతను తమదండ ముచే మంథపీడిత మంథవరాహఘట్టనంబుల జేయ దృప్తినొందును. ఉచ్చరతుల వలన సంతసించుకాంతను యుపరతి చేయునటు లాసతిని పురుషుడు లాలింపవలెను.

క.ఏకరణమునకుఁ బ్రియమై
యేకామినిచొక్కు దానియింగితమునకై
యాకరణంబున నాయకుఁ
డాకామిని గూడవలయు ననురాగమునన్.

తా.ఏబంధమువలన సతి సంతోషపడునో దాని హృదయరంజనమునకు గాను పురుషు డాబంధముచే నాసతిని యనురాగముతో గూడవలయును.

శ్లో.యోజయేన్న విపరీతమోహనే నూతనప్రసవపుష్పయోగినీమ్|
గర్భిణీం చ హరిణీం చ పీనరాం కన్యకామపి కృశాం చ వర్జయేత్||

క.తిరముగ విపరీతంబులఁ
బరివర్జింపంగవలయు బాలను స్థూలన్
హరిణిన్ గర్భిణిఁ బుష్పిణిఁ
దరుణిం బాలెంతరాలిఁ దనుతరదేహన్.

తా.బాలయు, బలసినవాతశరీరముగలదియు, హరిణీజాతిసతియు, గర్భము ధరించినదియు, ముట్టయినదియు, బాలింతరాలును, కృశించినదేహముగలదియు వీరలను విపరీతబంధములను జేయుపట్ల వర్జింపవలయును.

## రతితృప్తి లక్షణము

శ్లో.యేన సా భ్రమితదృష్టిమండలా స్యాత్తతస్తు సరిపీడయేద్భృశమ్|
స్రస్తతా వపుషి, మీలనం దృశో, ర్మూర్ఛనా చ రతిభావలక్షణమ్||

క.గాత్రంబు పరవశంబగు
నేత్రంబులు మూయుఁ జెమట నించును నూర్పుల్
చిత్రగతిఁ బొలయుఁ బలుకఁ బ
విత్రఫలము లౌను సతికి వీర్యము వొడమన్.

తా.నెలంతకు యింద్రియపతన మగునపుడు దేహస్మరణ తప్పుటయు, నేత్ర ములు మూతపడుటయు, చెమట పట్టుటయు, నుచ్ఛ్వాసనిశ్వాసము లధికమగు టయు, చిత్రముగ మాటలాడుటయు సంభవించును.

శ్లో.శ్లేషయేత్స్వజఘనం ముహుర్ముహుః సీత్కరోతి మదగర్వితాకులా|
భావసిద్ధిసమయస్య సూచకం వక్ష్యమాణమరతేస్తు లక్షణమ్||

ఆ.జఘనఘట్టనంబు సలుపును బలుమారు
గళరవంబు చెలఁగఁ గన్నుమూయు
సొలయుఁ దిట్టుఁ గొసరు సుందరివీర్యంబు
వొడమువేళ మనసు బట్టునెపుడు.

తా.మఱియు నెలంత కింద్రియపతన మగునపుడు మాటిమాటికి భగముతో బురుషునిదండమును బెనగకుండునటుల నదుముటయు, పావురపుపల్కులు పల్కు టయు, కన్నులు మూయుటయు, పరవశము నొందుటయు, తిట్టుటయు, కొసరు టయు, మనస్సును బిగబట్టుటయు సంభవించును.

## రతియందు దృప్తినొందని స్త్రీ లక్షణము

శ్లో.హస్తమాధువతి హన్తి నో దదాత్యుజ్ఝితుం భటితి లంఘయేదితి|
నేచ్ఛయా శ్రమిణి వల్లభేఽథవా యోషిదాచరతి పూరుషాయితమ్||

క.రతి తృప్తినొందకుండిన
నతివ విభునిఁ దిట్టుఁ జేతు లాడించు రతిన్
బతి యలసినఁ బురుషాయిత
రతిఁ గైకొని తనదుగుహ్యారతులఁ బెనంగున్.

తా.రతియందు తృప్తినొందనికాంత పురుషుని తిట్టుటయు, చేతితో నత నిని పట్టి యాడించుటయు, యతం డలయుచో బైకొని రతి చేయుటయు గలుగును.

శ్లో.ఆదితో ఘటితయస్త్రమేవ వాతం నిపాత్య నరవద్విచేష్టతే|
చక్రవద్భ్రమతి కుంచితాంఘ్రికా భ్రామరం నృజఘనేసముద్గతే||

శ్లో.సర్వతః కటిపరిభ్రమో యది ప్రేంఖపూర్వమిదముక్తమూలితమ్|
తాడవం చ విదధీత సీత్కృతవ్యస్తసస్మితముఖీ వదేదిదమ్||

శ్లో.పాతితోఽసి కితవాధునా మయా హన్మి సంవృణు కృతోఽసి నిర్మదః||
నిష్నతీ క్వణితకంకణం ముహుః కృష్ణకున్తలచుంబితాధరా|
పాన్ద్వాదోలితనితంబమాకులా కర్మణశ్చ విరమేదపి స్వయమ్||

చ.చరణయుగము వంచి ఘటచక్రముభంగిఁ బరిభ్రమించుఁ గం
ధరనినదంబుఁ బెంచు జఘనస్థలడోలన మాచరించు వా
క్కరణ వహించుఁ బేరురము ఘట్టనచే నదలించుఁ గుంతల
స్ఫురణ కుదుర్చు వీరరతి చుంబనణ జేయు లతాంగి నాథునిన్.

తా.రతితృప్తిలేనికాంత పురుషుని పైకొని తనకాళ్ళను వంచి చక్రాకృతిగా దిరుగుటయు, పావురపుపల్కులు పల్కుటయు, కటిపురోభాగము నుయ్యాలవలె నాడించుటయు, శిశ్నమును చుంబించుటయు, ఱొమ్మును కొట్టుటయు, ముంగురులు చక్కజేయుటయు, ముద్దుపెట్టుటయు, పురుషాయితబంధముల జేయుటయు కలుగును.

శ్లో.సశ్రమామథ విభాన్య పాతయేత్ సంపుటం చ స్ఫుటయేద్వసర్జనే|
తృప్తిమేతి యది నైవమపయ్యాసావాచరేద్గదితమంగులీరతమ్||

క.సురతమునఁ గ్రిందుమీఁదగుఁ
దరుణియుఁ బురుషుని బెనంగుఁ దత్తద్రతులన్
బరితృప్తి బొందకుండిన
సరసుం డంగుళిరతంబు సలుపఁగవలయున్.

తా.రతితృప్తిపొందనికాంత సంభోగమున క్రిందుమీదై బంధములతో తృప్తినొందనియెడల పురుషుడాస్త్రీని యంగుళిరతముతో తృప్తి నొందింప వలయును.

శ్లో.మోహనం మదనయుద్ధమూచిరే తస్య తాడనమిహాంగ మిష్యతే|
ఆర్తిరూపమపి తత్ర సీత్కృతం తచ్చ భూరివిధముచ్యతే బుధైః||

శ్లో.తాడనం సమతలాపహస్తతో ముష్టినా ప్రసృతకేనచోదితమ్|
పృష్ఠపార్శ్వజఘనస్తనాన్తరే మూర్ధ్ని, తే హి మదనస్య భూమయః||

శ్లో.హింకృతం స్తనితసీత్కృతోత్కృతం ఫూత్కృతం శ్వసిత రోదనాదికమ్|
ముంచ పీడయ గృహాణ జీవయ త్రాహి హా ధిగతి సీత్కృతం విదుః||

వ.మఱియుఁ బ్రబలరతి కుపయుక్తంబులగు సీత్కృతతాడనంబులను రత్యంగములు బహుప్రకారంబులై యుండు నవి వివరించెద—

సీ.తాడనంబున సమతలము ముష్టియు నన
  నవి రెండుభావంబు లయ్యె వాని
నెలవు లెయ్యవియన్న నెత్తియు నెదఱొమ్ము
  పార్శ్వంబులును వీపు భగతలంబు
సీత్కృతంబులునాఁగఁ జెప్పంగ నెనిమిది
  హుంకృతంబులు సీత్కృతోత్కృతములు
తగఫూత్కృత శ్వసితంబులు రోదన
  స్తనితము ల్ఫూత్కృతంబని యనంగఁ

ఆ.బట్టు విడువు కొట్టు ప్రాణంబు రక్షించు
చిక్కితిని మఱేమి సేయుదునని
మ్రొక్కు వనరుఁ జేత ముట్టనీకుండుట
సీత్కృతంబునకును జిహ్వ మిదియ.

తా.తాడనము సమతాడనమనియు ముష్టితాడనమనియు రెండువిధములు. నెత్తి, ఱొమ్ము, పార్శ్వము, వీపు, యోని, యివియైదును తాడనమునకు స్థానములు. ఉత్కృతము,

ఘూత్కృతము, శ్వసితము, రోదనము, స్తనితము, భూత్కృతము లనధ్వనులు, పట్టు, విడువుము, కొట్టు, ప్రాణము కాపాడు, నీకు లోబడితి నికేమి సేయుదు, మ్రొక్కు, యేడ్చు, ముట్టనీకయుండుటయు, నీయెన్మిదియు పైధ్వు లకు చిహ్నములు.

శ్లో.తచ్చ లావకకపోతకోకిలాహంసకేకిసదృశై రుతక్రమైః|
మిశ్రితం ప్రహరణే ప్రయుజ్యతే హ్యన్యదాపి రుదమిష్యతేవిటైః||

క.కేకి కలహంస లావుక
కోకిల పారావతములు కులికెడి పలుకుల్
గైకొని తాడన సీత్కృత
పాకంబుల వెలయవలయుఁ బతియున్ సతియున్.

తా.స్త్రీపురుషులిరువురు రతి సేయుకాలమునందు నెమలి, హంస, కోకిల, పావురములవలె పలుకులు పలుకుచు పైనజెప్పియున్న సీత్కృతతాడనంబులతో మెలంగవలయును.

శ్లో.ఊర్ధ్వముచ్చరతి కంఠనాసికా హింకృతం స్తనిత మభ్రఘోషవత్|
వంశవిస్ఫుటనపంచ సీత్కృతం ఘూత్కృతం బదరసాతవజ్జలే||

శ్లో.రోదనధ్వనికరీం కరాహతిం హృత్ప్రయోజ్యమపహస్తకం విదుః|
ముష్టిరత్ర విదితస్తు పృష్ఠతే మూర్ధని ప్రసృతకం ఫణాకృతి||

సీ.స్తనితంబు హుంకృతధ్వనియును మేఘుని
ఘోషంబునకు నెనగూడియుండుఁ
గంఠనాసికలతోఁ గలియంగ నుదయించు
నినదంబు సీత్కృతం బనఁగఁ బరఁగుఁ
నెదురువ్రక్కల నూప నుదయించునేధ్వని
యటువలె భూత్కృతి నతిశయిల్లు
జలముల బదరికాఫలములు పడువేళ
బొదవెడుధ్వనితోడ ఘూత్కృతంబు

ఆ.ఊర్జితంబులైన యోజను వర్ధిల్ల
నతివపల్కు రోదనాఖ్య మయ్యె
నిట్టిపలుకుతోడ నింతిని గరతాడ
నంబు సేయవలయు నాలు గవియు.

తా.స్తనిత హుంకృతధ్వనులు రెండును యుఱుమునకు సరిగా నుండును. సీత్కృతధ్వని కంఠధ్వనియు నాసికధ్వనియు గలియునటుల గలుగధ్వనికి సమాన ముగా నుండును. భూత్కృతధ్వని వెదురుబద్దలను కదుపగా నగుశబ్దమునకు సరిగా నుండును. ఘూత్కృతము నీటియందు రేగిపండ్లు పడుసమయమున పుట్టుధ్వనితో సమానముగా నుండును, శ్వసితమన శ్వాసమును, రోదనమన యేడ్చుటయు, నీరెం డును ప్రసిద్ధము. పైన చెప్పబడిన ధ్వనులు చేయుచు పురుషుడు రతియందు స్త్రీకి కరతాడనము జేయవలయును.

శ్లో.హస్తతాళహననం చ జాఘనే పార్శ్వయోః సమతలం ప్రయుజ్యతే|
కర్తరీప్రభృతి దక్షిణాపథే తాడనం తదిహ దూషితం బుధైః||

శ్లో.తాడయేద్యువతిమంకగామినీం పృష్ఠతః ప్రియతమః స్వముష్టినా|
సాభ్యసూయమివ సాపి తన్తథా క్రన్దతి శ్వసిత కాముకాతరా||

శ్లో.అసమాప్తి హృదయే ప్రయుజ్యతే యుక్తయన్త్రయువతేః పుమాన్సనైః|

వర్ధమాననుపహస్తతాడనం సాపి సీత్కృతమిహాదరేన్ముహుః॥

సీ.హుంకృతధ్వనితోడ నురమున దనహస్త
మిడి చేయవలయుఁ జప్పు డొగి విభుఁడు
ఘట్టింపవలె ముష్టిఘట్టన నెదుఱొమ్ము
స్తనితకూజితవిధూతములచేతఁ
బాముపడగరీతిఁ బట్టినచెయి వంచి
తలవేయవలయు సీత్కార మొదవ
దవడ లొయ్యన హస్తతాడనఁ గావించి
జఘనపార్శ్వములందు సమతలంబు

గీ.మోపి కలహంసలావుక ముఖరవంబు
గదుర మోచేత వీపు వక్షస్థలంబు
తాడనము సేయ దక్షిణత్వమునఁ గాని
యన్యకరమున వేయరా దనిరి మునులు.

తా.పురుషుడు హుంకృతధ్వనిచేత స్త్రీఱొమ్మున దనచేతితో కొట్టుటయు, స్తనితధ్వనిచోత నెదుఱొమ్మున పిడికిలిచేత కొట్టుటయు, సీత్కృతధ్వనిచేత చేతిని పాముపడగవలె వంచి తలయందు కొట్టుటయు, శ్వసితధ్వనిచేత దవడలయందు చేతితో కొట్టి మొలకు రెండువైపులను సమతలముగా యుంటి హంసవలె పలుక మోజేతితో వీపును వక్షస్థలమును కొట్టవలెను. కుడిచేతితో కొట్టవలెను గాని యెడమచేతితో కొట్టకూడదని వాచ్యాయనాదులు పల్కిరి.

శ్లో.తత్ర చేద్వివదతే శిరస్తదా తాడయేత్ ప్రస్మృతకాన కాత్కృతమ్।
ఫూత్కృతం యువతిరాచరేద్భృశం తాడనే శ్వసితరోదితే అపి॥

శ్లో.సత్వరం సమతలేన తాడయేదాసమాప్తి జఘనే చ పార్శ్వయోః।
రాగపాతసమయే నితంబినీ హంసలావకరుతం సమాచరేత్॥

ఉ.చేరువనున్నకాంత పతిచేత నిజాయతముష్టిఁ జీరినన్
నీరజనేత్ర నిబ్బరము నివ్వెఱపాటును రోదనంబు ని
ట్టూరుపుఁ దోఁపఁ గొంతవడి నొయ్యన ముష్టి గదల్చి కేళికిన్
జేరి తదీయతాడనవిశేషముఁ జూపును సీత్కృతంబుతోన్.

తా.స్త్రీ పురుషునియొక్క పిడికిలిచేత కొట్టుబడి రోదనమును, నివ్వెర పాటును, నిట్టూర్పుల నించుచు, సీత్కృతధ్వని చేయుచు, తనపిడికిలిచే పురుషుని గొట్టును.

శ్లో.కన్ద్రితం శ్వసితమాచరేన్ముహుర్మోహనాన్తసమయో నితంబినీ।
అన్యదాపి విగతార్తినిఃసహా కంఠకూజితవతీ విరాజతే॥

చ.శిరమునఁ గుంచితాంగుళముఁ జేయుచు ఫూత్కృతి యాచరింపఁ బం
కరుహదళాక్షి యూర్పులను గ్రందనము ష్ఠటియింప నంత స
త్వరమునఁ బార్శ్వగుహ్యములు తాడనఁ జేయఁగరంగి లావుహం
సరతము లాచరించు నవసానరతంబునఁ దృప్తి పుట్టదే.

తా.పురుషుడు ఫూత్కారధ్వని చేయుచు చేతివ్రేలును వంచి స్త్రీయొక్క నెత్తిపై కొట్టుచు రతి సేయ నూర్పులును యార్పులును నేర్పడును. వెంటనే పార్శ్వ ములు భగమును తాడనము చేయ సతి ద్రవించి హంసపలుకులతో రతి యొనర్చి దృప్తి నొందును.

శ్లో.సానురాగపరుషత్వచండతాం పూరుషేషు దధతి స్త్రియో రతే|
రాగతో భవతి సాత్మ్యతః క్వచిద్వ్యత్యయోపి స చిరంమనోహరః||

శ్లో.పంచమీ గతిముపేత్యవీక్ష్యతే స్థాణువారితతురంగమో యథా|
కాముకావపి తథా రతాహనే ఛేతఘాతకదనం న పశ్యతః||

శ్లో.కింతు సాత్మ్యమభిచిన్త్యయోషితాం తీవ్రమన్దముపచార మాచరేత్|
ఔపరిష్టకవిధానదర్శినా నిన్దితా చ మునినేతి కిం తయా||

సీ.రతికాల మెఱుఁగక రమణుండు పైకొని
కొసరులఁ బల్కిన విసువు పుట్టు
గతిచండమందవేగంబులఁ జూపక
సత్వరీతులఁ గూడ సమ్మతించు
మధుమదంబున నున్న మానిని నఖదంత
కరఘాతములచేతఁ గరఁగుచుండు
తనసత్వమునఁ బొందఁ దరుణిసత్వంబును
దెలియక రతి సల్పు టలవికాదు

ఆ.కాన సత్వ మెఱిఁగి కళలంటి చుంబన
భూషణాదిగతులఁ జూపనేర్చి
కామశాస్త్రవిధులఁ గాంతలు పతులును
దలఁపు లొప్పఁ దెలియఁ గలియుదు రిల.

తా.పురుషుడు లాలనాదిక్రియలను జేసి సతిని ద్రవింపజేయక పైకొనిన సతి విసుగుకొనును. రతి సేయునపుడు చండమందవేగములను జూపక సమరతి చేసిన సతి సమ్మతించును. సతి కల్లు త్రాగి మత్తుతో నున్నయెడల నఖ దంత కర ఘాతములచేత ద్రవించును. పురుషుడు సతి నాలింగనాదివిధులతో దానిబలమును దెలిసికొని దానికి తగినబలమును జూపుచు రమించిన ద్రవించును. అట్లు కానిచో వికటమగును. కావున సతియొక్కబలమును తెలిసికొని కళలను పట్టుచు నఖక్షతదంత క్షత చుంబనాదిగతులను జేయుచు నీశాస్త్రమున జెప్పబడినప్రకారము దేశకాల పాత్రంబులను దెలిసి సతీపతులు యొకరియుద్దేశము లొకరు తెలియుచు గలియు దురుగాత.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే
సురతాధికారో నామ
దశమః పరిచ్ఛేదః



# కన్యావిశ్రంభణాధికారః
# ఏకాదశః పరిచ్ఛేదః

## కన్యావర లక్షణము

శ్లో.త్రిగణమవికలార్థం సాధయన్సాధు లోకః
    పరిణయతు సవర్ణాం శాస్త్రతోఽనన్యపూర్వామ్|
  పరిణయసహవాసక్రీడితాదీని మైత్రీ
    మధమసమధకాభ్యాం నైన కుర్వన్తి సన్తః||

ఆ.సంతతార్థధర్మసౌఖ్యాభిమతసిద్ధి
  కరము పెండ్లిగాన ఘనుఁడు దెలిసి
  తనకులంబుదాని మును వివాహముగాని
  కన్య పరిణయంబు గాఁగవలయు.

తా.ఎడతెగని ధర్మార్థకామసౌఖ్యమతసిద్ధికొరకు పురుషుడు తనకుల మున బుట్టినదానిగా మునుపు వివాహము కానిదానినిగా జూచి యట్టికన్యను పెండ్లి చేసుకొనవలయును.

## సత్కన్యాలక్షణము

శ్లో.కువలయదళకాన్తిస్స్వర్ణగౌరద్యుతిర్వా
    కరచరణనఖేషు స్నిగ్ధరక్తా తతాఽక్ష్ణోః|
  సమమృదుపదయుగ్మా స్వల్పభుక్స్వల్పనిద్రా
    కమలకలశచక్రాద్యంకితా పాణిపాదే||

సీ.హేమవర్ణం బైన నిందిరాద్యుతి యైనఁ
    గుందనకాంతిఁ యందంద మైనఁ
  జరణంబులును హస్తజలజంబులును గోళ్ళు
    కనుఁగొన లరుణిమఁ గలిగియున్న
  సరసంబు మృదువునై చక్రాబ్జకలశాంకి
    తములైన కరపాదతలయుగములు
  సమము బింకములైన చనుదోయి నల్లనై
    కడ లొక్కకొలఁదైన కచభరంబు

గీ.భోజనము నిద్రయును గొంచెమును మొగమ్ము
  నుదరమును జాలపలుచనౌ మృదులతనువు
  నధికశీలంబుఁ గలకన్య నర్హగాఁగఁ
  జాటి చెప్పిరి పరిణయశాస్త్రవిదులు.

తా.శరీరము బంగారుచాయ శ్యామలవర్ణము కుందనపుకాంతిని పోలి యున్నదనియు, తామరను బోలినపాదములును, చేతులును గోళ్ళును కనుగొనలును యెఱుపు గలిగినదియు, మృదువులై శంఖుచక్రాదిరేఖలుగల చేతులు పాదములు గలిగియుండినదియు, చనుమొనలు నల్లగా యుండి సమమును బింకమునుగల చన్ను లు గలదియు, ఎక్కువజుట్టును, భోజనమును నిద్రయు కొంచెముగా గలదియు, పలుచనగు మొగమును కడుపును, మెత్తనిదేహమును, ఎక్కువయాచారముగల దియు, ఈగుణములు గల కన్యను వివాహమాడవలయునని పరిణయశాస్త్రవేత్తలు పలికియుండిరి.

# దుష్కన్యాలక్షణములు

శ్లో.అకపిలకచపాశా చాప్రలంబోదరస్యా
వరణవిధిషు కన్యా శప్యతే శీలసారా।
బహిరథ రుదతీ యా జృంభతే యా చ సుప్తా
వరణవిధిసమేతస్తాం బుధా వర్జయన్తి॥

క.వాకిట నిలిచిన నేడ్చునఁ
గాకాడిన నిదుర చాలఁ గలిగిన పలుకుల్
గైకొనక యావులించిన
నాకన్నియ వర్జనీయ యనిరి మునీంద్రుల్.

తా.ఎల్లప్పుడును వాకిట నిలుచుటయు, యేడ్చుటయు, కోపము గలిగి యుండుటయు, నిదుర గలిగియుండుటయు, చెప్పుమాటలను వినక ఆవులించుటయు నీగుణములుగల కన్నియ పెండ్లి చేసుకొన తగదని మునీంద్రులు చెప్పిరి.

శ్లో.గిరితరుతటినీనాం నామభిః పక్షిణాం వా
సమధికపరిహీనా వ్యానతక్రూరగాత్రీ।
అధరమధికలంబం కోటరం పింగళం వా
నయనమథ పహన్తీ కర్కశం పాణిపాదమ్॥

సీ.పర్వతతరునదిపక్షినామంబుల
నేకన్యఁ బిలుతు రయ్యింటివారు
పొడవు కొంచెము దళంబును నల్పమును గాఁగఁ
దనరు నేకన్య వక్త్రమును దొడలు
పెదవియు నధికంబు పింగళమై గుంట
కన్నులు గలిగి యేకన్య మెలఁగు
కరతలంబులు పాదకమలంబులును గడు
కఠినంబు లగుచు నేకన్య యొప్పు

గీ.నిదురఁబోవుచు నవ్వెడి నిడుదయూర్పుఁ
బుచ్చు నేడ్చెడి నేకన్య భుక్తివేళ
మీసములు గల్గి చనుదోయిమీఁద రోమ
ములును గల్గిన కన్నియఁ దలఁపవలదు.

తా.కొండయు చెట్టును నదియు పక్షియు వీటిపేరులును, కొంచెము పొడవగుమొగమును, కొంచము మందముగల తొడలును, పెద్దపెదవియు, గోరో జనమువంటి వర్ణము గలిగిన గుంటకన్నులును, కఠినములయిన కాళ్ళుచేతులును, నిదురబోవుచు నేడ్చునదియు, భోజనసమయమందు నిట్టూర్పుల విడుచుచు నేడ్చె డిదియు, మీసములు గలిగినదియు, చన్నులపై వెండ్రుకలును గలిగిన కన్యల వివా హమునకు దగనివారు.

శ్లో.శ్వసితి హసతి రోదిత్యేవ యా భోజనేసి
స్తనమపి పతితోర్ధ్వం బిభ్రతీ శ్మశ్రులా వా।
విషమకుచయుగా వా వామనా శూర్పకర్ణీ
కుదళనపరుషోక్తిర్దీర్ఘవక్త్రాఽతిదీర్ఘా॥

ఉ.చన్ను లొకింతగాక పరుసంబులఁ బల్కుచుఁ గర్ణయుగ్మమే
చెన్నును లేక రోమములఁ జెందినపిక్కలు చేతులు స్గడు

న్సన్నపురూపు దీర్ఘవదనంబును గందినపండ్లు గల్గు నా
కన్నియ( బెండ్లియాడ( గొఱగాదని పల్కిరి శాస్త్రకోవిదుల్.

తా.కొద్దిపాటిచన్నులుగాక, నిష్ఠురములను పలుకుచు, చెవులు అంద ముగా నుండక, పిక్కలయందును చేతులయందును వెండ్రుకలు గలిగి, శరీరము సన్నమై, ముఖము పొడుగుగాను, నలుపురంగుగల పండ్లును, కలిగిన కన్నెను వివాహమాడ తగదని శాస్త్రవేత్త లెఱింగించిరి.

శ్లో.విటవిషయరతా వా రోమశా పాణిపార్శ్వే
స్తనపరిసరపృష్ఠే జంఘయోరుత్తరోష్ఠే|
భ్రమణవిధిషు యస్యాః కంపతే క్ష్మాతలం వా
పతతి హసనకాలే గండయోర్వా తరంగః||

శ్లో.భవతి సమధికా చేత్పాదజాంగుష్ఠతోఽస్యా
స్తుపవసతిరన్యా హీయతే మధ్యమా వా|
పతతి భువి కనిష్ఠాఽనామికా వా ద్వయం వా
న యది వరణకృతే కన్యకా వర్జనీయా||

క. ఏకన్నె విటవిదూషక
లోకమునకు( బ్రీతి(జేయు లోలుపమతియై
యేకన్నె నడువ నధిక
క్ష్మాకంపము నొందు దాన మాన(గవలయున్.

తా.విటవిదూషకలోకమునకు బ్రీతిచేయటయం దాసక్తిగలదియు, నడుచునప్పుడు భూమి యధికముగా చప్పుడగునట్టియు కన్నెను వివాహమాడకూడదు.

క.కాలి పెనువ్రేలుచేరువ
వ్రే లధికంబైన నడిమివ్రేలు కృశంబై
వ్రాలిన నవ్వలివ్రేళ్ళును
వ్రాలక యిల మోపకున్న వనితను విడుమీ.

తా.పాదముయొక్క పెద్దవ్రేలుకన్న ప్రక్కనున్నవ్రేలు పొడుగుగా నున్నను మధ్యవ్రేలు సన్నముగా నుండి వ్రాలియున్నను చివరరెండువ్రేళ్ళును క్రిం దికి వ్రాలియుండక భూమిమీద మోపకున్నను యట్టికన్నెను వివాహమాడంజనదు.

క.చెక్కులు నవ్వినవేళల
స్రుక్కుచు నిరవైన నుదుట సుడియున్ను బై
వెక్కసమైనను వట్రువ
ముక్కైనను గన్నెమీ(ది మోహం బేలా.

తా.నవ్వుచున్నసమయమున చెక్కిళ్ళు లోనికి లాగుకొనియున్నను ముఖమునందు సుడి యున్నను గుండ్రమయిన ముక్కు గలిగినను యట్టికన్నెపై మోహమును విడువవలయును.

## వివాహానంతరము

శ్లో.అథపరిణయరాత్రౌ ప్రక్రమేన్నైన కించిత్
త్రిసృషు హి రజనీషు స్తబ్ధతా తాం దునోతి|
త్రిదినమిహ న భిన్ద్యాద్బ్రహ్మచర్యం నచాస్యా
హృదయమననురుధ్య స్వేచ్ఛయా నర్మకుర్యాత్||

చ.సురుచిరకన్యకామణిని శోభనలక్షణఁ బెండ్లియాడి యా
పరిణయరాత్రియందుఁ బయిబా టొకయించుక లేక మూఁడువా
సరములదాఁక సంగమవిసర్జనుఁడై సురతేచ్ఛ లేక య
వ్వరుఁడు చతుర్థరాత్రి తగువాంఛితకేళికి నాసఁ జెందుచున్.

తా.మంచిలక్షణములుగల కన్నియను జూచి పెండ్లి చేసుకొని యారాతిరి నుండు మూడురాత్రులవరకు దానితో రతి చేయస నాలుగవరాత్రియందు సంభో గము చేయ నిచ్చగింపజనును.

శ్లో.కుసుమమృదుశరీరా విద్విషన్తి ప్రయోగా
నన‌ధిగతరహస్యైర్యోషితో యుజ్యమానాః|
ప్రథమమిహ సఖీభిః ప్రేమ యుమంజీత తస్యా
స్తదధిక మిహ కుర్యాత్ప్రశ్రయం యేన ధత్తే||

చ.తరుణులు పుష్పకోమలులు తత్తఱపాటున నేమి చేసినన్
విరసము పుట్టుఁ గావు వివేకమునం బురుషుండు తత్సమో
పరిచితభంగి రాగరసబంధురుఁడై యెట నేపరియోజనం
బు రమణి కిష్టమౌ నదె యపూర్వముగా నొడఁబాటుఁ జేయుచున్.

తా.స్త్రీలు మిక్కిలి సుకుమారులు కావున పురుషుడు తొందరపడి యేమి చేసినను వారు నిరసించుదురు. అందువలన పురుషుడు యెక్కువపరిచ యము చేసుకొని యనురాగము గలవాడై స్త్రీల కభీష్టప్రయోజనములను జేయుచు లాలింపవలయును.

శ్లో.ప్రథమపరిగతాయాం బాలికాయాం చ చేష్టాం
తమసి రహసి చాహుః సంస్తుతాయాం తరుణ్యామ్|
క్షణమిహ పరిరంభం పూర్వకాయేన కుర్యాద
ముఖమభివదనేన స్వేన తాంబూలదానమ్||

శా.ఏకాంతంబునఁ జీఁకటైన నిశియం దిందీవరాక్షి న్సులో
లాకాంత న్దగబుజ్జగించి చతురాలాపమ్ము న్మెల్లఁగాఁ
గైకోనొక్కుచుఁ బూర్వకాయమునఁ జక్క న్గౌఁగిట న్జేర్చి యా
మూకత్వం బెడలించి వక్త్రగతతాంబూలంబునం బంచుచున్.

తా.రహస్యస్థలమున చీకటిగానున్న రాత్రియందు స్త్రీని మంచిమాటలచే బుజ్జగించుచు మాటలనేర్పుచే నంగీకారము బడయుచు కౌగలించి జంకును బోగొట్టి నోటియందుగల తమ్మను పురుషుడు పంచియిచ్చుచు మెలంగవలెను.

శ్లో.ప్రణయశపథసామవ్యాహృతైః పాదతైః
స్తదనువయవిధానైర్గ్రాహయేచ్చ ప్రతీపామ్|
విశదమృదు విదధ్యాచ్చుంబనం తత్ప్రసంగా
త్కలమృదుభిరధైనాం యోజయేత్కేళివాదైః||

శ్లో.అవిదిత ఇవ పృచ్ఛేత్కించిదల్పాక్షరార్థం
ప్రతిగిరమవదన్తీం భూయ ఏవానురుధ్య|
అహమభిరుచితస్తే తన్వి నో వేతి పృష్టా
ప్రతివచనపదే సా మూర్ధ్ని కంపం చ కుర్యాత్||

శ్లో.ప్రణయముపగతా చేన్మన్దమన్దం వయస్యాం
ప్రతి కథితరహస్యా స్మేరసమ్రానానా స్యాత్|

కథితమిదమిదం తే ధీరసౌభాగ్యమిత్యా
ద్రుతమపి చ వయస్యా చాభిదధ్యాత్ ప్రియస్య॥

శ్లో.ప్రకటవచసి సఖ్యాం నాహమేవం వదామీ
త్యవిశతపదవర్ణార్థోక్తిలీలాం విదధ్యాత్।
ప్రణయవికసనే చ ప్రార్థితా పూగపుష్పా
ద్యుపనయతి సమీపే స్థాపయేచ్చోత్తరీయే॥

శ్లో.స్తనముకుళమథాస్యాః సంస్పృశేత్పాణిజాగ్రైః
కరతలముపగూహ్యాఽఽనాభి నీత్వా వికర్షేత్।
తదథ యది నిరున్ధ్యాత్ సంస్పృజే త్యేవముకత్వా
సుముఖి న కరవాణి క్లిశ్యసి త్వం యదీతి॥

సీ.పలుకకయున్న నాపైఁ గోపమా యని
బుజ్జగించుచుఁ జెక్కుఁ బుణికి బుణికి
యధరపానం బించుకైన నిమ్మని యొట్టుఁ
బెట్టుచు దండముఁ బెట్టి పెట్టి
యెఱుఁగరా దీమాట యింతని చెవిలోనఁ
జెలువైన ప్రియములఁ జెప్పి చెప్పి
మదనకేళికి నర్మమర్మగర్భంబుల
ననునయాలాపంబు లాడి యాడి

గీ.వాద మేటికి నే లెస్సవాఁడ నాకుఁ
దగుదు వీవని శిరమును దడవి తడవి
కొన్నిపలుకులఁ జొక్కించి కన్నుసన్న
లెఱిఁగి చుంబింపఁ గన్నియ కింపు పుట్టు.

తా.పురుషుడు స్త్రీ పలుకకుండిన నాపై కోపమా యని మంచిమాటలచే బుజ్జగించి చెక్కుల బుణుకుచు, పెదవిపాన మిమ్మని యెట్టుబెట్టుచు, నమస్కరిం చుచు రహస్యము చెప్పెదనని ప్రియమగుమాటలను చెవిలోన చెప్పుచు, రతికొఱకు నర్మోక్తులగు సరసము లాడుచు మనయిద్దరికి వాద మెందులకు నాకు నీవు తగుదువు నీకు నేను తగుదు ననుచు యాపెతలను దగ్గరకు జేర్చుకొని మాటలచే నాపె పరవశ మగునటు లొనరించి యాపె యంగీకారమును గ్రహించి ముద్దాడినయెడల నాకన్ని యకు ప్రియము కలుగును.

శ్లో.ఇతిమృదుపరిపాట్యోత్సంగమానీయ యుంజ
న్నధికమధికమేవం యేచ్చ క్రమేణ।
నఖదశనపదైస్త్వామంకయిష్యామి వామే
నిజవపుషి వికారం కిం చ కృత్యాత్మనైవ॥

చ.ప్రియ ముదయింప బాలిక యభీష్టముగా నొకమారు మెల్లఁగాఁ
బ్రియునిమొగంబుఁ జూచి యధరీకృతవక్త్రముతోడ నున్న క
న్నియ తగునంచు దంతహతి నించిన మోవి తొలంగనాడి త
న్నయనముఁ జూచి సిగ్గువడి తా నిటు లాడితినంచు నిట్రిలున్.

తా.ఈవిధముగా యింపు పుట్ట నాకన్నియ పురుషునిమొగ మొకసారి చూచి తలవంచియుండ నాపె తగినదని యెంచి యాపె మోవి నొక్కిన యాపె కసరును. అందుల కాత డూరకయున్న తా నొనర్చినపనికి యాస్త్రీయే నొచ్చుకొనును.

శ్లో.త్వదుపజనితమిత్యావేద్య సంప్రత్యహం త్వాం
సుముఖి సఖిసమాజే వ్రీడయిష్యామి భూయః|
ప్రతివపురథ చుంబేదూరసంవాహలీలాం
క్రమశిథిలితలజ్జాం సంప్రయేన్మేఖలాం చ||

ఉ.ప్రేమ నటింప వీడియము బెట్టుచుఁ బూవులదండ లంచు న
బ్భామిని పాన్పుఁ జేరునెడఁ బయ్యెదఁ బట్టి కుచంబు లంటి యా
సీమకుఁ జేర్చి దాబిగువుచేరె వదల్చి కరంబుఁ బట్టి నె
మ్మో మలరించి కోర్కె తుదముట్టఁగనిమ్మన గారవింపుచున్.

తా.ప్రేమతో ప్రవర్తించుచు తాంబూలంబు పంచిచ్చుచు పూలదండ నిచ్చెదనని యాస్త్రీ పైటకొంగును బట్టి లాగి దగ్గరకు దీసుకొని చన్నుల నంటుకొని పాన్పుమీదికి లాగి కోకముడి విప్పి చక్కిలిగింతలు వెట్టి నాకోర్కె సఫలము కాని మ్మని పురుషుడు యాపెను యాదరింపవలెను.

శ్లో.ఉచితఘటితయత్రో రంజయేచ్చ క్రమేణ
ప్రణయవిధివిధూతే సాధ్వసధ్వాన్తరోషే|
ఇతి విషమగభీరే కన్యకానా రహస్యే
దిగియమిహ మయోక్తా కామసూత్రార్థదృష్ట్యా||

ఉ.బాలిక నీగతిన్ మృదులభాషలఁ దేర్చి నిజాంకపీఠికన్
గీలనఁ జేసి మాఱుపలికింపఁదలంచి నఖంబులన్ భుజా
మూలములందుఁ జన్నులను మోపుదునా యటుగాక వాతెరన్
నాలుగుమూఁడు దంతముల నాటుదునా యని భీతిఁ బెట్టుచున్.

తా.ఈవిధముగా స్త్రీని పురుషుడు మంచిమాటలచే లాలింపుచు తన తొడలయందు కూర్చుండబెట్టుకొని యాపె ప్రతివచనములయం దాసక్తిగలవాడై నీచన్నులయందును చంకలయందును గోళ్ళచే నొక్కుదునా? అటుగాక మోవి యందు దంతమలచే నొక్కుదునా? యని కొంచెము బెదరించినటుల మాట్లాడగా —

చ.అని వెఱపించి సిగ్గువడ నాడి ప్రియోక్తులఁ బల్కి మోవిచుం
బన మొనరించి చన్నుఁగవ బట్టి తొడ ల్గదిలుంచి నీవిబం
ధనము వదల్చి మన్మథనిధానముపైఁ జెయి సాఁచి బాలికన్
బెనఁగుట మాన్పి లజ్జ విడిపించి రమించుట శాస్త్రపద్ధతిన్.

తా.పురుషు డాస్త్రీ నావిధముగా బెదరించి యాపె సిగ్గుపడునటుల పల్కి మంచిమాటల నాడుచు పెదవి గఱచి చన్నుల బట్టుకొని యాపెతొడలు దగ్గ రకు జేర్చుకొని కోకముడి విప్పి భగమునకై చేయి చాచి యాపె పెనగులాటను మానిపి లజ్జ విడునటు లొనర్చి కామశాస్త్రపద్ధతిగా రతి చేయవలయును.

శ్లో.నాత్యన్తమానులోమ్యేన నచాతిప్రతిలోమతః|
సిద్ధిం గచ్ఛన్తికన్యాసు తస్మాన్మధ్యేన సాధయేత్||

క.నీసకియలముందట నీ
చేసినపనులన్ని నేను చెప్పెద మదనా
భ్యాసములఁ జూపి మఱి యటు
గాసిం బెట్టించి పలుచఁగాఁ జేయింతున్.

తా.నీచెలికత్తెలముందట నీవు నన్ను చేసినపను లన్నియును జెప్పి నిన్ను వారు చులకనజేయున

ట్లొనర్చెదనని కొన్నిరసవంతములగు పలుకులచే నాస్త్రీని సంపూర్ణముగా లోబరుచుకొనవలెను.

శ్లో.ఆత్మనః ప్రీతిజననం యోషితా రాగవర్ధనం|
కన్యావిశృంభణం వేత్తి యస్స తాసాం ప్రియోభవేత్||

ఆ.అల్పరతము గాక యధికంబు గాక య
బ్బాలహిత మెఱింగి బంధురముగఁ
బొందిరేని సుఖముఁ బుట్టుచు నుబ్బుచు
దినదినాభివృద్ధి తేజరిల్లు.

తా.అతిగా గాక స్వల్పముగా గాక యాబాలయిష్టము గుర్తించి యొప్పిద ముగ రతుల నొనర్చినయెడల ప్రతిదినమును సుఖించుచు ప్రేమ వృద్ధి పొందించు కొనుచు ప్రకాసించెదరు.

శ్లో.సహసా వాప్యుపక్రాంతా కన్యాచిత్తమవిందతా|
భయం త్రాసం సముద్వేగం సద్యో ద్వేషం చ గచ్ఛతి||

శ్లో.సా ప్రీతియోగమప్రాప్య తేనోద్వేగేన దూషితా|
పురుషద్వేషిణీ వా స్యాద్వద్విష్టా వా తతోఽన్యగా||

ఉ.ఈగతి బాలల న్గవయ కెంతయు నాయకుఁ డిష్టకేళికిన్
వేగముఁ జూపెనేని సతి విహ్వాలభావము భీతియు న్సము
ద్వేగము రోషము న్పొడము నప్రియ మాత్మ జనించుఁ గానఁ గా
మాగతవేదు లీరతిరహస్యము చిత్తములందు నిల్పుఁడీ.

తా.పైన చెప్పియుండినప్రకారము పురుషుడు ప్రవర్తింపక తనయొక్క సుఖముకొరకు స్త్రీని రతికి తొందఱజేసి యెత్తుడు కలుగజేసినయెడల నాస్త్రీ చం చలహృదయయై భయము పొంది పారిపోవుటయు మనస్సునందు రోషము చెంది ప్రేమలేకయుండుటయు సంభవించును కావున కామము దీర్చుకొనదలచినవారు ఈరతిరహస్యమును మనస్సునం దుంచుకొందురుగాత.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే
కన్యావిశ్రంభణం నామ
ఏకాదశః పరిచ్ఛేదః

# భార్యాధికారః
# ద్వాదశః పరిచ్ఛేదః

## పతివ్రత లక్షణము

శ్లో.యువతిరపి విహాయ ప్రాతికూల్యం స్వనాథం
వచనహృదయకాయైః పూజయేదిష్టదైవమ్।
గృహవసతిమథాసౌ చింతయేద్భర్తృవాచా
ప్రతిదినమతిమృష్టం వేశ్మ కుర్యాత్సుశోభమ్॥

శ్లో.గురుషు సఖిషు భృత్యే భంధువర్గేచ భర్తు
ర్వ్యపగదమదమాయా వర్తయేత్ స్వం యథార్హమ్।
సితపరిమితవేషం కేళీవిహారహేతోః
ప్రచురమరుణమాహుః ప్రేయసో రంజనాయః॥

సీ. వనరుహానన మనోవాక్కాయములచేత
ధవుని దైవముగాఁగఁ దలపవలయుఁ
బ్రత్యుత్తరం బీక పని యేమి చెప్పినఁ
జెవిఁ జేర్చి వేగంబె చేయవలయుఁ
నత్తమామలతోడ నాప్తభృత్యులయెడ
మాయాప్రచారంబు మానవలయుఁ
బ్రతివాసరంబు శోభనసిద్ధికై నిల
యంబు గోమయమున నలుకవలయు

గీ.నెపుడు తనుఁ జూచునో విభుఁ డిందు వచ్చి
యనుచు నిర్మలమైన దేహంబు దనర
పెనిమిటికి నిష్టమైన భోజనపదార్థ
చయము కడుభక్తితోఁ దాను సలుపవలయు.

తా.స్త్రీ తనభర్తను మనస్సునందును మాటలచేతను దైవముగ తలంపవల యును. భర్తయే పని చెప్పినను మారాడక విన్నదై యాకార్యమును శీఘ్రముగా జేయవలయును. అత్తమామలతోడను యిష్టులయిన పనివాండ్లయందును కపటము లేక యుండవలయును. ప్రతిదినమును శుభముకొఱకు ఆవుపేడచే ని ల్లలుకవల యును. భర్త వచ్చి త న్నెప్పుడు చూచునోయని పరిశుభ్రమగుశరీరముతో యుండ వలయును. భర్త కిష్టమైన భోజనపదార్థములను భక్తితో వండిపెట్టవలయును.

శ్లో.మరువక, నవమాలీ, మాలతీ, కున్ద, మల్లీ
తరుణసదృశపుష్పా వీరుధః సౌరభాఢ్యాః।
సుమధురఫలవృక్షా మూలకాలాబుభాండ
ప్రభృతివిటపకాదీనర్పయేద్వాటికాయామ్॥

శ్లో.సకృదపి కులటాభిర్యోగినీభిక్షుకాభి
ర్నటవిటఘటితాభిః సంస్పృజేన్మౌళికాభిః।
రుచిరమిదమముష్మై పథ్యమేతన్నవేతి
ప్రతిదినమపి భర్తుర్భోజనేచ్ఛాం విదధ్యాత్॥

శా.పూవుందోటల వృక్షవాటికలలో బొంపార భాండావళుల్
గావింపన్వలయున్ విదూషకనటక్రాంతాంగనాభిక్షుకన్
దైవజ్ఞన్ వ్యభిచారిణిన్ వివిధమంత్రప్రక్రియాయోగినీ
భావంగూడుట భాషణంబును నసద్భావ్యంబు భూమీస్థలిన్.

తా.వాసనగల పువ్వులనీయుపొదలను మంచిఫలములనీయు వృక్షములను కూరగాయలనిచ్చు పాదులను దొడ్డియందు పెంచవలయును. విటవిదూషకసహ వాసము జేయుకాంతను భిక్ష మెత్తుకొని జీవించుదానిని జోస్యము జెప్పుదానిని వ్యభి చరించుదానిని మంత్రతంత్ర్యాములు నేర్చిన యోగిని మొదలగు స్త్రీల యొక్క సహ వాసము చేయుటయు తుదకు మాటలాడుటయు పతివ్రతయగు స్త్రీ యొనర్పజనదు.

శ్లో.వచనమపి నిశమ్యాగచ్ఛతో వేశ్మమధ్యే
తదుపకరణసజ్జా సంవసేదాగతస్య।
చరణయుగళమస్య క్షాలయేదాత్మనాఽసౌ
రహసి చ పరిబోధ్యో విత్తనాశే ప్రసక్తాః॥

శ్లో.అనుమతిముపలభ్యాధిష్ఠితాన్యత్ర యాయా
చ్ఛయనమనువిదధ్యాద్భర్తురుత్థా నమగ్రే।
శయనమపి న ముంచేన్నాస్య మన్త్రం విభిన్ద్యాత్
వ్రతనియమవిధానవం స్వేన చాస్యానుగచ్ఛేత్॥

సీ.విభుఁడు వచ్చినరాఁక విని వేగ మెదురుగా
నింటివాకిటికిఁ దా నేగవలయు
పతి తెచ్చినట్టి దేపాటి సంగ్రహమైన
నది లోనికి న్గొంచు నడువవలయుఁ
గాంతునిచరణము ల్గడిగి పీఠముఁ బెట్టి
యనుమతి గృహకృత్య మందవలయు
నతిరహస్యములైన యాయవ్యయంబులఁ
దెలియంగఁ బతికి బోధింపవలయుఁ

గీ.బురుషు ననుమతిలేకయే పుట్టినింటి
కొక్కత యరుగుటయును దా నుడుగవలయు
వ్రతములును దానములును దైవములపూజ
లధిపునానతిఁ బొంది చేయంగవలయు.

తా.పెనిమిటిరాకను విని వేగముగా నింటివాకిటివరకు వెళ్లుటయు, భర్త తెచ్చినపదార్ధము లెంతకొద్దివైనను యవి యందుకొని లోనికి వెళ్ళుటయు, భర్త పాదములను గడిగి కూర్చుండుటకు పీఠముంచి యతిని సమ్మతిని బొంది యింటిపను లను చేసుకొనుటయు, గోప్యముగా నుంచతగిన ఆదాయములను వ్యయములను భర్తకు తెలియజెప్పుట, పెనిమిటియాజ్ఞను పొందక పుట్టినింటికి ఒక్కతెయు పోకుం డుటయు, వ్రతములును దానములును దేవపూజలును భర్తనునుజ్ఞ పొందనిదే చేయక యుండుటయు, మొదలగు నీ సద్గుణములను గలిగి పతివ్రత ప్రవర్తింపవలెను.

శ్లో.క్వచిదపి నిభృతే వా ద్వారి వా నైవతిష్ఠే
చ్చిరమథ గిరమస్మిన్విప్రియాం న ప్రయచ్ఛేత్।
న విరళజనదేశే మన్త్రయేన్నిష్కుటే వా
న పురుషమథ పశ్యాన్మన్త్రహేతుం వినా చః॥

శ్లో.సుఘటితబహుభాండం కాష్ఠమృచ్చర్మలోహైః
సమయమభిసమాక్ష్య ప్రాదదీతాల్పమూల్యాన్|
నిభృతమసులభానవి స్థాపయేద్భేషజాని
వ్యయమవహితచిత్తా చిన్తితాయాం చ కుర్యాత్||

శ్లో.తృణతుషకణకాష్ఠాంగారభస్మోపయోగం
పరిజనవినియోగం కర్మణః ప్రత్యవేక్షామ్|
ప్రియతమపరిభుక్తత్యక్తవస్త్రాదిరక్షాం
శుచిభిరవసరే తైర్మానసం భృత్యవర్గే||(పాఠాంతరము)

క.ఆయంబు కొలఁది దెలియక
సేయంగావలదు వ్యయము సీమంతినికిన్
సేయంగవలయునేనియు
నాయర్థమునందుఁ బాద మైనను నొప్పున్.

తా.పురుషునియొక్క యాదాయము తెలియక వ్యయ మొనర్పగూడదు. వ్యయము సేయవలసివచ్చినయెడల పురుషునియాదాయములో నాలుగింటనొకపాలు వ్యయము సేయుట పతివ్రతకు దగును.

మ.కసవు న్గట్టెలు నూకలు న్నుముక యంగారంపుభస్మమ్మునున్
మసలంబాయక చేర్చి దాసులకు గర్తవ్యాప్తి పాలించి దు
ర్వ్యసనంబు న్జనఁజేసి భర్త విడువన్ వస్త్రాదిసంరక్షయై
వెస భామామణి యున్న నందమవు సద్భృత్యావళిన్ శుద్ధియై.

తా.కసువు, కట్టెలు, ఊకలు, ఉముక, బొగ్గుపొడి యివి పారవేయక భద్రపరుచుటయు, భృత్యులకు పనిపాటలు చెప్పి తగినట్టు పరిపాలన చేయుటయు, పురుషుడు కట్టివిడిచినబట్టలు సంరక్షించుటయు మొదలగు సద్గుణములు గలిగి బతి వ్రత ప్రవర్తింపవలయును.

శ్లో.పరిజనపరిరక్షాం వాహచింతాం పశూనాం
కపిపికశుకశారీసారసాదేర వేక్షామ్|
గురుషు పరవశత్వం తేషు వాచం యమత్వం
స్ఫుటహసితనివృత్తిం శీలవృత్తిం చ కుర్యాత్||

శ్లో.ప్రణయసహచరీభిస్తుల్యరూపాం సపత్నీం
........................................................
గతపతి దయితే తు క్వాపి మాంగల్యమాత్రా
ణ్యుపచితగురువిప్రా ధారయేన్మండనాని||

సీ.పరిజన వాహక పశు పిక శారికా
సార సంరక్షణ సలుపవలయు
గురుజనంబులయెడఁ బరమభక్తి వహించి
చెప్పునూడిగమును జేయవలయు
సవతిపట్టున మహాసౌజన్యయై కూర్మి
సోదరిమాఱుగాఁ జూడవలయు
సవతిబిడ్డలఁ గాంచి సంతసిల్లుచు మదిఁ
దనదుబిడ్డలవలెఁ దలఁపవలయు

గీ.మగఁడు పరదేశ మరిగిన మంగళంపు
సూత్రమే కాని శృంగారమాత్ర ముడిగి
యత్తమామలచేరువయందుఁ బాన్పు
నందు శయనింపవలయుఁ గులాంగనకును.

తా.తనయింటియం దుండు పశుపక్షివాహనాదులను సంరక్షణమున శ్రద్ధతో విచారించుటయు, అత్తమామలయందు భక్తితో సంచరించుచు వారు కోరినశుశ్రూష లొనర్చుటయు, సవతియెడల నతిస్నేహ ముంచి తోబుట్టువువలె చూచుటయు, సవతిబిడ్డలను ప్రేమతో జూచి తనబిడ్డలవలె ప్రేమించుటయు, భర్తకార్యార్థి యై యూరు విడిచి వెళ్ళిన మంగళసూత్రము మాత్ర ముంచుకొని మిగిలినయలంకారము లను విడిచి రాత్రులం దత్తమామల కెదురుగా పండుకొనుటయు, పతివ్రతయగుస్త్రీ చేయందగును.

శ్లో.ఉపగురు శయనం చ స్వల్పతాం చ వయస్య
ప్రతిదినమపి కుర్యాదస్య వార్తానుసారమ్।
అనవసితవిధానేప్యస్య నిర్వాహయత్నం
వ్రతనియమవిధిం చ క్షేమసిద్ధ్యై విదధ్యాత్॥

శ్లో.స్వజనగృహము పేయాత్ ప్రక్రమే సద్వితీయా
న చిరమిహ వసేచ్చ ప్రేయసి త్వాగతే సా।
అవికృతవపుషం స్వం దర్శయేదుత్సవాదౌ
ప్రథమమపి విదధ్యాదాహ రేచ్చోపహారమ్॥

ఆ.పుట్టినింట నున్న ప్రొద్దులఁ బ్రియురాక
వినినయపుడు తొంటివేష ముడిగి
సఖులు దాను నెదురు చనుదెంచి నీరాజ
నంబుఁ జేయ నుత్సవంబు దనరు.

తా.పతివ్రతయగు స్త్రీ పుట్టినింటనున్న సమయమందు పెనిమిటి రాకను వినినతోడనే యలంకరించుకొని చెలికత్తెలతో నెదురేగి హారతినీయ శుభము గలుగును

క.పరదేశమునకు నాథుం
డరిగిన తత్క్షేమవార్ లరయుచు నాయా
వెరవున వ్రతములు దైవత
పరిచర్యలఁ జేయవలయుఁ బతిమేల్కొఱకున్.

తా.భర్త పరదేశములకు బోయినప్పుడు అతని క్షేమవార్తలను దెలిసికొ నుచు యతడు క్షేమముగానుండుటకు వ్రతములు మొదలగు దేవతాపరిచర్యలను జేయుచు పతివ్రత ప్రవర్తింపవలెను.

శ్లో.యది బహుయువతిః స్యాత్పూరుషః సామ్యవృత్తి
ర్నిపుణమతిరుపేయాన్న క్షమేతాపరాధమ్।
వపుషి వికృతిమేకాం సంప్రయోగే రహస్యం
వహతి వదతి యచ్చ ప్రేమరోషేణ కించిత్॥

శ్లో.కథమపి చ దతన్యాం శ్రావయేన్నో కదాచి
త్పుసరమపి సపత్నీగోచరే క్వాపి దద్యాత్।
యది నిగదతి దోషం కా చిదేకా పరస్యా
రహసి చ నిపుణో క్తైర్భూషణై సైవ యోజ్యా।

ప్రమదవనవిహార ప్రేమసమ్మానదానై
ర్హృదయమిహ యథార్థం రంజయేద్వల్లభానామ్||

సీ.పెనిమిటి పెక్కండ్ర వనితలఁ గైకొన్న
సమమైన వర్తన సలుపవలయు
రమణుఁ డేగతి నపరాధంబుఁ జేసిన
యె గ్గొనర్పక క్షమియింపవలయు
నేకాంతమునఁ బ్రియుఁ డిచ్ఛగించినఁ దన
సురతనైపుణ్యంబుఁ జూపవలయు
సఖునితో నొనఁగూడు సవతి గోచరమైన
కోపంబు మాని కైకొనఁగవలయు

గీ.నెట్టినిందలు సతులపైఁ బుట్టినేని
యోర్చి పలుమాఱు నుడువక యుండవలయు
వనవిహారంబులను మనోవాంఛితార్థ
దానములఁ బ్రియు ననిశంబుఁ దన్పవలయు.

తా.పెనిమిటి చాలమందిస్త్రీలతో సాంగత్యము చేయుచున్నను సహించి యుండుటయు, భర్త యేవిధమగు నపరాధము చేసినను తప్పెంచక యోర్పుగలిగి యుండుటయు, వల్లభుడు రహస్యముగోరినయెడ తనరతి నేర్పును చూపుటయు, భర్తతో కలియు సవతి కనుపించిన కోపము నొందక తనతో సమానముగా చూచు టయు, యేస్త్రీలపైనయినను నిందకలిగినయెడల నానిందను తాను మాటిమాటికిని యెంచకయుంటయు, వనవిహారములయందును యతనిమనస్సునం దిచ్ఛగించు పదా ర్థచయము నిచ్చుటవల్లను భర్త నెప్పుడును సంతోషపెట్టుటయు మొదలగు గుణము లను గలిగి పతివ్రత ప్రవర్తింపజనును.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే
భార్యాధికారో నామ
ద్వాదశః పరిచ్ఛేదః.

# పారదారికాధికరణమ్
# త్రయోదశః పరిచ్ఛేదః

## పరస్త్రీసంగమనిషేధానిషేధముల లక్షణము

శ్లో.భార్యాధికారికమిదం గదితం సమాసా
 ద్వక్ష్యామి సంప్రతి పరప్రమదాభియోగమ్।
ఆయుర్యశోరిపురధర్మసుహృత్ స చాయం
 కార్యో దశావిషయహేతువశాన్న కామాత్॥

క.పాపములనెలవుఁ బుణ్యాయ
శోపాయము విభవహాని యాయుష్యహర
వ్యాపారము నాశము పర
చాపలనేత్రల రతంబు చన దెవ్వరికిన్.

తా.పరస్త్రీగమనమువలన పాపమును, పుణ్యానాశనమును, కీర్తి నశించు టయు, అనాచారము సంభవించుటయు, ప్రాణాపాయము సంభవించుటయు, ఉద్యోగనాశనమును, మొదలగు కష్టములు ప్రాప్తించును. కాన పరస్త్రీగమనమును విసర్జించినచో పురుషుడు సుఖమునొందును.

క.ఐనను గామాతురతన్
హానియగున్ బ్రాణములకు నని మును దివిజుల్
మానక ప్రార్థనములకున్
గానిమ్మని రట్టితెరువుఁ గామాసక్తుల్.

తా.పరస్త్రీగమనమువలన నత్యంతమైనపాపము సంభవించినను కోరిన స్త్రీని రమించనియెడల నది కామాతురత కోర్వక బ్రాణత్యాగము సంభవించిన బ్రాణహత్యాపాతకము గలుగును కాన స్త్రీ తన్ను ప్రార్థించినయెడల నాస్త్రీ సంగమము తగునని కామమునందు ప్రీతిగలవా రనిరి.

వ.కావున నన్యోన్యస్నేహమోహంబులం బొందినఁగాని పరస్త్రీసంగమ దోషంబు పొరయకుండదని చెప్పెదరు. అన్యోన్యస్నేహవ్యామోహంబు లత్యంతసుఖ కారణంబులని కామశాస్త్రజ్ఞులు చెప్పెదరు. అట్లగుటకు ముందు ప్రేరణరూపం బున బుద్ధిని జలింపఁజేయు నవస్థాదశకంబు నెఱింగించెద.

## దశావస్థల లక్షణము

శ్లో.నయనప్రీతిః ప్రథమం చిత్తాసంగస్తతోథ సంకల్పః।
నిద్రాచ్ఛేదస్తనుతా విషయనివృత్తిస్త్రపానాశః॥

శ్లో.ఉన్మాదో మూర్ఛా మృతిరిత్యేతాః స్మరదశా దశైవ స్యుః।
తా స్వారోహతిమదనే యాయాత్పరయోషితం స్వరక్షాయై॥

క.చూచుట తలఁచుట కోరుట
కాచుట కృశ మౌట రుచులు గానమి సిగ్గున్
ద్రోచుట వెఱ్ఱియు మూర్ఛా
ప్రాచుర్యము మరణ మనఁగఁ బదియు నవస్థల్.

తా.చూచుట, తలంచుట, కోరుట, కాచుట, చిక్కి పోవుట, అరుచి పుట్టుట, సిగ్గు విడుచుట,

చిత్తవిభ్రమము, మూర్ఛనొందుట, ప్రాణము పోవుట, ఈ పదియు దశావస్థలని తెలియందగినది.

సీ.ఒంటిమోహమునఁ గన్గొంటిఁ జక్షుఃప్రీతి
    పలుమాఱు నది తలఁపంగఁ జింత
యుడుగనికోర్కెతో నుండుట సంకల్ప
    మొగి గుణస్థితి నిద్ర యుడిగియుంట
విరహతాపంబుచే వేఁగి డస్సియునుంట
    యరుచి యేమిటిమీఁద నాశలేమి
యెన్ని యాడెడివారి నెఱుఁగమి నిర్లజ్జ
    యున్మాదమున నింటి నొల్లకుంట

గీ.వలపు దలకెక్కి మది తన వశము గాక
పరవశత్వముచే డీలపడుట మూర్ఛ
పొందు లేకున్నఁ బ్రాణంబు పోవుననుట
మృతియు నయ్యె దశావస్థ లెఱుఁగఁజొప్పు.

తా.చూచుట యనగా, ఒంటరిగా స్త్రీపురుషులు పరస్పరమోహముచే కనుగొనుట. తలంచుట యనగా, చూచిన తరువాత యాచూచినవిషయమును మాటి మాటికి తలంచుట, కోరుట యనగా, స్త్రీపురుషులు పరస్పరమును సాంగత్యము చేయవలయునని కోరుట. కాచుటయనగా, ఒండొరులు స్వరూపస్వభావము లను దలంచుకొని నిద్రపోకయుండుట. చిక్కిపోవుట యనగా, విరహతాపాన లముచే డస్సిపోవుట. అరుచి పుట్టుట యనగా, విరహతాపజ్వరమువలన దేనిమీ దయు నాశలేకయుండుట. సిగ్గు విడుట యనగా, తమ్ము నిందించువారిని గుర్తె ఱుంగక యుండుట. చిత్తవిభ్రమ మన, వెఱ్ఱి యెత్తినట్లు యింటియం దుండుట కిష్ట పడక తిరుగుట, మూర్ఛ యన, ప్రేమ యెక్కువయై మనస్సును పట్టియుంచుట తమ వశముగాక పరవశత్వమునొంది డీలువడియుండుట. ప్రాణము పోవుట యన, సంభోగము కలుగకపోవుటవలన స్త్రీపురుషులిరువురును ప్రాణములు వదలుట. మోహము క్రమముగా నీదశావస్థలకు మూలమగునని దెలియందగినది.

సీ.మొదటియవస్థను మోహనాకారంబుఁ
    జూడంగఁ జింతించుచుండుటయును
రెంట వగపు పుట్టు రేయును బవలును
    మూఁట నిట్టూర్పులు మొనసియుండు
నాలుగింటఁ దలంచి నడిరేయి చింతించు
    నేనింట జ్వరము నే మెఱుఁగకుండు
నారింట నన్నంబు నరుచియై యుండును
    సప్తమంబున లజ్జ సరవిఁ జనును

ఆ.నష్టమమున నాలు కటు తొట్రువడియుండు
తొమ్మిదింట జీవి తొలఁగియుండు
పదిటఁ బ్రాణము చనుఁ బతికైన సతికైన
మరునిచేత నుండు నరులబ్రతుకు.

తా.చూచుట యను మొదటియవస్థయందు స్త్రీపురుషులిరువురును యొకరి చక్కదన మొకరు చూడవలెననుకొందురు. తలంచుట యను రెండవయవస్థయందు రాత్రింబగళ్లును దుఃఖము కలిగినట్లుండును. కోరుట యను మూడవయవస్థయందు నిట్టూర్పులు కలుగును. కాచుట యను నాలుగవయవస్థయందు రాత్రులయందు నిద్రజెందక యొకరినొకరు తలంచుకొందురు.

చిక్కిపోవుట యను నైదవయవస్థ యందు జ్వరము కలిగియుండును. అరుచి పుట్టుటయను నారవయవస్థయందు భోజన పదార్థములు నోటి కింపుగా నుండవు. సిగ్గువిడచుట యను నేడవయవస్థయందు క్రమముగా సిగ్గును విడుచును. చిత్తవిభ్రమ మను వెనిమిదవయవస్థయందు పలు కులు తడబడును. మూర్ఛ యను తొమ్మిదవయవస్థయందు ప్రాణంబులు హీనం బులై చలించును. మరణ మను పదియవయవస్థయందు చనిపోవుటయు సంభవిం చును. కావున స్త్రీపురుషులయొక్క బ్రతుకు మన్మథాధీనమయి యుండును.

శ్లో.పునర్దారాః పునర్విత్తం పునః క్షేత్రం పునః సుతః|
పునః శ్రేయస్కరం కర్మ న శరీరం పునః పునః||

గీ.సతియు, ధనమును, క్షేత్రము సంతతియును
మంగళం బగు కర్మలు మఱలమఱలఁ
బోయినను బొందవచ్చును పుడమిఁ దనదు
బొంది వోయిన మఱలఁ దాఁ బొందలేఁడు.

తా.భార్యా, ధనము, క్షేత్రము, సంతానము, మంగళప్రదమయిన కర్మములు, ఇవియన్నియు గతించినను మఱలమఱల సంపాదింపవచ్చును కాని శరీరముమాత్రము సంపాదింపఁజాలము.

## కామితానర్హస్త్రీలు

శ్లో.అసంగృహీతభార్యాం చ బ్రహ్మస్త్రీం యశ్చగచ్ఛతి|
సూతకం సతతం తస్య బ్రహ్మహత్యా దినేదినే||

క.భూమీసురసతిఁ గన్నెను
గామింపఁగరాదు మున్ను కామిని తన్నున్
గామించినను సుకృతముల
నీమంబును జెడును లోకనిందయుఁ దనకౌ.

తా.బ్రాహ్మణుల భార్యలను, అవివాహితస్త్రీలను కాముకులు కామింప జనదు. వారు తమంతతామే వచ్చినను పురుషులు పుణ్యాపాయమునకు లోకనిం దకు జంకి వారిని త్యజింపంజనును.

శ్లో.అద్విజభార్యావిషయః సాపి న దుష్టైవ పంచనరభుక్తా|
శ్రోత్రియసఖిసంబన్ధిక్షితిపతిభార్యా నిషిద్ధైవ||

శ్లో.పతితా సఖీ కుమారీ ప్రవ్రజితారోగిణీ ప్రకటా|
ఉన్మత్తా దుర్గన్ధా వృద్ధప్రాయా రహస్యభిత్కపిలా||

శ్లో.అతికృష్ణా నిక్షిప్తా కదాచిదేతా న గమ్యాః స్యుః|
విషయేఽగమ్యేపి బుధాః కారణతః పారదారికం ప్రాహుః||

క.శ్రోత్రియునిభార్య నృపసతి
మిత్రునియెలనాగ మామమెలఁతయును గురు
క్షేత్రం బిలఁ బొందఁ దగ ద
పాత్రంబగుఁ దామె వలచి వచ్చిననైనన్.

తా.శిష్టునిభార్యయు, రాజుభార్యయు, స్నేహితునిభార్యయు, మామ భార్యయు, గురునిభార్యయు, వీరలు కామించి పైబడినను పురుషులు కామ వశులు కాక వా రపాత్రులని

దలంపవలెను.

ఆ.మత్త పతితుచెలియ మానవిచ్ఛేదిని
కన్య సువ్రతాత్మ కపిలవర్ణ
పూతిగంధ ముసలి బూతురోగముదానిఁ
గాక యన్యసతులఁ గవయవలయు.

తా.మత్తురాలు, పాషండుని భార్య, మానహీనురాలు, ఋతుమతికాని పడుచు, నీమముగలకాంత, నల్లనిశరీరముగలది, దుర్గంధవతి, వృద్ధస్త్రీ, సుఖ సంకటములుగలస్త్రీ మొదలగు స్త్రీలను, తమ మేలుకొఱకు కాముకులు పొం దం జనదు.

## పరస్త్రీగమన హేతులక్షణము

శ్లో.మద్వైరిసంగతోస్యాః పతిరియమస్మాన్నివర్తయేదేనమ్।
మత్సంసృష్టా బలినం ప్రకృతిం వా మాం జిఘాంసుమానేత్రీ॥

శ్లో.గమనమనపాయమస్యాం మమ నిఃసారస్య వృత్తిహేతుర్వా।
మర్మజ్ఞా మయి రక్తా విముఖం మాం దూషయేదథవా॥

శ్లో.మామభిరిరంసురయమితి మిథ్యాదోషేణ కపటఘటితేన।
కర్మాస్తి మిత్రకార్యం మహదనయా వా సమాగమ్యాః॥

సీ.నాశత్రుఁ గూడె నీనాతినాథుఁడు దీనిఁ
బొందిన నది వానిఁ బొందఁజేయు
బలవంతుఁ డీనాతిపతి దీనిఁ గదిసిన
చెలువ వానికి నాకుఁ జెలిమిఁ జేయు
ధనికురా లీకాంతఁ దగిలినఁ దనసొమ్ము
చేరలకొలఁది నాచెంతఁ జేర్చు
మర్మజ్ఞురాలు ప్రేమము గల్గు నామీఁదఁ
జొరకున్న నామర్మ మొరుల కిచ్చు

గీ.దీని నేవేళఁ బొందిన దీనికతన
జాలఁదలఁచిన పనులెల్లఁ జక్కనౌను
మేలుగాకని యన్యకామినులఁ దగిలి
రతులు సల్పుదు రెటువంటిరసికులైన.

తా.తమ శత్రువులకు స్నేహితులైన వారి భార్యలను బొందిన శత్రువు లకును దమకును స్నేహము గలుగునని కొందఱును, బలవంతులైనవారి భార్యలను పొందిన బలవంతులగువారితో స్నేహము కలుగునని కొందఱును, ధనికురాలగు కాం తను బొందిన దమకు కావలసినపుడు ధనము యిచ్చునని కొందఱును, తమ మర్మ ములను దెలిసిన పరకాంతలను బొందిన తమ మర్మముల నితరులకు దెల్పకుండు నని కొందఱును, నీతిని దెలిసిన పరకాంతలను బొందిన తాము తలంచిన కార్య ములు నెఱవేఱునని కొందఱును పరస్త్రీసంగమమునకు పురుషు లిచ్ఛగింతురు.

శ్లో.ఇత్యుపలక్షణమిత్థం కారణమాలోచయన్న రాగతో యాయాత్।
కారణవిచారణసహమథవా స్వం వీక్ష్య మన్మథోన్మథితమ్॥

క.ఈకార్యంబులలోపల
నేకార్యంబును నొనర్తు రిటు గాకున్నన్

భీకరమన్మథబాణా
స్తోకాహతినైనఁ జొచ్చి దొరకొందు రొగిన్.

తా.కాముకులు పైన జెప్పియుండిన కారణములచేనైనను మన్మథబాణ ములకు లోనైయైనను పరదారాగమనమున బ్రవర్తింతురు.

శ్లో.జిగమిషుభిః పరదారా న్సిద్ధ్యాయతి వృత్త్యపాయపరిహారాః|
ప్రాగేన చిన్తనీయః లబ్ధప్రసరో హి దుర్జయో మదనః||

క.తలఁపఁగవలయును ధర్మము
తలపోయఁగవలయు వృత్తి ధనములు మొదటన్
వలరాజుఁ బిదపగెలువ
న్నలవియె? పరవనితమీఁద నాసేమిటికిన్.

తా.కాముకులైనవారలు కాంతలను గోరునెడ యాకాంతను బొందుట ధర్మమా! అధర్మమా యని విచారించి సిద్ధి, అర్థము, వృత్తి, జీవనము, అపాయ పరిహారమును విచారింపవలయును. అట్లుగాక యిచ్చవచ్చినటుల ధర్మములను దెగనాడి మేలు కీళ్లెంచనియెడల మన్మథబాధ తీరునా? బుద్ధిమంతులగువారు సాధ్యమైనంతవరకు పరస్త్రీలను వర్జించుట మేలు.

శ్లో.సప్రత్యవాయదుర్లభ నిషేధవిషయశ్చ యో విషయః|
కామః స్వభావనామః ప్రసరతి తత్త్రైవ దుర్వారః||

ఆ.తలఁపరానిచోటఁ దలఁ పెల్లఁ జేర్చిన
మరుఁడు సంతసించి మదముఁ బెంచి
యిచ్చ వుట్టఁజేయు నింతులఁ బురుషులు
చూచినపుడె వేయు సుమశరములు.

తా.కాముకులు పరస్త్రీల నిచ్చగించిచూచిన యెడల మన్మథుడు మద మును బెంచి మన్మథోద్రేకము కలుగజేయును.

శ్లో.ఉజ్వలవపుషం పురుష కామయతే స్త్రీ నరోపి తాం దృష్ట్వా|
అనయోరేష విశేషః స్త్రీ కాంక్షతి ధర్మనిరపేక్షా||

శ్లో.అభ్యర్థితా చ పుంసా నహసా న స్వీకరోతి సహజేన|
సుకృతసమయాద్యపేక్షీ ప్రవర్తతే వా నవా పురుషః||

చ.పురుషులు కామబాణహతిఁ బొంది రసస్థితిఁ గోరి వేడినన్
దరుణులు సమ్మతింపక యదల్తురు చేరఁగనీరు మెచ్చు సుం
దరతరమూర్తియైన నరుఁ దారె తగుల్కొనఁజూతురేని ని
బ్బరముగ ధర్మము న్గులము వావియుఁ జూడరు మన్మథోద్ధతిన్.

తా. కాముకులు మన్మధబాణములకు లోనై స్త్రీలను మోహించి దఱిజేరి వేడినను సమ్మతించరు. దగ్గరకు రానీయక యెంచెదరు. సుందరరూపుని తామె తగులుకొనుటకు దలంచిరేని ధర్మమును కులమును వరుసయును త్యజించియైనను వానిని పొందగోరుదురు. పురుషు లట్లుకాక ధర్మమును పూర్వాచారములను పాటింతురు. కావున పురుషుడు ధర్మనియమముడై స్త్రీవలె సులభముగ ధర్మము ను త్యజించి పరదాగమనమునకుం జొరబడడు.

శ్లో.సులభామవమనుతేఽసౌ కామయతే దుర్లభాం మృషాభియుంక్తే చ|
ఇతి నరనారీశీలం నార్యా వ్యావృత్తికారణం వక్ష్యే||

ఆ.చేరి వేఁడుకొనిన చేయీక యడియాసఁ
జూపి యపుడె యట్టి సుదతి నొక్క
పురుషుమీఁద వలపుఁ బఱపెనంచును గల్ల
నిందఁ బఱపి వెఱపు నింపవలయు.

తా.స్త్రీ తనయొద్ద జేరి ప్రార్థించినను పురుషుడు లోబడక యాస్త్రీ యొకపురుషుని మోహించెనని నింద వేసినయెడల నాస్త్రీకి వెఱపు గలిగి తన్నిక జేరదలంపదు.

## కామినులు వ్యభిచరింపకుండుటకుఁ గారణములు

శ్లో.భృశమనురాగః పత్యాపవత్యవాత్సల్యమతివయస్త్వం చ|
వ్యతికరనిర్వేదిత్వం ధర్మాపేక్షాపి కస్యాశ్చిత్||

శ్లో.భర్తురవిరహః స్వాత్మని దోషజ్ఞానం యియాసురన్యయా రక్తః|
ఇయమస్య మన్నిమిత్తా మా భూత్వీడేత్యసామర్థ్యమ్||

సీ.పతిభక్తి కలదు నాపైఁ జాలబిడ్డలఁ
గంటిగా యని యన్యుఁ గవయ దొకతె
నాపోడి మెఱిఁగినఁ జేపట్ట కధిపతి
విడుచుగా యని చేర వెఱచు నొకతె
పెనిమిటిఁ గనిన నీతనికి నాకతమునఁ
జేటు వచ్చునటంచు జేర దొకతె
యిరుగుపొరుగువార లెఱిఁగినఁ గులహాని
వాటిల్లునని చొరఁబార దొకతె

గీ.వీని నెటువలెఁ బొందుదు వీఁడు నాకు
వశుఁడు కాఁడని తమకంబు వదలు నొకతె
యిచ్ఛ గలిగిన కామిను లేమి చెప్ప
నిట్టివిధముల జారుఁ జేపట్ట రెపుడు.

తా.పతివ్రత యనిపించుకొంటిని చాలామంది పిల్లలను గంటి ననుకొని సంతృప్తి చెందునదియు, ఆవిషయము భర్తకు తెలిసిన తన్ను విడిచిపుచ్చునని భయ పడునదియు, భర్త జారుని గనిన తనవలన జారునకు ఆపద గలుగునని కీడును శంకించునదియు, ఇరుగుపొరుగువారు చూచినయెడల కులమునుండి వెలిగావలసి వచ్చునని శీలమును బ్రేమించునదియు, జారుడు తనను పొందుటకు వీలుండదని నిరాశ చెందునదియు, స్త్రీలకు జారవాంఛ యున్నప్పటికిని నీకారణములచే జారుని చేపట్టజాలరు.

శ్లో.దుర్లక్ష్యో నాగర ఇతి సుహృదతి పత్యా ప్రయుక్త ఇతి గరిమా|
ఇంగితమూఢః పలితో నీచః శుష్కాభియోగ్యదేశకాలజ్ఞః||

శ్లో.ఇతి లఘిమా సుహృదర్పితభావోఽచిత్తజ్ఞ ఇతి ఖేదః|
తేజస్వ్యనిభృతభావో జ్ఞాతా జ్ఞాత్యుర్ఝితా భవేయమితి భీః||

శ్లో.ఇచ్ఛాయామపి సత్యాం స్త్రీణాంవ్యావృత్తికారణాన్యాహుః|
ప్రథమోక్తపంచకారణవారణమనురాగవర్ధనం కార్యమ్||

సీ.సంకటములు గల్గ సామి విరక్తినిఁ
జెందుననుచుఁ దాల్మి నొందియుండు
దుర్లక్ష్యుఁడు పతిమిత్రుఁడు నాగరకుఁడగు

జారుఁ డంచును మది నొగౌరవించు
దేశకాలంబులఁ దెలియని మూఢుఁడు
పలిత నీచుండని పరిహరించు
ప్రియునిసతినగు నాప్రేమ నెఱుంగక
కామింపరాఁ డని ఖేద మొందు

గీ.కులమువారలు గాంచిన వెలి యటంచు
భయముఁ జెందియు వ్యభిచరంపఁగఁ దలఁపదు
పైనఁ జెప్పిన కారణపంచకమున
గాన వాటిని వారించి గవయవలయు.

తా.తనయొుక్క శరీరమువలనఁ బుట్టఁబడిన రోగముచే భర్త విరక్తిభావ మును జెందుననిన యసామర్థ్యమును, జారుడు నాగరికుఁడు దుర్లక్ష్యుండు భర్త స్నేహితుఁడు నని గౌరవమును, జారు డింగితమూఢుఁడు పలితుఁడు నీచుఁడు దంభాలాపి దేశకాలపాత్రంబులను తెలియనివాఁడని లాఘవంబును, స్నేహితుని భార్యనగు నన్నుఁ గోరకయుండెనే హృదయాభిప్రాయమును దెలిసికొనలేని వాడని ఖేదమును, బంధుజనాదులకుఁ దనవ్యభిచారము తెలిసిన బంధుతిరస్కారము కలుగునని భయమును, నీయైదు కారణములవలన స్త్రీ వ్యభిచరింపఁజాలదు. కాన వాటిని నివారించి యనురాగమును వృద్ధి చేయవలయును.

శ్లో.కార్యముపాయవ్యంజనమశక్తి హేతౌ, యథాయోగ్యమ్।
అతిపరిచయతో గరిమా, లఘిమా వైదగ్ధ్యభోకయోః ఖ్యాతా।
ఖేదః ప్రణతేస్త్రాసోప్యాశ్వాసనతో నివర్త్యా స్యుః॥

చ.అలయక పల్మరున్ దిరుగులాడి యగౌరవ ముజ్జగించి నే
ర్పులు పచరించి భావములు పొందుగఁ జెప్పిన లాఘవంబు చం
చలమగు ఖేదభావముఁ బ్రశాంతముఁ బొందు నమస్కరించినన్
కలభయమెల్లఁ బోవుఁ దమి గల్గిన నూరటమాట లాడినన్.

తా.స్వసామర్థ్యప్రకటనవలన కామినిహృదయమందు విశ్వాసమును గలుగ జేసి ప్రథమమైన యసామర్థ్యమును దొలంగింపజేయుటయు, అతిపరిచయము వలన రెండవదియైన గౌరవమును తొలంగింపజేయుటయు, కార్యకుశలుడు భోగి యనుభావమును తనపట్ల స్త్రీయందు కలుగచేసి మూడవదియైన లాఘవమును దొలంగింపజేయుటయు, నమస్కరించుటవలన నాల్గవదియైన ఖేదమును, ఊర డించుటవలన నైదవదియైన భీతియు తొలగింపజేసినచో స్త్రీలు వశులగుదురు.

## పురుషదూతలు

శ్లో.శూరః సముచితభాషీ రతితంత్రజ్ఞః ప్రియస్య కర్తా చ।
ప్రేక్షణకారీ సాహసరసికః ప్రోద్ధామయౌవనశ్రీకః॥

శ్లో.ఆబాల్యజాతసఖ్యః క్రీడనకృత్యాదినా జాతవిశ్వాసః।
ఆఖ్యానశిల్పకుశలః కస్య చిదన్యస్య కృతదూత్యః॥

శ్లో.అప్యగుణో మర్మజ్ఞ సఖ్యా ప్రచ్ఛన్నసంసృష్టః।
ఉత్తమయా సంభుక్తః సుభగః ఖ్యాతాన్వయశ్చ జామాతా॥

శ్లో.పరిచారః స్మరశీలః తాదృక్షః ప్రాతివేశ్యోపి।
ధాత్రేయికాపరిగ్రహ ఉద్యోగత్యాగశీలశ్చ॥

శ్లో.ప్రేక్షణరసికో వృష ఇతి విఖ్యాతః సద్గుణాధికః పత్యుః|
అభిమతమహార్హవేషాచారః సిద్ధా ఇమేనరాః స్త్రీషు||

సీ.శూరుఁడు ప్రియవాది మారతంత్రజ్ఞుఁడు
శోధకుండును సాహసుండు భోగి
యౌవనుండు ధనాఢ్యుఁ డాబాల్యముగఁ దాను
గూడంగఁ బెరిఁగిన కూర్మిసఖుఁడు
నేర్పరి విశ్వాసనీతుఁడు మర్మజ్ఞుఁ
డనుకూలప్రచ్ఛన్నుఁ డతఁడు దూత
యుత్తమాంగననైన నొడఁబాటు గొననేర్చుఁ
జక్కనివాఁడు ప్రశస్తదిక్కు

ఆ.క్రొత్తపెండ్లికొడుకు కుసుమాస్త్రశీలుండు
బంటు దాదికొడుకు పరమహితుఁడు
వలవఁదగినవాఁడు వలనింటివాఁ డిట్టి
తంత్రములకు మిగులఁ దగెడువారు.

తా.ప్రౌఢుడు, ప్రియముబలుకువాడు. కళాశాస్త్రము తెలిసినవాడు, శోధించువాడు, సాహసముకలవాడు, సుకవాసి, మంచిప్రాయముకలవాడు, ద్రవ్యముగలవాడు, చిన్నతనమునుండి కూడంగ పెరిగిన స్నేహితుఁడు, నేర్పుగల వాడు, విశ్వాసము గలవాడు, గుట్టుగలవాడు, అనుకూలముగా నడచువాడు, ఉత్తమవంశసంజాతనైనను వలలో వైచుకొనగల దేహసౌందర్యముకలవాడు, గొప్పయింటి క్రొత్తపెండ్లికొడుకు, కనుసన్నలయందు నేర్పరి, నౌకరు, దాది కొడుకు, మేలుకోరువాడు, కామింపదగినవాడు, పక్కయింటివాడు వీరలు దూతకృత్యమునకు అర్హులు.

## జారులకు వశులగుస్త్రీల లక్షణములు

శ్లో.ద్వారావస్థితిశీలా దృష్టా పార్శ్వం విలోకతే యా చ|
రమణద్విట్దుర్భగా వా నిరపత్యా నిరపరాధపరిభూతా||

శ్లో.లంఘితలజ్జా పంధ్యా గోష్ఠీశీలా మృతాపత్యా|
పరిహరతి నాపరాధేప్యభిభూతా వా వృథా సపత్నీభిః||

శ్లో.బాలా మృతపతికా యా బహుపభోగా దరిద్రా చ|
న్యూనపతిర్బహుమానా మూఢధవోద్వేగినీ కళాకుశలా||

శ్లో.జ్యేష్ఠా బహుదేవరకా ప్రోషితభర్తాఽధరీకృతా సమానాభిః|
నిత్యం జ్ఞాతికులస్థితిరీర్ష్యాళుః పతిసమానశీలా చ||

సీ.ఇంటివాకిట నిల్చి యిటునటునుం జూచు
పొలఁతి నాథునితోడఁ బోరు నతివ
గొడ్రాలు దుర్భగగోష్ఠిసమాచార
బహుభోగవనిత యా బాలవిధవ
పగలు నిద్దురపోవు పడఁతి కురూపిణి
సిగ్గులేనిది కళాశిల్పనిపుణ
విగతనాయక యవివేకి సకియ యల్ప
భోగిని మూర్ఖయు బూమెకత్తె

గీ.యత్తయును మామయు సవతియాలు దన్ను
నెపము లేకయె దండించు చపలనేత్ర
కరము మఱఁదులు నధికంబుఁ గలుగు నతివ
సురతసాధ్యలు జారలొ పురుషులందు.

తా.తలవాకిట నిలిచి యటునిటు జూచునది, భర్తతో పోట్లాడునది గొడ్రాలు, నీచమగు సల్లాపము లాడునది, వృత్తాంతములను తెలియజేయునది, మిక్కిలి భోగముగలది, బాలవిధవ, పగలు నిద్రించునది, రూపహీనురాలు, సిగ్గు విడిచినది, చిత్తరువులు వ్రాయునది, మగనిచే విడువబడినది, అవివేకుని భార్య, కొల దిభోగము లనుభవించునది, మూర్ఖవతి, వేషకత్తె, అత్త మామ సవతి వీరలు తన యందు నేరములేకున్నను నేరమును మోపి దండించుటవలన చపలముగా నుండునది. మఱదులు ఎక్కువగా కలది వీరుజారులకు వశులగుదురు.

శ్లో.కన్యాకాలే యత్నాద్వరితా వ్యూఢా కుతోపి కారణానైవ|
యా యౌవనేఽభియుక్తా ప్రకృతిస్నిగ్ధా చ యా యస్మిన్||

శ్లో.చారణవిరూపవామనదుర్గన్ధిగ్రామ్యరోగిణాంభార్యా|
కుపురుషబద్ధక్లీబప్రమదా ఏతా అయత్నసాధ్యాః స్యుః||

చ.పెనిమిటి రోగియైన మఱి పెండ్లియునాడిన కన్నెనాఁడు చుం
బనమును యౌవనంపు నునుబల్కులఁ దేలిన భృత్యునింట దా
మనఁగల దంగమంగళిత మత్తకుపూరుషుకాంత వృద్ధునం
గనయును యోగికాంతయును వల్తురు జారుఁ బ్రయత్న మేటికిన్.

తా.భర్త రోగియయినను లేక మఱియొకతెను పెండ్లియాడినను, కన్ని యగా నున్నప్పుడు చుంబనములు యౌవనపుమాటలచే పరవశమయినది, సేవకుల యింటికి చనుదెంచునది, వెఱ్ఱివానిభార్య, ముసలివానిపత్నియు, యోగాభ్యాస ము చేయువానిభార్య వీరు జారులయొక్క ప్రయత్నములేకనే మోహింతురు.

శ్లో.అంగుష్ఠాదధికాగ్రా వామపదే స్యాత్ప్రదేశినీ యస్యాః|
హీనాగ్రమధ్యమా వా స్పృశతి న భూమిం కనిష్ఠా వా||

క. కాలి పెనువ్రేలునకుఁ జెలి
వే లధికం బయిన మధ్యవేలు కృశంబై
వ్రాలిన నవ్వలివ్రేళ్ళున్
వ్రాలక నిల మోపకున్న వ్యభిచారిణియౌ.

తా.కుడిపాదముయొక్క పెద్దవ్రేలుకన్న పక్కనున్నవ్రేలు పొడుగు గా నుండినను, మధ్యవ్రేలు సన్నముగానుండి వ్రాలియున్నను, చివర రెండువ్రే ళ్ళును క్రిందికి వాలియుండక భూమిమీద మోపకున్నను యట్టికన్నె వ్యభి చరించును.

శ్లో.తదనంతరద్వయం వా కేకరదృక్పింగళాక్షీ చ|
తాం పుంశ్చలీమితి విదుః సాముద్రవిదో హసనతుణ్డీ చ||

గీ.ఓరగంటఁ జూచు నువిద, యూరక నగు
గలికి, పచ్చనికన్నులఁ గలుగుబోటి,
శాస్త్రములఁ దెల్పు వ్యభిచారిజాడ లెల్లఁ
గలుగుసతి వశ్య ముగ నని తలఁపవచ్చు.

తా.కడగంటిచూపు గలది, కారణములేకనే నవ్వుచుండునది, పచ్చని కన్నులు గలది.

సాముద్రికశాస్త్రవేత్తలచే జెప్పబడిన వ్యభిచారలక్షణములు గల స్త్రీలను వ్యభిచారిణులుగా గుర్తింపదగినది.

శ్లో.సిద్ధతామాత్మనో జ్ఞాత్వా లింగాన్యున్నీయ యోషితామ్|
వ్యావృత్తిరకారణోచ్ఛేదాన్నరో యోషిత్సు సిధ్యతి||

క.ఈలాగు లక్షణంబుల
నీలాలక జారగాఁగ నిశ్చితమతియై
వేళయుఁ గాలము నయ్యె
పాళముఁ దానెఱిఁగి విటుఁడు పైకొనవలయున్.

తా.కాముకులు పైన చెప్పియుండిన లక్షణములుగల స్త్రీలను జారిణులుగా నెఱింగి దేశకాలపాత్రల ననుసరించి ప్రయత్నము సేయవలయును.

శ్లో.ఇచ్ఛాస్వభావతో జాతా త్క్రియయా పరిబృంహితా|
బుద్ధ్యా సంశోధితోద్వేగా స్థిరా స్యాదనపాయినీ||

శ్లో.యాసాం ప్రథమం సాహసమథవా నిర్యంత్రణం వచో యామ|
తాః స్వయమభియోక్తవ్యాప్తద్విపరీతాస్తు దూతీభిః||

ఉ.ఇచ్చదనంబువల్లఁ దగనించుకదాని దృఢంబుఁ జేసి తా
నచ్చపుబుద్ధిచేత తిర మయ్యెడు లీల ఘటించెనేని యే
యొచ్చము లేక నిల్చువిటు గూరిచి సాహస మందఁజేసి తా
నచ్చట సిద్ధికై తగుసహాయము చేయుదు రిష్టభృత్యులన్.

తా.కాముకపురుషులు జారకాంతల యిష్టమును గుర్తించి వారలసంధా నమునకు తగు స్నేహితులను బంపవలెను.

## వ్యభిచారిణుల గుర్తించుట

శ్లో.స్వయమభియోగే కార్యో ప్రణయం ఘటయేదలంపటః ప్రథమమ్|
ఆకూతమదనలేఖాం దృగ్దూతీం ప్రేరయేద్బహుశః||

క.దూతికలచేత జారిణి
చేతోగతి గానరాక చిక్కనిరూపుల్
దూతికలఁ జేసి పలుమరు
నాతరుణులు చూపువగల నరయఁగవలయున్.

తా.కాముకపురుషులు దూతికలనుబంపి వారివలన జారస్త్రీలు సమ్మతిం పనియెడల నాజారస్త్రీలు చూపువగలను గాంచుచు తామే ప్రయత్నించి కృత కృత్యులు కావలెను.

శ్లో.కేశస్రంసవసంయమమంగే నిజ ఏవ కరరుహైశ్చురణమ్|
ఆభరణనాదమసకృద్ మర్దనమధరోష్ఠయోః కుర్యాత్||

శ్లో.ఉత్సంగసంగతశ్చ ప్రియసుహృతః సాంగభంగమపి జృంభేత్|
విసృజేద్గద్గదవాక్యం భ్రువమేకా ప్రహ్వాయేద్భాయః||

శ్లో.అన్యాపదేశతస్తత్కథయా సఖిభిః సమం తిష్ఠేత్|
సాదరమస్యా వచనం శృణుయాద్ బ్రూయాద్ మనోరథం వ్యాజాత్||

శ్లో.సుహృది శిశౌ వా జనయేత్తామేవోద్ధిశ్య చుంబనాశ్లేషమ్।
ఉత్సంగమంగమస్యా లఘు స్పృశేద్బాలలాలనవ్యాజాత్॥

శ్లో.బాలక్రీడనకానాం దానాదానే కథాం చ తద్వ్యాజాత్।
తత్సంవాదిని లోకే ప్రీతిం సంసృజ్య సంచారమ్॥

శ్లో.శృణ్వత్యామపి తస్యామవిదితవద్విశదమనతస్తకథాః।
కుర్యాదుత్యతి చైవం ప్రణయే నిక్షేపమాదధ్యాత్॥

సీ.తల విప్పి ముడుచుట తన శరీరము గోళ్ళ
నలముట యొడలి సొమ్మంటుకొనుట
చేరువఁ గూర్చున్న చెలికానిపై నీల్గి
యావలించుట యొయ్య నలిగికొనుట
తనుఁ గనుఁగొన్నచో దండంబుఁ బెట్టుట
యన్యాపదేశంబు లాడుకొనుట
నా మాట వినుమని నయముగా నొకరితోఁ
బలుకుట యొకనినిఁ బట్టుకొనుట

గీ.విడెము సేయుట శిశువునో రొడిసిపట్టి
తమ్మఁబెట్టుట పసిబాల నెమ్మిఁబట్టి
యందియిచ్చెడి గతి దేహ మందుకొనుట
జారగుణముల సతుల లక్షణము లయ్యెఁ.

తా.తలవెంట్రుకలను విప్పి ముడివేసుకొనును, గోళ్లతో తనశరీరము గీచు కొనును, శరీరముననున్న నగలను సరిచేసుకొనును దగ్గరగా కూర్చుండియుండు స్నేహితులపై నీల్గి ఆవలించును, అతివేగముగ కోపమును గాంచును. తనవైపునకు చూచిన నమస్కరించును, గూఢోక్తులను పలుకును, ప్రేమతో తనమాటవినవలసి నదిగా యితరులతో పల్కుచు వారిచేతిని పట్టుకొనును, తాంబూలమును వేసుకొని బిడ్డనోటియందు బెట్టును, బిడ్డను అందిచ్చులాగున నటించి ముట్టుకొనును, ఈపను లు జారస్త్రీ తాను కోరినపురుషునియెదుట నొనర్చును.

## జారస్త్రీలను సమ్మతింపఁజేయు లక్షణము

శ్లో.ప్రతిముహురహరహరథరవా యస్య గ్రహణేన భవతి సంశ్లేషః।
అథ యోజయేన్నిజైస్తాం దారైర్విశ్వాసగోష్ఠిషు॥

శ్లో.క్రయవిక్రయోద్యతాయామస్యాం స్వం యోజయేత్తదాసక్తః।
పరబుద్ధిరన్ధ్రరోధం కుర్యాత్ప్రణయానుబన్ధం చ॥

ఉ.మాటల సమ్మతింపకయ మచ్చిక చేసిన జారకాంతకున్
బేటముఁ బుట్టఁ జేయుటకుఁ బ్రేమ బయల్పడ సంచరించుచున్
బూటకుఁ బూటకున్ గుసుమపుననవగంధఫలాదు లిచ్చుచున్
జీటికిమాటికిన్ గథలు సెప్పుచుఁ గూర్మి జనింపఁజేయుచున్.

తా.జారకాంత రతికి సమ్మతించుమాటలను పలుకక ప్రీతిని గనుపరచిన కాంతకు తనపై ప్రేమ పుట్టుటకు నాపెపై యెక్కువప్రేమను కరుపరుచునట్లు సంచరించుచు పువ్వులు గంధము పండ్లు మొదలయినవి యిచ్చుచు రతిప్రయుక్త మైన కథలు చెప్పుచు తనపై యామెకు ప్రేమ కలుగునటుల జారుడు ప్రవర్తింప వలెను.

శ్లో.ఇతిహాసాదికథాయాం ద్రవ్యగుణే వా వివాదముత్పాద్య|
తత్పరిజ నైస్తయా వా వార్తాస్తాం కృతపణః పృచ్ఛేత్||

శ్లో.ఏవం ప్రణయం ప్రణయన్నింగితమాలోచయేదస్యాః|
అభిముఖనాలోకయతే లజ్జామాలంబతే ముహూర్తం చ||

శ్లో.రుచిరం న చిరం వ్యాజద్వ్యనక్తిగాత్రం, పదా భువం లిఖరి|
గుప్తం సస్మితమసకలమవిరళమథవా విలోకతే మన్దమ్||

శ్లో.భావాదంశగతం శిశుమాలింగతి చుంబతి బ్రూతే|
కించిత్స్వృష్టాధోముఖమవిశదవర్ణక్రమం స్మితప్రాయమ్||

శ్లో.వదతి తదన్తికసంస్థితిమనుసరతి వ్యాజతో దీర్ఘమ్|
మాం పశ్యత్వితి భావాద్యత్కించితద్వ్యాహరత్యుచ్చైః||

సీ.ఇతిహాసములలోన నేకథ లడిగినఁ
గొనకొని తనదు సద్గుణమె చెప్పు
సుందరీమణి తను జూచిన కనుఱెప్ప
వెట్టక నెమ్మోముఁ బెగడఁజూచు
లజ్జఁ బొందినదానిలాగున నొక్కింత
తలవంచి కాలు భూతలము వ్రాయు
నేమోమొ పనికినై యెవ్వరో పిల్చినా
రని తల యెత్తి యావలను జూచు

ఆ.నవ్వొకింత సలిపి నయమునఁ గన్నెత్తి
చూచి పిన్నవాని చుంబనంబుఁ
జేసి కౌఁగలించి వాసియౌ పలుకులఁ
గొంతకొంతజారకులము వలుకు.

తా.ప్రబంధములలోని యేకథ చెప్పుచున్నను యందున్న సద్గుణములు తన గుణంబులతో బోల్చుచు, విటుడు తను చూచిన కనురెప్ప వేయకయే యతని మొగము చూచుచు, సిగ్గుపొందినదానివలె కొంచెము తల వంచి భూమిపై పాదముతో వ్రా యుచు, ఏపనికో ఎవ్వరో తనను పిలిచినటుల తలయెత్తి విటునివైపునకు కాక నింకొకవైపునకు చూచి చిరునవ్వు కనబరచి విటుని మొగము చూచి దగ్గరనున్న కుర్ర వానిని ముద్దుబెట్టుకొని కౌగలించుకొని మర్మోక్తులను మాట్లాడును. ఇట్టిపనులు జారిణులు తాము ప్రేమించు జారులను గాంచునప్పు డొనర్తురు.

ఉ.నమ్మిక చేయునట్లు తననాతుకఁ బంచి విశేషగోష్ఠితా
నిమ్ముగఁ జేసి ప్రీతిమెయి నెంతయు నాత్మనివాసభూమికిన్
రమ్మని పిల్చి తెచ్చి ప్రియురాలును దానును నన్యపుష్పగం
ధమ్ములు వెట్టి యన్నయును దమ్ముఁడటం చనివావిసేయుచున్.

తా.పురుషుడు తాను మోహించిన కాంతయొద్దకు తనయొక్క భార్యను బంపి దానితో యెక్కువస్నేహము చేయించి తనయింటికి పిలిపించుచు వచ్చిన పుడు పుష్పములు మొదలగువాసనద్రవ్యముల నిచ్చుచు నాపెభర్తను యన్న తమ్ముడను వరుసలతో బిలుచుచు తనయందు ప్రేమ పుట్టునట్లు సంచరింపవలెను.

శ్లో.పశ్యతి యత్ర సదాసా తత్ర కథావ్యాజమాచరతి|
తద్దత్తం వహతి సదా కిమపి సమీక్ష్యాన్తికో హసతి||

క. ఏసొమ్ము జారగనునో
యాసొ మ్మమ్మనటులఁ గొనియరుగం దానిం
కాసొమ్ములఁ గని జారిణి
వేసర నాత్మీయ మనుచు వివరింపఁగనున్.

తా.జారిణికి యెసొమ్ముయం దిష్టమో యాసొమ్ము నమ్మువానివలె యాపె వద్దకు జన యాపె యాతనిని జూచి తనమన స్సెఱింగి ప్రవర్తించువాడని యిష్ట పడును.

శ్లో.న దదాతి తస్య దర్శనమనలంకారాథ యాచితా తేన।
వితరతి సఖ్యా హస్తే కుసుమపీడాది సాలస్యమ్॥

శ్లో.నింశ్వసితి తిర్యగాలోకయతి విమృద్నాతి పాణినా స్వకుచమ్।
సంయచ్ఛతే చ వసనం కరశాఖాస్ఫోటనం కురుతే॥

శ్లో.ద్వ్యర్థం వదతిసలజ్జం జనయతి జృభానిహన్తి కుసుమాద్యైః।
రుచిరం రచయతి తిలకం సఖ్యాఃశ్రోణీం చ సంస్పృశతి॥

శ్లో.తారం కాసతి కేశాన్ముంచతి తద్వేశ్మ గచ్ఛతి వ్యాజాత్।
కరచరణాంగుళివదనే స్విద్యతి సమ్మార్ష్టి భుజవల్ల్యా॥

సీ.ప్రియునిసద్గుణములు ప్రేమయు రెట్టింపఁ
బడఁతి దూతికలతోఁ బ్రస్తుతించు
శృంగారవతిగాక చెలువుని జూడదు
సఖిచేతఁ బుష్పసంచయముఁ బంపు
నుసురసురనుచు నిట్టూర్పులు నిగుడించుఁ
దనచన్నుగవ దానె తలఁగఁబట్టు
లలికటాక్షము దిక్కులఁ బరామర్శించుఁ
జిలుకనాథునికంటు జిట్ట విడుచు

గీ.పలుక లజ్జించుఁ బువ్వుల బట్టికొట్టు
పిఱఁదు ముట్టును దిలకంబుఁ బెట్టు సతిని
జూచు తలవిచ్చివానిల్లు చొరఁగఁజూచు
జార జారునిపొడ గన్న సంభ్రమించు.

తా.తాను ప్రేమించినవాని మంచిగుణములనుగూర్చి దూతికతో పొగ డును, శృంగారము చేసుకొని ప్రియునికి కనిపించును. దాసిచే పువ్వులు పంపును ప్రియుసంగమ మెప్పుడు కలుగునాయని నిట్టూర్పులు విడుచును, మోహము బయ ల్పడ తనచన్నుల నదుముకొనును, క్రీగంట దిక్కులను పరికించును, ప్రియునితో మాట్లాడుటకు సిగ్గుపడును, విలాసముగా పువ్వులతో నాతని కొట్టును, బొట్టు పెట్టుదానిమొగము పరికించును. ప్రియునిగృహమున కేరీతి పోవుదునాయని తల పోయును. యాతనిని చూచి సంతోషించుచుండును.

క.కరచరణాంగుళవదనాం
బురుహంబు లొకింతచెమట పొడమినఁ దుడుచున్
దరుణీమణి జారుఁడు తను
బొరిపొరి వీక్షింప నలుకఁ బొడమున్ దెలియన్.

తా.తనమొగమునందుగల చెమటను చేతివ్రేళ్ళతో తుడుచును, ప్రియుడు తన్ను మాటిమాటికి కాంచుచున్నయెడల కార్యభంగము కలుగునని యతడు తెలుసు కొనునట్లు కోపించును.

శ్లో.ఉత్సంగసంగతా చ ప్రియసఖ్యా వివిధవిభ్రమం తనుతే|
ప్రీతిం ద్యూతం చ కథాం తత్పరిచారై సమం కురుతే||

శ్లో.తత్పరిజనాశ్చ శృణుతే తస్య కథాం స్వమిత తం సమాదిశతి|
విశ్వసితి తస్య సఖిసు స్నేహత్తద్వాచమాచరతి||

ఉ.ఈగతి నున్న జారునకు నింగితభావము మాన్పి వేఁడి యు
ద్యోగిని దత్సమీపమున నుండి ప్రసంగము సేయుచు న్మనో
రాగుఁడు చూచె ని న్ననుచు రంజిలఁజేయు తదీయదూతిహ
స్తాగతరత్నభూషలు క్రియాళి గదల్చి వచించి మ్రొక్కుచున్.

తా.ఈవిధముగానున్న జారునకు తనభావము నర్మోక్తులతో నెఱింగించి వేడుకొనుచు నాతనికి కనుపించునంతచేరువగా నుండ నీప్రియుడు నిన్ను చూచు చుండెననుపల్కు చెలికత్తెను బెగ్గఱగా మాట్లాడవలదని మ్రొక్కును.

క.నవ్వుచుఁ జేరువనుండిన
జవ్వని యే మేనిబలుక సన్నలు సేయున్
దవ్వుననుండి దూతిక
నివ్వటిలున్ బలుకఁ బ్రియము నేరుపు లొలయన్.

తా.జారులు చేరువనుండినయెడ హావభావములచే తమకోర్కె నెఱిం గింతురు. అట్లుకాక దూరముననుండిన దూతికలమూలమున నెఱింగింతురు.

శ్లో.కతి యువతయోఽస్య భవ్యాః కతమాః కస్యామసౌ సదారమతే|
ఇత్యాది తస్య లోకం పృచ్ఛతి నిభృతే చ సాకూతమ్||

క.పెక్కండ్రుకామినులు గడుఁ
జక్కనివారుండ నాదు సాంగత్యంబున్
మక్కువఁ జేసియు నాతం
డక్కరపడెనా యటంచు నడుగున్ బ్రీతిన్.

తా.చక్కనిస్త్రీలు చాలమంది యుండ నాకూటమి నతడు గోరి నిన్ను పంచెనా యని ప్రియుడు పంపినదూతి నడుగును.

శ్లో.ఇతి దర్శితేంగితాయాం సశ్లేషం స్పష్టకాదినా యుంజ్యాత్|
అకలితమంబువిహారే స్తనజఘనం సతిస్పృశేదష్యా||

ఉ.జారిణి యింగితంబు సరసజ్ఞుఁడు కాంచి తదీయసంగతుల్
గోరి పయోవిహారమున గొమ్మలతో నొనగూడి యెవ్వరున్
జేరనివేళఁ బట్టెఱుఁగఁ జేసి నితంబకుచస్థలంబు లో
య్యారముతోడఁ బట్టి యొకయందము చూపుట జారుచందమౌ.

తా.ఈవిధముగా కాముకపురుషుడు జారస్త్రీయిచ్ఛ నెఱింగి యాపె స్నానమునకై యొంటరిగానున్న సమయమును దెలిసికొని యాపెను డాసి చనులను పిఱుదులను బట్టి కౌగలించి ప్రేమను గనుపరచవలయును.

శ్లో.అవతార్య కామపి రుజం వార్తావ్యాజేన తత్ర నీతాయాః|
ఆలంబ్య పాణిమస్యాః శిరసి దృశోః స పులకం దద్యాత్||

ఆ.దొడ్డతెవులు పుట్టఁ దొయ్యలి నీచేత

నమృతముండు జమరు మనిన కన్ను
దోయి మస్తకంబుఁ దొలుతనె ముట్టఁగఁ
బులకలెత్తు జారపురుషునకును.

తా.కాముకుడు నాకొకవిధమగు జబ్బుకలిగినది. నీ చేతియం దమృత ముం డునుగాన నన్ను ముట్టుమన నాజారిణి యతని కన్నులను శిరస్సును ముట్ట నాతని శరీరము గగుర్పొడుచును.

శ్లో.అనురాగపేశలం చ బ్రూయాదుభయార్థమీదృశం వాక్యమ్।
శమయ మమ సుముఖ! పీడాం కలయ నిమిత్తం త్వమేవాస్యాః॥

శ్లో.సుతను! మదనాదరోఽయం యుక్తం కిం త్వద్గుణస్య ఫలమ్।
ఇత్యౌషధాదిపేషణవిధిషు వ్యాపారయేదేనామ్॥

శ్లో.సనఖస్పర్శం కుర్యాద్దానాదానం చ పూగకుసుమాదేః।
కరజరదనపదలాంఛితమస్యై పర్ణాదికం దద్యాత్॥

శ్లో.అథ సన్నిధాప్య రహసి ప్రౌఢాశ్లేషాదిసుఖరసం విన్ద్యాత్।
సుచిరమనోరథసంచితమన్మథగురుదీక్షయా క్రమశః॥

ఉ.సుందరి నీకనుంగొనలఁ జూచిన రోగము మాను నాకు నా
మందును నూరి యిచ్చి యది మాన్పుము నాయెడ నాదరంబు సే
యందగుఁ జేయకున్న ఫల మయ్యది తేటగునంచు జారుఁ డీ
చందము మాటలాడు రతిసంజ్ఞలుగాఁ బరకాంతతోడుతన్.

తా.నీకన్నులతో నన్నేరగా చూచిన గాని నాకు కలిగిన మదనజ్వరము మాననట్లున్నది. ప్రీతితో నామందు యిచ్చి నారోగమును మాన్ప సమర్థురాలవు నీవే సుమా. నీ వట్లొనర్పనియెడల నందువలన గలుగు ఫలమును నీవు కాంచగలవు. అనగా ప్రాణములు పోవునని జారిణితో గూఢోక్తులను బల్కును.

ఉ.ఆకులు పోకలున్ గిసలయాదులు కొమ్మని యందియిచ్చుచోఁ
జేకొనఁగోరనంటి మఱి చిత్రనఖక్షతదంతలాంఛనా
స్వీకృతవల్లికాదిదళచిహ్నము లిచ్చి రహస్యమైనచోఁ
జేకొని కౌఁగిలించి సుఖసిద్ధికి దీక్ష యొనర్చు నయ్యెడన్.

తా.జారుడు జారుణికి తాంబూలమునిచ్చుచు యాపెకరమును బట్టి దగ్గ అకు జేర్చుకొని నఖక్షతదంతక్షతాలింగనాది బాహ్యరతు లాచరించి రతి కుపక్ర మించును.

శ్లో.నిబిడతమసి నిశి నార్యో వ్యవసితరతయో భవన్తి రాగిణ్యాః।
అభియుక్తాస్తత్కాలే త్యజన్తి పురుషం న తాః ప్రాయః॥

ఆ.కౌగలింతసుఖము గని జారకామిని
యతి రహస్యకాంత నరసి దూత
చేసిపుత్తు నెల్లి చీకటిరేయిని
బయలుసేయవలదు పట్టపగలు.

తా.జార జారుని కౌగలింతసుఖ మనుభవించి యిప్పుడు పగలు కావున రతికాలముకాదు, రేపురాత్రి దూతికవలన వర్తమానము పంపెదననియు రతి కుపక్రమించవలదనియు బ్రతిమాలును.

## సంకేతమున కుపయుక్తముకాని స్థలములు

సీ.ముసలియౌ కామిని యొసఁగెడిచోటును
వేల్పుసానిగృహము వీడుపట్టు
జారసతీగోష్ఠి జరుగుకామినికొంప
దుర్జనప్రియమైన దూతిగృహము
వీధికొండెముఁజెప్పు వెలఁదిగేహంబును
జూదలియిలు దరిచోటినెలవు
యగసాలివాని నెయ్యంబైన గుడిసెయు
మంతురసానిదౌ మనికిపట్టు

ఆ.కలుత్రాఁగుపొంత కలుషాత్ములమఠంబు
లంజెవాడయందు లాస్యకాంత
మందిరములు కావు మర్మకర్మప్రీతి
జరుగు జారపురుషసంగతికిని.

తా.ముసలిదియయ్యు కామము ననుభవించుస్త్రీ యిచ్చెడిచోటును, బోగముదానియిల్లు, జనసమూహముతిరుగుచోటు, జారస్త్రీలు గుంపులుగూడి మాటలాడుకొనుయిల్లు, దుష్టులకు ప్రియురాలైన దూతికయిల్లు, వీధివారిపై కొండె ములు చెప్పుదానియిల్లు, జూదమాడువాని యింటిపొరుగున, స్వర్ణకారునికి ప్రియ మగుయిల్లు, మంత్రసాని నివసించుచోటు, కల్లుత్రాగుట కేర్పడినయిల్లు, పాపా త్ముల మఠము, భోగమువీధి, నృత్యము చేయుదానియిల్లు, యివి జారస్త్రీపురుషుల సంబంధములకు దగని తావులు.

శ్లో.వృద్ధాఽనుభూతవిషయా యత్ర వసేత్తద్విదూరతో వర్జ్యమ్।
యత్రైకామభియుంక్తే తత్రాన్యాం లంఘయేన్నైవ॥

గీ.ప్రౌఢ యగుకాంత నివసించు ప్రాంతమందు
నేది గొప్యంబుగా నుండఁబోదు మఱియు
నొకతె భోగించునెలవు నింకొకతె చేరి
క్రీడ యొనరింప నెప్పుడుఁ గూడరాదు.

తా.ప్రౌఢాంగన నెలవు చరువ రహస్యగోపనము కలుగదు గాన నటఁ జేర రాదు. ఒకతె భోగించుతావున నింకొకతెఁ గూడరాదు గదా!

శ్లో.అభియోగే సతి నార్యా భావపరీక్షా ప్రయత్నతః కార్యా।
యది గృహ్ణాత్యభియోగం రతిభావం న ప్రకాశయతి॥

ఆ.దూతిఁ బిలిచి తలఁపురీతి యెఱింగింప
నదియు దానిభావ మరసికొనుచు
నియ్యకొని రహస్య మెవ్వరు నెఱుఁగక
యుండఁజేసె నేని యుత్తమంబు.

తా.జారస్త్రీ దూతికను రహస్యముగా పిలిచి తన మనస్సులోని సంగతి యెఱింగింప అది దాని యిష్టము నెరవేర్పనిష్టపడి యితరులకు తెలియనీయక యొనగూర్చిన దూతికాభావ ముత్తమము.

శ్లో.దూతీసాధ్యాం విద్యాదభియోగం యాతు నాదత్తే।
సంగృహ్యతే చ దోలాయితచిత్తా సాధ్యతే క్రమశః॥

గీ.సమ్మతిని జూపఁజాలనిసతిని విటుఁడు

దూతివలన ప్రయత్నింప దొరయఁగలదు
అతివ డోలాయమానస యైనయెడలఁ
దానె వశ మగు నిష్టము దాచియున్న.

తా.అంగీకారముఁ జూపని కామినిని దూతికవలన గ్రహించవలయును. అంగీకారమును బ్రకటించుపట్ల డోలాయమానమానసయగు స్త్రీ తనకుఁదానే జారునివశమగును.

శ్లో.అగృహీత్వాప్యభియోగం సవిశేషాలింగితం వివిక్తేయా|
ధీరా దర్శయతి స్వం గ్రాహ్యా మాహుర్బలేనైనామ్||

గీ.విటునికోర్కెఁ దెలిసి వీలుచేయక యుండి
యొంటిపాటు జిక్కియున్నతఱిని
సరసమాడుచుండుచానను జారిణి
యనుచు దెలిసి బల్మి నంటవలయు.

తా.తాత్కాలికాంగీకారమును జూపకపోయినను నేకాంతప్రదేశమం దాలింగనాదిభావప్రకటనములను జూపినస్త్రీని బలాత్కారముననైన జారుఁడు గ్రహింపందగును.

శ్లో.మిలతి సహతేఽభియోగం ప్రణయచ్ఛేదేన సా సాధ్యా|
పరిహరతి యాఽభియుక్తా న మిలతి పునరాత్మగౌరవతః||

గీ.కోరిపైఁబడు సతిని దాఁ గూడవలయు
ప్రేమ యున్నట్లు నటియించి విటునివశము
కాకయుండెడిసతి యాత్మగౌరవంబు
కల ద టంచు నాయువతిని వలచవలదు.

తా.ఎవ్వతె కోరఁబడినదై లభించునో జారుఁ డామెను బ్రేమింపంజనును. ఎవ్వతె కోరఁబడియును జారునివశ మగుట కిష్టపడదో యాపె యాత్మగౌరవకాం క్షిణియని జారు డెంచి విసర్జింపవలయును.

శ్లో.నచ నాయకగౌరవతః ప్రత్యాదష్టేఽతిపరిచయాత్సాధ్యా|
ప్రత్యాదిశ్య కరోతి ప్రీతిం యా సా మాసాధ్యైవ||

గీ.ధవునిగౌరవమును మదిఁ దలఁచి విటుని
పొందని నెలంత పరిచయంబున నడంగు
కోరికెను దీర్పఁ దెగడియుఁ గూర్మిఁ జూపు
పొలఁతి వశ మగు నని నెంచవలయు విటుఁడు.

తా.ఎవ్వతె భర్తగౌరవమును మనమునం దుంచుకొని వ్యభిచరింపదో యాపె నతిపరిచయమువలన జారుఁడు పొందవలెను. తిరస్కరించియుఁ బ్రీతిని జూపుస్త్రీ సాధ్యమగునని తలంపవలయును.

శ్లో.ఆకారితా చ సూక్ష్మం వ్యజ్ఞయతి స్పష్టముత్తరం సిద్ధా|
యా స్వయమాకారయతి ప్రథమం సా ప్రథమసిద్ధైవ||

గీ.నర్మగర్భములను బల్కునాతి ప్రీతిఁ
దెలసి యాపెను గూడంగ వలయు విటుఁడు
ఎవతె జారునిపైఁ బ్రీతి నెంచె మొదలఁ

గూర్మిఁ జూపి తనంతఁ దాఁ గూడు నాపె.

తా.ఎవ్వతె పరులకుఁ తెలియకుండునటుల నర్మగర్భములైన పలుకులతో స్పష్టమగు ప్రత్యుత్తరములను బ్రచురించుచున్నదో యాపె జారునకు సాధ్యురాలు. ప్రప్రథమమునఁ దానే జారుని వలచుచో యాపెయే జారునికిఁ బ్రథమమున వశు రాలగును.

శ్లో.ధీరాయామప్రగల్భాయాం పరీక్షిణ్యాం చ యోషితి|
ఏష సూక్ష్మోవిధిః ప్రోక్తః సిద్ధా ఏవ స్ఫుటాః స్త్రియః||

ఆ.పైనఁ జెప్పి నట్టిభావము ల్సరసులు
బాల ముగ్ధలందుఁ బరుపవలయు
భావవిస్ఫుట మగుభామలయెడ నిట్టి
శ్రమము లేక వశ్య మమరఁగలదు.

తా.సూక్ష్మమగు నీయింగితాకారచేష్టాపరీక్షావిధానమును గంభీరప్రకృతి గలిగిన బాలలయందును, ముగ్ధలయందును మాత్రమే చెప్పఁబడినది. విస్ఫుటమైన భావముగల స్త్రీలు పైనఁ జెప్పంబడిన పరీక్షాదికవిధానములు లేకయే జారులకు స్వాధీనమగుదురు.

## దూతికాముఖ్యలక్షణము

ఉ.ఎవ్వతె గారవంబున నహీనమతిన్ జరియించు మాటలం
దెవ్వతెయు తరంబుఁ దగనియ్యఁగ జాలుఁ బ్రియానుకూలయై
యెవ్వతె ధీరప్రౌఢగతి నింగితభావము నిర్వహించు నా
జవ్వని దూతి చేసినను సాధ్యమగు న్బరదారికారతుల్.

తా.ఎవ్వతె గొప్పబుద్ధి కలిగియుండునో, ఎవ్వతె ప్రియుల కనుకూలనుగు మాటలను జెప్పగలదో, ఎవ్వతె జారులయొక్క మనస్సులను దెలిసికొనునో, అట్టి కాంతను దూతికగా నొనరించినయెడల పరస్త్రీలు సాధ్యులగుదురు.

శ్లో.దూతీవిధేయమధునా యాదృగ్వక్ష్యామి తదపి సంక్షేపాత్|
ప్రథమమతిశీలయోగాదాఖ్యానాద్యైర్విశేషయేదేనామ్||

శ్లో.శ్రుతసౌభాగ్యదమన్త్రౌషధికావ్యరతిరహస్యానామ్|
ఘటయేత్కథాప్రసంగాన్ బ్రూయాద్వశ్వాసముత్పాద్య||

శ్లో.రూపకళావిజ్ఞానం శీలే క్వ తవ క్వ చాయమీదృశో భర్తా|
ధిగ్దైవముచితవిముఖం తారుణ్యం తే విడంబయతి||

శ్లో.ఈర్ష్యాళురకృతవేదీమ్మృదువేగః శాఠ్యవసతిరవివిదగ్ధః|
దాసోపి తేన యుక్తః పతిరమయాః కష్టమిత్యాద్యైః||

శ్లో.పతిదూషణగణవచనైర్వైరాగ్యం లంభయేదేనామ్|
యస్మిన్నుద్విజతే సా దోషే భూయస్తమేవ పల్లవయేత్||

సీ.మొదలనింటికిఁ బోయి ముదిత సంశీలవృ
త్తాచారములగూర్చి యభినుతించి
రతిరహస్యాదికార్యంబులు వాక్రుచ్చి
సౌభాగ్యకరమంత్రసమితి యొసఁగి
యౌషధమణు లిచ్చి యంతటఁ దనయెడ
నమ్మికఁ బుట్టించి నాతిఁ జేర్చి

నిరుపమసత్కళానిపుణభావమునకు
దైవ మీతని నెట్లు ధవునిఁ జేసెఁ

గీ.గోపకాఁడు కృతఘ్నుండు గుణవిహీనుఁ
డల్పరతుఁడును మూఢుఁడు నైనవాని
బెనిమిటిని నీకెట్టు ప్రియము పుట్టుఁ
దరుణి కొరగాదు నీచక్కఁదనమునకును.

తా.కాముకపురుషునిచేత పంపబడిన దూతిక కాముకపురుషుడు కోరి యున్న స్త్రీయింటికి జని యాపె యాచారవ్యవహారములను గూర్చి యాపెను స్తుతించి స్నేహము చేసుకొని రతిరహస్యకార్యములను బోధించి సంపత్కరమగు మంత్రోపదేశముల నొనర్చి కొన్నిమందు లిచ్చి తనయం దాపెకు నమ్మికగలుగునటుల ప్రవర్తించి, తరువాత నీరూపురేఖావిలాసచాతుర్యములకు దైవము తగినభర్త నొనరింపకపోయెను. నీభర్త ముక్కోపి, కృతఘ్నుడు, గుణవంతుడు కాడు, మూ ఢుడు, అల్పరతుడు, ఇటువంటి మగనితో పొందు నీ కేమంతప్రియము? నీ చక్క దనమునకుమాత్ర మతడు మగ డగుటకు తగడు.

క.ఈలాగున సతి వినుతియు
నాలోనవె మగనిదూషణాలాపములన్
బోలిచియుఁ దాల్మినిలుకడఁ
దూలిచి పతి రోయఁజేయు దూతిక మఱియున్.

తా.దూతిక యీవిధముగా నాస్త్రీని స్తుతించి దానిభర్తను నిందించి దానికి దానిపెనిమిటియందు రోతకలుగునటుల చేయును.

శ్లో.నాయకగుణగణభణితిం కుర్యాదేవం ప్రసంగేన|
ఉత్పాద్య సామవస్యం బ్రూయత్సుభగే శ్రుణుస్వ యచ్చిత్రమ్||

శ్లో.చిత్రం కిమపి వ్యతికరమాసౌ యువా కుసుమసుకుమారః|
దృష్టిభుజంగీదష్టస్తవ సఖి సన్దేహమారూఢః||

ఉ.జారునిరూపరేఖలు ప్రసంగముఁ జేయఁదలంచినప్పు డా
వారిరుహాస్య కిట్లనును వామవిలోచన యొక్కచిత్రమే
చేరువఁగంటి నొక్కయెడఁ జిత్తరూపుఁడు యౌవనుండు నా
తారవిలోచనాహితముదంబును జేసె నటంచుఁ జెప్పఁగన్.

తా.అనంతరము దూతిక జారపురుషుని రూపురేఖావిలాసములయొక్క ప్రసంగము చేయదలంచి దానితో నేను నీవద్దకు వచ్చువప్పుడు ఇక్కడకు చేరు వగా నొకచోట మన్మథునివంటి చక్కనిపురుషుని నాకన్నులు కరువుదీర చూచితిననును.

శ్లో.శ్వసితి స్విద్యతి ముహ్యతి సన్తపస్తస్యకోపి దుర్వారః|
త్వన్ముఖచన్ద్రసుధారసమప్రాప్య ప్రాణితానాసౌ||

శ్లో.స్వప్నేఽపి తస్య సుభగే! కదాపి నేదృగ్వికారోఽభూత్|
ఇత్యుక్తే యది సహతే పునరపరేద్యుః సమేత్య సంకథయేత్||

ఉ.తాపము పొందు లేఁజెమటఁ దాల్చును దేహము, నిద్రఁబోవ నా
రూపముదోఁచిన న్జెదరు రోజు తదీయముఖేందుసౌధధా
రాపరిషేచనంబు తనప్రాణసఖిన్ గనుఁగొన్న నాత్మస
ల్లాపము లుజ్జగించుటకుఁ దన్విచనున్ మఱివచ్చువేఁకువన్.

తా.దూతిక చెప్పినపురుషుని మోహించి యాస్త్రీ పరితాపమును పొందును, దేహమున జెమటపట్టును. నిద్రించుసమయములయం దాతని కలల యందు గాంచి బెదరును. నాత డెక్కడైనను కనుపించునాయని సౌధభాగముల యందుండి చూచును, దూతికవలన నాతని ప్రసంగములను వినజనును.

శ్లో.వృత్తమహల్యాదీనాం శ్లాఘ్యం స్త్రీసంగమభియోక్తుః|
ఏవం ప్రయుజ్యమానే లక్షయితవ్యస్తదీయ ఆకారః||

శ్లో.దృష్ట్వా బ్రవీతి సస్మితమన్తిక ఏవోపవేశయతి|
పృచ్ఛతి భోజనశయనే ఆఖ్యానం దిశతి రహసి వా మిలతి||

క.ఏకాంతంబున నొయ్యన
నాకామినితోడ మాటలాడుచుఁ బూర్వ
శ్లోకములు కథలు చదువుచు
వాకొను దాసురమునీంద్రవర్తనగతులన్.

తా.ఈవిధముగా యాస్త్రీ తిరుగుచుండ దూతిక యేకాంతమున దానితో మాటలాడుచు పూర్వము జరిగిన రంకుకథలను జెప్పుచు దేవతలు మునులు జారత్వ మున బూర్వము సంచరించినారు కనుక జారత్వమున దోషము లేదని తెలుపును.

సీ.గౌతమమునిరాజకాంత గాదె యహల్య
దేవేంద్రుతోఁ గోర్కె తీర్చుకొనియె
నాదిత్యగురుపత్ని కాదె తారాదేవి
శిష్యుఁ జంద్రునిఁ బ్రియుఁ జేసికొనియె
దాశరాజతనూజ దాఁ గాదె యోజన
గంధి పరాశరుఁ గవిసిమనియెఁ
బరమపావని కాదె భాగీరథీదేవి
శంతనుతో రతి సల్పుకొనియె

గీ.ద్రౌపదీకాంత కేవురు ధవులు కారె
గొల్లెతలు కృష్ణుతో నొనఁగూడి మనరె
కానఁ దొల్లిటివారును గవిసినారు
జారుఁ బొందిన నేమి దోషంబు సతికి.

తా.ఆహల్య యింద్రుని పొందలేదా, తార చంద్రునితో కలియలేదా? యోజనగంధియగు దాశరాజు కుమార్తె పరాశరుడను మునిని పొందలేదా? పరమ పవిత్రమగు గంగ శంతనుని పొందలేదా? ద్రౌపతికి యైదుగురు మగలుగదా? గోపికలు కృష్ణునితో సుఖింపలేదా? పూర్వకాలపువారగు యట్టిమహనీయులే పరదారాగమనంబు దోషంబులేదని కూడినపుడు మనకుమాత్ర మేమిదోషము గలదని తెల్పును.

శ్లో.నిఃశ్వసతి జృంభతే వా స్వవిత్తమస్యై దదాతికించిద్వా|
యాస్తీమేష్యసి పునరితి పదతి, కథం సాధువాదినీ భవతీ||

శ్లో.సక్తి కిమప్యసమంజసమిత్యుక్త్వా తత్కథా భజతి|
కిన్న కరోమి వచస్తవ కిన్తు శఠోఽసావతీప మే భర్తా||

శ్లో.హసతి చ తస్య వికారం శ్రుత్వా భూయస్తు సోపహాసేవ|
ఇత్యాకారప్రకటనమాలోక్య ప్రాభృతం యుంజ్యాత్||

వ.ఆదూతి తెల్పుమాటలను వినినతరువాత యాపె నిట్టూర్పులు విడుచును. దూతికిఁ గొంచెము లంచమిడును. తనయొద్దనుండి వెడలుదానిని మరల వెనుకకుఁ బిలుచును. ఇంకొకమాటయని మరల మరల వెనుఁద్రిప్పును. నీవ ని ట్లగునా యని మరల ప్రశ్నించును, దూతి చెప్పుదానిలోఁ గాఁగూడనిదేమో యున్నదనుచు నాయకవృత్తమును మరల వినఁగోరును, నీ వన్న ట్లేమి చేయను నాపెనిమిటి మిక్కిలి కోపి యాయె నను, తద్భర్తృకోపస్వభావాదిప్రకటన మాలకించి దూతిక నవ్వి తానును నట్లే యన్నదై యామాటవలన నాయింతి మనోగతమును గుర్తించి యుపా యనదానాదికము నుద్బోధించును.

శ్లో.తాంబూలకుసుమలేపనదానై రుపబృంహయేద్భావః|
ఇతి సుఘటితసద్భావా వ్యసనవివాహోత్సవప్రాయే||

శ్లో.ఉద్యానపానయాత్రాజలావతారే హుతనహోత్సాతే|
ప్రవిచిన్తి తాత్యయే వా వేశ్మని నిజ ఏవ తౌ యుంజ్యాత్||

సీ.తాంబూలకుసుమగంధంబులు ముంగిట
నుంచు నాథుఁడు నీకుఁ బంచెననుచు
వనజాక్షి నీ కంపె నని పుష్పగంధంబు
లిచ్చి నాయకునిచే మెచ్చుఁ బడయు
నుత్సాహసంపాదోద్యానసీమల
కేళీస్థలంబులఁ గీలుకొల్పు
ననుకూలగృహము లేదని విచారించినఁ
దనమందిరం బిచ్చి తలఁగియుండు

ఆ.నొకరిహృదయ మెఱిఁగి యొకరికి నెఱిఁగించి
యొకటఁ దలఁపుఁ జెప్ప నొకటఁ దనకుఁ
జెప్పకున్న వారిచేష్టలఁ బరికించి
యొకరి కొకరిమతము నొనరఁ బలుకు.

తా.దూతిక జారస్త్రీముందు తాంబూలపుష్పగంధము లుంచి నీప్రియుడు పంపెనను. ఆవిధముగానే పుష్పగంధములను జారపురుషుని కిచ్చి నీ ప్రియు రాలు పంపెనను. జారస్త్రీ పురుషులకు పరస్పరము అధికమయిన మోహము పుట్టునటులొనర్చి రహస్యస్థలములయందు వారు తారసిల్లునటులొనర్చును. వారిరు వురు రతిక్రీడలకు తగినతావు లేదని విచారించుచుండ తనయి ల్లిచ్చి దూతిక కాపాడుచుండును. వారిచేర్పులవలన యింగీతమును గ్రహించి యొకరిభావము లొకరికి దెల్పునదియే దూతికాకృత్యమునకు దగినది.

## త్రివిధదూతికాలక్షణము

శ్లో.బుద్ధ్వైకస్త సమీహితమాత్మధియైవారభేత యా కార్యమ్|
సా హి నిసృష్టార్థోక్తా లింగేనోన్నీయ యా కార్యమ్||

శ్లో.శేషం సంపాదయతి స్వయమేవైషా పరిమితార్థోక్తా|
సంసృష్టయోస్తు నేత్రీ సన్దేశం పత్త్రహారీ స్యాత్||

చ.ప్రహిత యనంగ నిద్దఱికి బల్కులు పొందుగఁ జెప్పు దూతి, యు
ద్విహితసుఖోపభోగముల వేడకు జెప్పు, మితార్థపత్త్రసం
గ్రహణమునందు నిద్దఱికిఁ గార్యముఁ దెల్పును బత్త్రహారి నా

విహితులు దూతికాతతికి వీరలు ముప్వురు నెన్ని చూడగన్.

తా.జారులగు స్త్రీపురుషులకు పొందికగా మాటలు చెప్పుదూతికను ప్రహి తయనియు, విటీవిటులకు సంభోగవిషయములను దెల్పుదూతికను యుద్విహిత యనియు, లంజమిండలకు హావభావసౌజ్ఞార్థములను దెల్పునది పత్త్రహారియనియు వీరలు త్రివిధదూతికలని తెలియందగినది.

శ్లో.దౌత్యమి షేణావ్యప్యా నాయకమేత్యాత్మగుణభావాన్|
వ్యాజేన వేదయన్తీస్వార్థం ఘటయేత్స్వయందూతీ||

శ్లో.ముగ్ధాం నాయకభార్యాం యత్నాద్విశ్వాస్య యా రహఃపృష్ట్వా|
అభిలాషలింగమాదౌ తేన ద్వారేణ నాయకం గమయేత్||

శ్లో.అపి నాయకః స్వభార్యాం ప్రయోజ్య తద్వత్ సమాయోజ్య|
ప్రకటయతి నాగరత్వం తాం భార్యాం దూతికాం ప్రాహుః||

శ్లో.బాలాం పరిచారికాం వా దోషజ్ఞాం ప్రేషయేత్సతతమ్|
తత్ర స్రజి కర్ణపత్త్రే గూఢం సన్దేశమాలిఖ్యః||

శ్లో.అవిదితకార్యాకార్యా బాలాఽలంకారపత్త్ర సంక్రాన్తైః|
నఖదశనలేఖపత్త్రైః ప్రహితా చేన్మూకదూతీ సా||

శ్లో.ద్వ్యర్థం పూర్వప్రస్తుమథవా దుర్లక్ష్యమన్యేవ|
యన్ముగ్ధయా కయాచిత్ శ్వవ్యోక్తా వాతదూతీ సా|
తత్రావిశంకముత్తరమపి దద్యాన్నాయికా తద్వత్||

సీ.పురుషుండు వచ్చినఁ బొలుపొందఁగాఁ జేయు
    నతివ భావనదూతి కనఁగఁబరఁగు
మదనపత్త్రికఁ బెట్టి మగువకన్నియుఁ బంపఁ
    దొయ్యలి పత్త్రికాదూతి యయ్యె
దంతనఖక్షతదళ మిచ్చి దూతిక
    నాతిఁ బంపిన మూకదూతి యయ్యె
వరునిగాఁ జూచి భావములు పొందులు తోఁప
    పొసఁగించునది స్వయందూతి యయ్యె

ఆ.తానుసేయుకార్యతంత్రంబు మఱియెవ్వ
రైనఁ దెలిసిరేని యట్టివేళ
వారి కింపు పుట్ట బొంకింపనోపెడి
యతివ భావదూతి యనఁగఁబరఁగె.

తా.జారజారిణిలు వచ్చువరకు శయ్యాదు లమర్చియుంచి వారియిష్టములను నెరవేర్చునది భావదూతిక యనియు, స్త్రీపురుషులకు మన్మథపత్త్రికల నందించునది పత్త్రికాదూతియనియు, జారిణి జారునకు దంతనఖక్షతము లుంచిన తములపాకుల చుట్టలను బంపగా పట్టుకొనిపోవునది మూక దూతియనియు, పురుషునియొక్క యిష్టమును గుర్తించి యాతని భావము ప్రకారము పొందిక చేయునది స్వయందూతి యనియు, తానొనరించు కార్య మితరులకు తెలియగా వారు నమ్మునట్లు బొంకునది భావదూతిక యనియు తెలియందగినది.

సీ.కాంతబింబాధరక్షతము నాథుఁడు కన్నఁ
    జిలుక ముద్దాడె నీచెలువ యనుచు

కొమ్మచెక్కిలియొత్తు గోరు నాథుఁడు గన్నఁ
గేతకిఁ గోసె నీనాతి యనుచు
సుదతికేశములు జుంజురులు నాథుఁడు గన్నఁ
బూఁబొద దూరె నీ పొలఁతి యనుచు
రమణినెమ్మోములేఁజెమట నాథుఁడు గన్నఁ
నీరెండఁ గాఁగె నీనారి యనుచు

గీ.నబ్జముఖి దప్పి ప్రాణనాయకుఁడు గనినఁ
గొలుచు గంపెడుదంపె నీపొలఁతి యనుచు
లలన జారునిఁ బొందిన లక్షణములు
పురుషుఁ డీక్షింప దూతిక పోలబొంకు.

తా.జారిణియొక్క మోవియందు దంతక్షతముండుటను దానిభర్త గాంచిన చిలుకను ముద్దాడుటవలన గలిగినగంటు యనియు, చెక్కుల నఖక్షతములను వీక్షింప మొగలిపువ్వులను గోసినది గాన మొగలి ఆకుల గీతలనియు, రేగియున్న కురులను జూచిన పువ్వుల గోయుటకు పొదరిండ్ల దూరుటవలన రేగెననియు, మొగ మునగల చిఱుచెమటలను గనిన నింతవరకు నీరెండయందుండెననియు, సురతబడ లిక వలన దప్పిగొనియుండుటను గ్రహించిన గంపెడుధాన్యము దంపెననియు, నీవిధ ముగా భర్త గ్రహించిన సంభోగానంతరలక్షణములను మరుగుపడునటులు దాని భర్త సమ్మతించునటుల బొంకునదియే దూతిక.

## దూతికాకార్యనిర్వాహకులు

శ్లో.దాసీ, సఖీ, కుమారీ, విధవేక్షణికా, చ సైరన్ధ్రీ।
మాలికగాన్థికరజకస్త్రీ, ప్రవ్రజితా చ వస్తువిక్రేత్రీ॥

శ్లో.ధాత్రీ, ప్రతివేశ్మనికా, స్థిరభావా దూత్య ఏతాః స్యుః।
శుకశారికాదయోపి ప్రతిమాప్రాయా విదగ్ధానామ్॥

ఉ.బానిస కన్నె నెచ్చెలి విభర్తృక చాకెత గంధకారికా
మానిని పుష్పలావి యుపమాత గృహజ్ఞ జలాదులమ్మున
జ్ఞానపత్త్రకారి రచనాంగన భార్య పథిప్రవేశ యా
ఖ్యానవిధిజ్ఞ లీపనికి నర్హులుగా శుకశారికాదులున్.

తా.దాసి, కన్య, చెలికత్తె, విధవ, చాకలిది, గంధమమ్మునది, పువ్వు లమ్మునది, మారుతల్లి, యింటిపెత్తనకత్తె, నీరు నమ్ముకొనునది, చిత్తరువులు వ్రాయునది, భార్య, రతి ప్రవేశముకలది, కథలు చెప్పునది, చిలుక, గోరువంక వీరలు దూతికాకార్యనిర్వాహకులనియు షోడశదూతికలనియు పలుకుదురు.

శ్లో.అన్తఃపురమపి కేచిద్దాసీభిః కథితసదుపాయాః।
ప్రవిశన్తి తత్ప్రకారా లోకద్వయనిన్దితా నోక్తాః॥

క.అంతఃపురములలోపలఁ
జింతన నిహపరసుఖంబు చేడియపలుకుల్
పంతములు కావు గావున
మంతనమున దూతపనులు మానఁగవలయున్.

తా.అంతఃపురములలోనికి దూతిక వెళ్ళుటకు సదుపాయముండినను ఇహ పరలోకసుఖంబులకు దూరులగుదురు కావున అంతఃపురస్త్రీలపై చింతవదలి దూతను

బంపుట కాముకులు మానవలయును.

చ.వితరణకర్ణ కర్ణపదవీగతరత్నవిశేషవాక్పతి
ప్రతిమతిరమ్యవాక్యచయబంధురమోహితరామ రామభూ
పతిపరపంకజభ్రమరభంగురలోచన లోచనామనో
రతినిజరూప రూపగుణరాజిత భైరవమల్ల ధీమణీ.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే
పారదారికాధికారో నామ
త్రయోదశః పరిచ్ఛేదః

గద్యము
ఇది శ్రీమదష్టభాషాకవితాప్రవీణ నవఘంటాసుత్రాణ మాచనామాత్య
పుత్త్ర సుజనకవిమిత్త్ర సజ్జనవిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతంబైన కొక్కోకంబను గళాశాస్త్రంబునందుఁ
ద్వితీయాశ్వాసము సంపూర్ణము





# తృతీయాశ్వాసము

## వశీకరణాధికరణం
## చతుర్ధశః పరిచ్ఛేదః

క.శ్రీనిత్యభవ్యమందిర
మానితరేఖావిలాసమండన నానా
స్థానసుతచతురవితరణ
భానునిభా కుంటముక్ల భైరవమల్లా.

### యోగప్రకరణము

శ్లో.దృష్ట్వానేకవిధాని మన్మథకళాశాస్త్రాణి శబ్దార్ణవం
సోడ్డీశం హరమేఖలాంచ నిఖిలాం యోగావలీనాంశతమ్।
తిస్రో వైద్యకసంహితా బహువిధానాలోచ్య శైవాగమాన్
యోగాధ్యాయమహం మహాజనమతం వక్ష్యామి సంక్షేపతః॥

శ్లో.యూనోర్మిథోఽనురాగాభరణం కామోధివసతి రతికేళిమ్।
సహజాధేయవిభాగాదనురాగశ్చ ద్విధా భవతి॥

సీ.శైవాగమము వైద్యసంహితయును మన్మ
థాగమములును శబ్దార్ణవంబు
నొడ్డామరంబును నొడ్డికమును హార
మేళనంబును నాదిమీననాథ
కచ్ఛపుటాది నాగార్జునమతములఁ
బరికించి బహువిధభంగులైన
మంత్రౌషధక్రియామతములు తత్ప్రయో
గంబుల నెఱిఁగి యాక్రమము దెలిసి

గీ.సకలజనసమ్మతంబుగా సంఘటించి
పురుషులకుఁ గాంతలకుఁ బరస్పరగుణాను
రాగభూషణమైన యారతిరహస్య

తంత్ర మెఱిఁగింతు సంక్షేపతరనిరూఢి.

తా.శైవాగమము, వైద్యసంహిత, మన్మథాగమము, శబ్దార్ణవము, ఒడ్డా మరము, ఒడ్డికము, హారమేళము, నాగార్జునము, మొదలగు పుస్తకములనుండి యనేకవిధములగు మంత్రౌషధక్రియలను వానియుపయోగముల నెఱింగి సర్వజను లును దెలుసుకొని పురుషులు స్త్రీలు యొకరిపై యొకరు ప్రేమగలిగియుండుటకు సంక్షేపముగా యీరతిరహస్యతంత్రము నెఱింగించుచున్నాడను.

శ్లో.వేగాదీని తదంగాన్యప్యంగీకుర్వతే ద్విధా వృద్ధాః|
తస్య తదంగానామితి మంత్రౌషధవిధయ ఉచ్యన్తే||

క.మంత్రౌషధంబు లనఁగాఁ
దంత్రజ్ఞులు వీనిఁ దెలిసి తాత్పర్యమునన్
మంత్రింతురు గావున నీ
మంత్రపువిధిఁ జెప్పి పిదప మందు వచింతున్.

తా.మంత్రౌషధములనిన తంత్రముల నెఱింగినవారు వీనిని తెలిసికొని దృఢాభిప్రాయమున మంత్రింతురు. కనుక మంత్రములను తెలిపి పిదప మందు లను గుఱించి చెప్పెదను.

శ్లో.లక్షాం జప్త్వా హుత్వా తద్దశమాంశేన కింశుకైః సిద్ధః
తదను చ దీపశిఖాభః ప్రవేశితో రేచకేన భగమ్|
గత్వా శిరస్సరోజం గలదమృతం కామకమలమాగచ్ఛన్
ధ్యాతో ద్రవయతి వశయతి శర్షతి కామేశ్వరః కాన్తామ్||

క.కామేశ్వరాఖ్యమైన మ
హామంత్రము లక్ష చేసి యందు దశాంశన్
హోమము మోదుగపువ్వుల
చే మలపిన మంత్రసిద్ధి చేకుఱునంతన్.

తా.కామేశ్వరమంత్రము లక్షపర్యాయములు జపము చేసి మోదుగపువ్వు లచేత పదివేలపర్యాయములు హోమము చేసిన కామేశ్వరమంత్రసిద్ధి కలుగును.

సీ.ప్రణయపూర్వకముగాఁ బఠియించి యేకాక్ష
రంబైన యీమంత్రరాజవిద్య
విధిఁ బునశ్చరణఁ గావించి యంతటనల్ల
మంత్రంబు దీపాగ్ని మాడ్కిఁగాఁగ
ధ్యానంబు చేసి యత్తరుణి గుహ్యమున రే
చకమార్గమునఁ బ్రవేశమును జేయ
నది మీఁది కెక్కి మూర్ధాంతంబునందున్న
వెలిదమ్మి నొయ్యన విరివిఁ జేసి

ఆ.యందులోని యమృత మల్లనఁ గరఁగించి
మరునిజలము వరుస దొరలునట్లు
వలఁపుఁ బుట్టఁజేసి వాంఛింపఁగాఁ జేసి
వశము సేయు నెట్టి వనితనైన.

తా.ఓం, క్లీం, నమః, అను శ్రేష్టమగు నీకామేశ్వర మంత్రమును విద్యు క్తముగా జపమొనరించి పిమ్మట యీ మంత్రమును దీపాగ్నివలె ప్రార్థించి స్త్రీ యొక్క భగమందు రేచకమార్గముగా బ్రవేశింపచేయగా నది శిరస్సున కెక్కి అందున్న కమలమును వికసింపజేసి అందున్న

యమృతమంతయు కరిగించి మదన జల ముప్పొంగునటులొనర్చి ప్రేమకలుగునటులబన్ని యిచ్చు నొడమజేసి ఎటు వంటి స్త్రీనయినను వశము చేయును.

## కామేశ్వరమంత్రవిధానము

శ్లో.ఆదౌ కామేశ్వరతః సాధ్యానామ ద్వితీయయా యుక్తమ్|
ఆనయ నయ వశతామితి పరతః క్షంకారమోంకారాత్||

శ్లో.అయుతం జప్త్వా హుత్వా తద్దశాంశేన కింశుకం కదంబ వా|
సాధిత ఏష నిశాయాం కర్షతి వరవర్ణినీం జప్తః||

చ.మొదలను గామరాజ మిడి ముందట రుద్రుని పేర బీజము
ల్గదియఁగ నిల్పి యానయయుగం బిడుచుం బ్రణవాక్షరంబుల
న్పొదవుచుఁ దత్సహస్రజపమున్ జపయుక్త మొనర్చి వేలిమి
న్పదియవపాలు బ్రహ్మకుసుమంబులఁ జేసినఁ దెచ్చుఁ గామినిన్.

తా.ఓం అను కామేశ్వరమును, క్లీం, అను బీజాక్షరమును కలిపి యుచ్చ రించుచు తానుకోరు స్త్రీ పేరు నుచ్చరించి, మానయ, నయ, యను పదములను గూర్చి వశతాం యను యాకర్షణబీజమును, ఓంకారమేళము నుచ్చరించుచు నీవిధముగా పదివేలు జపమొనరించి మోదుగుపువ్వులచేత వెయ్యిహోమము చేసిన నాస్త్రీ వశురాలగును. ఇందుకు ఉదాహరణము; — ఓం, క్లీం, ........................ మానయ నయ వశతాం ఓం క్షాం నమః, మఱియు నీమంత్రము తుదను జపకాల మందు నమః అనియు హోమకాలమందు స్వాహా అనియు నుచ్చరించునది.

శ్లో.ఉరసి లలాటే మన్మథ సద్మని సంచిన్తితా చ కుండలినీ|
ధ్రువమాకర్షయతి వశయతి విద్రావయతి జ్వలద్రూపా||

శ్లో.కాన్తాసు కామదేవో వాచి చ వాచస్పతిర్గతే గరుడః
జప్తైః సప్తభిరస్యా లక్ష్మైస్సాక్షాత్స్మరో భవతి||

శ్లో.వింశతిసహస్రజాపాత్తదర్ధ హోమేన పాటలాయాశ్చ|
సిద్ధిం వ్రజతి సబిన్దుః స్వరోష్టమః సర్వసిద్ధికరః||

సీ.ప్రణవమాయోనమః పదములఁ గూడఁ గుం
డలినామమంత్రంబు వెలయుచుండు
నీమూఁడువర్ణంబు లింతులకుచముల
ఫాలంబునను గుహ్యభాగమునను
హత్తంగఁదలఁచిన నాకర్షణంబును
వశ్యంబు నధికద్రవంబుఁ జేయు
నీమంత్రజప మొకయేడులక్షలుఁ జేయ
మన్మథుండౌ నెల్ల మానినులకు

గీ.వివిధవాగ్విద్యగురుఁ డగు విషయమునకు
ఘనుఁడు నగు, బిందురూపమోంకార మొక్క
జపము వింశతిసాహస్రసంఖ్య చేయ
వేలుపది కలగొట్టులు వేల్వమేలు.

తా.ఓం, హ్రీం, నమః, ఇది కుండలినీమంత్రము, ఈ మూడువర్ణంబులగు కుండలినీమంత్రము స్త్రీని ధ్యానించి దాని చన్నులయందును ఫాలభాగమునను భగప్రదేశమునను కూడునటుల

దలంచిన కుండలినీశక్తి స్త్రీకి ఆకర్షణమును వశ్య మును పరవశత్వమును కలుగజేయును. మఱియు నీమంత్రమును ఏడులక్షలు జపముజేసిన సర్వకాముకస్త్రీలకు మన్మథునివలె తోచును. మఱియు నీమంత్ర మును ఇరువదివేలు జపమును కలిగొట్టుపువ్వులతో పదివేలు హోమము చేసిన మాట కారియు యౌవనముగలవాడును అగును.

శ్లో.పీతాసితసితరక్తైః కంఠహృదయవదనమదనసదనేషు|
ఈశం ద్విషం చ వాణీం వశయతి రమణీమపి ధ్యాతః||

శ్లో.ఓంచాముండే హుళుహుళు చుళుచుళు వశమానయాముకీం స్వాహా|
అభిమన్త్రస్య సప్తకృతో వశయతి తాంబూలదానేన||

సీ.పసుపువర్ణంబును బాండువర్ణంబును
నలుపును రక్తవర్ణములు గాఁగ
నష్టమస్వరము జప్యంబున నెలకొల్పి
కంఠముఖహృదయకామగృహము
లందుఁ గ్రమంబునఁ బొందించి ధ్యానంబు
సరవితోఁ జేసిన దరతరంబు
ప్రభు శత్రు ధనికుల భామినీమణులను
వశముగాఁ జేయు భావము గలంచి

గీ. ప్రణవచాముండ లుజ్వలపదయుగంబు
సరవి వశమానయంక్లీముస్వాహ యనుచు
నేడుమార్లటు మంత్రించి వీడె మిడిన
మించి చాముండ వశము గావించుఁ బ్రియను.

తా.పసుపు, తెలుపు, నలుపు, యెఱుపు, ఈ వర్ణములను వరుసగా మెడ, ముఖము, ఱొమ్ము, భగము, వీటియందు ఋం అనే అష్టమస్వరసహితముగా కామేశ్వరమంత్రమును ధ్యానించి జపించి ప్రయోగించినయెడల నెట్టిస్త్రీనయినను వశము చేయును. మఱియు "ఓం చాముండే హుళుహుళు చుళుచుళు వశమాన యాముకీం స్వాహా" అను ఈచాముండమంత్రముచేత తాంబూలమును ఏడు మార్లు మంత్రించి స్త్రీ కిచ్చిన చాముండ యాస్త్రీని వశము కావించును.

శ్లో.లక్షైకజాపపూర్ణం దశాంశతిల హోమసిద్ధహృల్లేఖా|
ఆకర్షతి దుర్గమపి సూర్యోదయసమయజాపేన||

చ.జప మొకలక్ష చేసి తిలజంబున వ్రేల్మి దశాంశఁ జేసి యా
తపనుఁడు వచ్చువేళ నిది దాల్చిన దుర్గఁ దలంచి తెచ్చుఁ బో
రపమున మంత్రము న్బ్రణవరాజముతోఁ గదియింపఁజేయుఁ డీ
విపులత హృద్యలేఖ యనువిద్య మహామునిసమ్మతంబుగన్.

గీ.ప్రణయహృల్లేఖసంబుద్ధిపరము నిల్పి
కడఁకతోడ మదద్రవకామరూపి
ణీ పదంబగస్వాహానునీతమైన
మంత్రవేదులు హృల్లేఖమంత్ర మనిరి.

తా."ఓం హృల్లేఖే మదద్రవే కామరూపిణీ స్వాహా" అను యాహృల్లే ఖమంత్రము నొకలక్ష జపించి నువ్వులచే పదివేలు హోమము జేసిన నీహృల్లేఖమం త్రము సిద్ధిపొందును. మఱియం సూర్యోదయకాలమందు నీహృల్లేఖమంత్రము జపించిన దుర్గాదేవి ప్రత్యక్షమగును.

శ్లో.ఓంమదమద మాదయమాదయ హంసాంహ్రీం రూపిణీం స్వాహా|

సాధ్యోఽయమయుతజాపాదరుణకుసుమదశమభాగహోమేన॥

శ్లో.అథ కామధామవినిహితవామకతానామికేన పరిపరితః।
భటితి ద్రవయతి యువతీం నిపీడీతామిక్షుయష్టిమివ॥

చ.మదయనుమాదయద్వయ మమర్చుచు సోమ్మను హ్రీంకృతంబున
న్బొదవుచు రూపిణీపదము పొందఁగ స్వాహపదంబు గూర్చినన్
మద యనుమంత్ర మయ్యె జపమార్గముగాఁ బదివేలు హోమమున్
బదియవపాలు రక్తదళపద్మములన్ జనవశ్యసిద్ధికిన్.

తా.'మదమద మాదయమాదయ, హం, సౌం, హ్రీం, రూపిణీస్వాహా,' ఇదిమాదయమంత్రము. ఈమంత్రము పదివేలు జపము చేసి యెఱ్ఱతామరపువ్వు లతో వెయ్యిహోమము చేసిన సిద్ధి కలుగును.

క.ఈమంత్రంబునఁ బురుషుఁడు
కామినిభగమున ననామికాంగుళ మిడుచోఁ
గామించిన ద్రవ ముబ్బును
బ్రేమంబునఁ జేరు కోల పిడిచినభంగిన్.

తా.పైన చెప్పిన మాదయమంత్రమును జపించుచు స్త్రీభగమందు తన యుంగరపువేలును పెట్టి త్రిప్పిన చెఱకును పిడిచిన రసముకలుగునటు లాస్త్రీభగ మున ద్రవము పట్టును.

శ్లో.జప్తం లక్షద్వయమథ కదంబుకుసుమార్థహోమసంసిద్ధమ్।
తూష్ణీం జప్తం తత్త్వం సతీమపి వశం క్షిప్రమానయతి॥

ఆ.లక్షయుగము జపము లక్షహోమము కదం
బప్రసూనములను బరఁగజేయ
కాదిమాంతతత్త్వ మగునక్కరముతోడ
జపమునందుఁ దెచ్చు సతులజాడ.

తా.హృల్లేఖమంత్రమునకు అంత్యమున ఐ కారమునుతీసి వైది కకారమును జేర్చి రెండులక్షలపర్యాయములు జపము చేసి కడిమిపువ్వులతో లక్షహోమము జేసిన ఎట్టిస్త్రీయైనను వశమగును.

శ్లో.నాడీం చ తాడబీజం సరోచనం కన్యయా చ పరిపిష్టమ్।
వశయతి మూర్ధ్ని వికీర్ణం సప్తాక్షరమన్త్రితం భటితి॥

క.వేదాదిమక్రూంకారము
నాది మహామాయ శ్రీయు నై తత్స్వాహా
నాదయుతంబౌ మంత్రము
నాదిగ సప్తాక్షరాఖ్యమై విలసిల్లెన్.

ఆ.నేల తాటిగడ్డ నెలయంగ గోరోజ
నమునఁ గన్యచేత నలియనూరి
యదియు నియ్య దాని నభిమంత్రణముఁ జేసి
తల నునిచిన పతులకులము మెచ్చు.

తా."ఓం, క్రోం, హ్రీం, శ్రీం, ఢం, స్వాహా" ఇది సప్తాక్షరీమం త్రము. ఈమంత్రమును జపించుచు నేలతాడిగడ్డయును గోరోజనమును కన్యచే నూరించి యామందును స్త్రీలకు యిచ్చినను లేక

తలమీద పులిమినను వశులగుదురు.

శ్లో.ఓం చాముండే జయ జంభే మోహాయ వశమానయాముకీం స్వాహా|
అభిమన్త్ర్య పుష్పదానాత్ ప్రణవాదిరయం వశీకరణః||

గీ.ప్రణవచాముండజయజృంభపదము మోహ
యవశమానయాముకీంస్వాహా యటంచు
మంత్రితము చేసి పువ్వులు మగువ కనుప
వశ్య మగుఁ జూడ నెటువంటి వనితయైన.

తా."ఓం చాముండే జయ జంభే మోహయ వశమానయ అముకీం స్వాహా" ఇది మోహనమంత్రము. ఈ మంత్రమువలన పువ్వులను మంత్రించి స్త్రీకి పంపిన నాస్త్రీ వశమగును.

శ్లో.శవశిరసి స్థితమాల్యం జీవంజీవకమయూరయోరస్థి|
సద్యకరేణ గృహీతం హిత్వావర్తోత్థితం పత్త్రమ్||

శ్లో.చూర్ణం వికీర్ణమేషాం వశయతి నారీనరౌ శిరఃపదయోః|
దత్తం ధవళం కుసుమం కృష్ణాక్షీత్యాదిమన్త్రేణ||

సీ.పీనుఁగుతలయందుఁ బెట్టినపువ్వులు
నమిలియెముకయుఁ బొన్నంగిముడుసు
సుడిఁగొన్నగాలిలోఁ జడితూలు నాకును
గూడఁ జూర్ణము జేసి కొమ్మతలను
బురుషునిపదములఁ బొందింప వశ్యుల్
యలరుదు రిఁకను గృష్ణాక్షి యనెడు
మనువున సితకుసుమంబులు మంత్రించి
యనుపుడు ప్రణవకృష్ణాక్షి కృష్ణ

గీ.ముఖియుఁ గృష్ణాంగియును నన్యముఖపదములు
పరఁగ పుష్పంబు దాస్యామి పరమవశ్య
వశ్యవశమానయది నభవతియదాది
బ్రహ్మరుద్రాదిభవతి నాఁ బరఁగె మనువు.

తా.పీనుగతలయందుంచిన పువ్వులు, నెమలియెముక, పొన్నంగిపిట్ట యెముక సుడిగాలి యందుతిరిగిన యెండుటాకు, ఈనాలుగువస్తువులు చూర్ణము చేసి యాచూర్ణమును పురుషులు స్త్రీల తలలయందును స్త్రీలు పురుషుల పాద ములయందును పూయగా వశులగుదురు. మరియు "ఓం కృష్ణాక్షీ కృష్ణముఖీ కృష్ణసర్వాంగీ యస్యహస్తే పుష్పం దాస్యామి తమవశ్యం వశమానయ యది నభవతి తదా బ్రహ్మాహో రుద్రోభవతి స్వాహా" ఇది కృష్ణాక్షి మంత్రము. ఈమం త్రిమువలన తెల్లనిపువ్వులు మంత్రించి స్త్రీకి యిచ్చిన వశ మగును.

శ్లో.శంభుః శక్త్యారూఢః కుండలినీమండితోథ బిన్దుయుతః|
అష్టావింశతివారం వశయతి రామాం రతే జప్తాః||

శా.ఓంకారంబును మాయఁగూర్చి సుమతిన్ యోజింతు సత్కుండలీ
న్యంకంబై ధర నుత్తమం బగు జపం బష్టోత్తరంబౌశతిన్
సంకల్పాదిగఁ జేయ వశ్యమగు రాజద్రాజబింబాస్య దా
వంక న్మక్కునవ్రేళ్ళు మారుతముతో వర్తింపఁ జేయందగున్.

తా."ఓం, హ్రీం. నమః పురస్కృత్యకంభవే" ఇదికుండలినీమంత్రము. ఈ మంత్రము తన

యెడమముక్కునుండి గాలి బయటకు వెళ్ళుసమయమున ఇరు వదియెనిమిదిమార్లు జపించిన వశ మగును.

శ్లో.మదనాతపత్రవదనే స్ఫటికాకారం వకారమనుచిన్త్య।
ధ్యాతం ధ్వజోగ్నిబీజం వశయతి రామాం రతే జప్తః॥

క.మదనగృహద్వారంబునఁ
గదియ వకారంబుఁ దలఁచి కామాగ్రమునన్
విదిత రకారము దలఁచుచు
సుదతిన్ రమియింప ద్రవముఁ జూపున్ వలచున్.

తా.స్త్రీయొక్క భగద్వారమున వకారమును తనదండాగ్రమున రకా రమును ధ్యానమునం దుంచి రమించిన స్త్రీ ద్రవించి వశమగును.

శ్లో.వామదృశో వామాంగే వామకరేణైవ వామగే వాయౌ।
తద్వద్భృశముపచారః కుచోరుకరకానుభవనేషు॥

చ.వనరుహనేత్ర వామకరవక్త్రకుచోరుభగస్థలంబులన్
దనదగు వామనాడి పవనంబు చరింపఁగ వామహస్త సం
జనితమహోపచారములు సల్పినఁ గొంత ద్రవంబు పుట్టి నె
మ్మనమునఁ జారఁగూర్చి సతి మచ్చిక సేయును వశ్యచిత్తయై.

తా.స్త్రీయొక్క యెడమపార్శ్వమునగల చేయి నోరు చన్ను తొడ భగప్రదేశము వీటియందు తనయెడమముక్కుగాలిని ప్రవర్తింపజేయుచు తన యెడమచేత వాటిని తట్టినయెడల స్త్రీ ద్రవించి సంపూర్ణవశమగును.

శ్లో.మృతమాల్యమరుతోత్థితదళమధుకరపక్షయుగళమిళితేన।
ధ్రువమనుధావతి కీర్ణా రాజరదనయుగ్మచూర్ణేన॥

శ్లో.ఆదాయ హుతవహాదనమేకచితాదగ్ధయోశ్చ దంపత్యోః।
యా తేన హన్యతే స్త్రీ తమేవ సా నూనమనుయాతి॥

సీ.పీనుఁగుతలమీఁదఁ బెట్టినపువ్వులు
సుడిగాలి నెగసిన శుభ్రదళము
భ్రమరపక్షంబులు పరఁగ ముందఱిపండ్లు
రెండును బ్రేతభూమండలమున
నిశి కృష్ణయగు చతుర్దశినాఁడు చూర్ణించి
తరుణులఁ బతుల నెవ్వరికి గాని
శిరముపై జల్లిన నరుగుదెంతురు వెంట
సతియును బతియును జచ్చినపుడె

ఆ.యట్టివారఁ గాల్చు నట్టివేళలఁ గొంతఁ
బొడిచికాల్చు కొరవి పుచ్చి తెచ్చి
పొలఁతి మోపవలఁచుఁ బురుషునికైనను
బురుషుఁ బొడుచు కట్టె పొడువవలయు.

తా.పీనుగుతలయందున్న పువ్వులు, సుడిగాలిలో యెగిరిన ఆకు, తుమ్మెద రెక్కలు, ప్రధానమైన ముందరిపండ్లు రెండును యీవస్తువులను కృష్ణచతుర్దశి దినమున రాత్రి రెండుఝాములవేళ శ్మశానమున చూర్ణము చేసి యాచూర్ణమును పురుషుడు స్త్రీనెత్తిపైన చల్లినను లేక స్త్రీ

పురుషునినెత్తిపైన చల్లినను వశుల గుదురు. మఱియు ఒక్కకాటియందు కాల్చు దంపతులలో పురుషుని పొడిచి కాల్చినకట్టిను స్త్రీ తెచ్చియుంచుకొని తాను మోహించిన పురుషునికి తాకించి నను అట్లె స్త్రీని పొడిచి కాల్చినకట్టిను పురుషు డుంచుకొని తాను మోహించిన స్త్రీకి తాకించినను వశులగుదురు.

శ్లో.దక్షిణదిగస్థిఫలకే శున ఉన్మత్తస్య తాప్యతే యస్యాః।
నామ విలిఖ్య చితాయా అంగారైరవశ్య మాయాతిః॥

ఆ.వెఱ్ఱియెత్తినట్టి వేఁపి దక్షిణదిక్కు
నెముకమీఁద నొక్కయింతిపేరు
వ్రాసి ప్రేతభూమి వహ్నిచేఁ గాల్పంగ
వలచివచ్చు నెట్టి వనితయైన.

తా.వెఱ్ఱికుక్కయొక్క కుడివయిపుయెముక తెచ్చి యాయెముకపై తాను వలచిన స్త్రీ నామమును వ్రాసి యాయెముకను కాటియందుండునిప్పుతో కాల్చిన యెడల నాస్త్రీ వశమగును.

శ్లో.మోహలతా గిరికర్ణీం రుదన్తికాం జాలికామవాక్పుష్పీమ్।
రుద్రజటాం చ కృతాంజలిమాజ్యమధుభ్యాం సమాయోజ్యః॥

శ్లో.కృతతిలకస్త్రైలోక్యం వశయతి తైః స్వాంగమలమిళితైః।
పానేఽథ భక్షణే వా దత్తైర్విశ్వం వశం నయతి॥

శ్లో.చూర్ణం దత్తం వశకృత్ చూర్ణం కీటస్య కాకజంఘయాః।
మునిదళరససిక్తో వా టంకణకః స్వాంగమలమిళితః॥

సీ.జాజిపు వ్వుమ్మెత్త చంచలి తెల్లగం
టెనయు మదంతియుఁ దనరునట్టి
యుత్తరేణియు జాజివిత్తులు పిల్లపీఁ
చరయును నారుద్రజడయుఁ గూర్చి
తేనె నేతులతోడఁ బూని మర్దన చేసి
మలపంచకంబుతోఁ గలియఁబిసికి
తిలకంబు పెట్టినఁ ద్రిజగద్వశంబగు
నటుగాక భక్ష్యాదు లందునిడిన

గీ.సర్వజనవశ్యమగునుగా సాలెపురుఁగుఁ
గాకిఁ జంపియుఁ జూర్ణించి కడఁగి యాత్మ
జలముతోఁ గూడఁజేయు నౌషధముచేత
సర్వజనవశ్యమగు మునిసమ్మతంబు.

తా.జాజిపువ్వును ఉమ్మెత్తపువ్వును తెల్లగ టెన మదంతి ఉత్తరేణి జాజివిత్తులు పిల్లపీచర రుద్రజడ యీవస్తువులు నేయి తేనెలతో మర్దించి మలపం చకము (అనగా తనయొక్క చెమట, ఉమ్మి, రక్తము, మూత్రము, శుక్లము.) యీఅయిదింటితో కలిపి అబొట్టు పెట్టుకొనిన త్రిలోకవశీకరణమగును. మఱియు పైన చెప్పినదానినే భక్ష్యవస్తువులలో కలిపి తినిపించిన వారు వశులగుదురు. ఇంక సాలెపురుగును కాకిని చంపి చూర్ణము చేసి ఆ చూర్ణమును ఆత్మజలమున కలిపి ఎవరి పై జల్లిన వారు వశులగుదురు.

శ్లో.చూర్ణేన మక్షికాయా అసితశునీవక్షసశ్చ సహ చూర్ణమ్।
వశయతి వసిష్ఠభార్యామపి నిజబీజాన్వితం దత్తమ్॥

క.వెలిగార మెట్లుగిసెపూ
దళమును నూరించి యాత్మతనుజలముల స
మ్మిళితముగఁ జేసిపెట్టిన
వలచు న్సతి యెట్టి చెనటివాఁ డత(ఁడైనన్.

తా.వెలిగారము యెట్టిగిసెచిగుళ్లు ఈ రెండును నూరి అందుతన మలపంచక మును కలిపి తినిపించిన పురుషు డెంతదుర్మార్గుడైనను స్త్రీ వలచును.

ఆ.నల్లకుక్కపా లొనర జీడిగింజల
పొడియుఁ గూర్చి తనకుఁ బొడమునట్టి
శుక్లముననుగడుపుచోరఁ బెట్టగా నరుం
ధతికినైన మోహ మతిశయిల్లు.

తా.నల్లకుక్కపాలలో జీడిగింజలు కలియనూరి యాపిండిని తనశుక్లముతో కలిపి భక్ష్యాదులయం దుంచి స్త్రీ తినునటులొనర్చిన పతివ్రతలయినను వశలగు దురు.

శ్లో.కరిమదగదసిద్ధార్థారుణకరవీరప్రసూనఘృతసహితమ్।
సితరవజటావిశృంగీమధుపంచాంగోత్థమలమిళితమ్॥

శ్లో.తిలకేవ త్రైలోక్యం వశయతి పర్యుషితవారిణా పిష్టమ్।
పానేఽథ భక్షణే వా దత్తం పరమం వశీకరణమ్॥

చ.సితరవిమూల మాహిషపుశృంగము తేనియ నీరవర్ణగో
ఘృతమును దెల్లనావలుఁ గరీంద్రమదంబును రక్తవాజిమూ
లితకుసుమంబులున్ దనజలంబున మిశ్రితచూర్ణ మద్ది గా
మతి తిలకంబు వశ్యమగు మర్దితపర్యుషితాంబుయుక్తమై.

తా.తెల్లజిల్లేడువేరు దున్నపోతుకొమ్ము తేనె నల్లనియావునేయి తెల్లని యావాలు యేనుగుమదము ఎఱ్ఱనికలిగొట్టుపువ్వులు తనమలపంచకమున నూరి బొట్టు పెట్టుకొనిన త్రిలోకవశీకరణమగును.

క.ఈయౌషధమే విను పా
నీయంబున భక్షణమున నెలఁతుకప్రేమన్
డాయంగ నొప్పుఁ గావునఁ
జేయఁదగు నిట్టిరీతి చెలువు దలిర్పన్.

తా.పైన చెప్పిన యౌషధమును భక్ష్యాదులలో కలిపి స్త్రీ తినునటులొ నర్చిన వశవర్తినియగును.

శ్లో.వజ్రీఖండైర్గోలాగన్ధకచూర్ణేన భావితైర్బ్యాయః।
శోషణపూర్వవిచూర్ణితమధ్వక్తైర్లింగలేపో వా॥

గీ.కడఁగినల్లేరుతునకలు గంధకంబు
చూర్ణ మొనరించి తేనెతో జోకఁజేసి
లింగలేపనతోఁ గూడ లేమ చిక్కు
ఘోణికాపుత్త్రుఁ డొనరించె గురుమతంబు.

తా.నల్లేరుతునకలు గంధకము ఈరెండును చూర్ణము చేసి తేనెతో కలిపి దండమునకు పూసుకొని స్త్రీని రమించిన వశవర్తినియగును.

శ్లో.చూర్ణమిదమరుణవానరవిష్ఠాక్తం మూర్ధ్ని కీర్యతే యస్యాః।

తాముద్వహేత కన్యాం కమనీయాంగీమభవ్యోపి||

క.అరుణకపివిష్ఠమును మఱి
హరిదళమును గూర్చి తలల నలికిన వనితల్
పురుషుఁడు కురూపియైనను
వరుఁ గాఁ గోరుదురు మదనబాధిత లగుచున్.

తా.ఎఱ్ఱకోతిమలములో హరిదళము కలిపి స్త్రీతలయందు పులిమిన పురు షుడు రూపవంతుడు కాకున్నను యతనికి స్త్రీ వశవర్తినియగును.

శ్లో.వటయువతీమలయోద్భవసూక్ష్మైలాసర్జకుష్ఠసిద్ధార్థైః|
సర్వాంగీణో ధూపః సర్వజనానాం వశీకరణః||

క.వెలియావలు నేలుసిరిక
మలయజమును గోష్టువటము మఱియును బసవున్
గలిపిన ధూపము దనువునఁ
గలిసిన జనవశ్య మగును గాంతయు వశమౌ.

తా.తెల్లఆవాలు, నేలుసిరిక, గంధము, చెంగల్వకోష్టు, వటము, పసుపు, ఇవి ధూపము వేసికొనిన స్త్రీవశ్యమును జనవశ్యమును గలుగును.

శ్లో.కోష్ఠోత్పలదళమధుకరపక్షతగరమూలకాకజంఘానామ్|
చూర్ణం శిరసి వికీర్ణమనామికారక్తమిశ్రమపి యదృక్||

క.అలచందవ్రేళ్ళు నుత్పల
దళమును గంధంబు గ్రంధితగరము నళిఱె
క్కలచూర్ణంబును వామాం
గుళరక్తముఁ గలిపి చల్లఁ గోమలి వలచున్.

తా.అలచందవ్రేళ్లు కలువరేకులు గంధము గ్రంధితగరము తుమ్మెద ఱెక్కలు ఇవి చూర్ణము చేసి యెడమబొటనవేలిరక్తముతో కలిపి స్త్రీమీద చల్లిన వశమగును.

శ్లో.ఉత్పలదళదండోత్పలపునర్నవాసారివేత్థకల్కసంసిద్ధమ్|
తైలం నయనాభ్యంజనమాహుః పరమం వశీకరణమ్||

ఆ.కలువఱేకుఁ గాకికలువదుంపయుఁ దెల్లు
గలజరయును నాసుగంధివేరు
తైలయుక్తముగను దనకంట నిడుకొన్న
వామలోచనాది వశ్యకరము.

తా.కలువఱేకులు. నల్లకలువదుంప తెల్లగలిజేరు సుగంధిపాలవేరు ఈవస్తువులు నూనెలో యరువదీసి తనకన్నులకు బెట్టుకొనిన స్త్రీలు వశ్యులగుదురు.

శ్లో.మాతంగనిహతనరనయననాసికాహృదయలింగజిహ్వాభిః|
పుష్యర్క్ష్యయుక్తరాత్రౌ భవభవనే సాధితం తైలమ్||

శ్లో.మదనాంకుశ ఇతి నామ్నా మహావశీకరణమేతదితి మునయః|
భక్షణపానస్పర్శననావిధి విశ్వం వశం నయతి||

చ.మదకరిఘాతచేఁ బడిన మర్త్యుని లోచనలింగజిహ్వాలున్

హృదయము నాసియు న్జదిపి యీశగృహంబున( బుష్యయుక్తమై
యొదవినరాత్రి భూపుటనియుక్తము తైలము తీసి ధూప మి
పొదవిన వశ్యకారణ మహ మదనాంకురనామభావమై.

తా.మదపుటేనుగువలన చచ్చినమనుష్యునియొక్క కన్నులు ముక్కు గుండెకాయ దండము నాలుక ఈవస్తువులు నలుగగొట్టి వాటిని పుష్యమీనక్షత్ర ముతో కూడిన రాత్రియందు శివునిగుడిలో తైలము తీసి స్త్రీలకు ధూపము వేసిన వశులగుదురు మఱియు నా తైలము మదనాంకురమను పేరు గలిగి భక్ష్యపానాది స్పర్శనవిధులవలన సర్వజనవశీకరణమగును.

శ్లో.వసుకుష్ఠమలయజఘుస్రృణసురతరుకుసుమసలిలసంజనితః|
చిన్తామణిరీతి భణితో ధూపః పరమో వశీకరణః||

శ్లో.రమణీరమణే వరణే కన్యాయాః పణ్యావస్తువిక్రయణే|
సిద్ధికరం ధూపమిమం మనుతే హరమేఖలాకారః||

ఉ.చందనకుంకుమంబులును జల్లనికోష్టులు దేవదారువున్
బొందుగ( దేనెధూప మిడి పోయిన కన్య వరించు( బుణ్యమున్
జెందును దేవతత్త్వమని చెప్పిరి ధూపము పేరు నిట్టివే
సుందరి వశ్యకారణము చొప్పడు నాగబలాదియుక్తమై.

తా.గంధము కుంకుమ కోష్టులు దేవదారు తేనె ఇవి చూర్ణము చేసి ధూపము వేసుకొనిన స్త్రీ వశ్యమగును. మఱియు నీయౌషధమును సంభోగకాల మున ధూపము వేసినయెడల అంగడియందు కొనినవస్తువువలె వశవర్తినియగును.

శ్లో.ఆన్త్రోజ్ఝితచటకోదరనివేశితం బీజమాత్మనః కృత్వా|
దత్వా వజ్రోదకమథ శరావయుగసంపుటం కృత్వా||

శ్లో.సప్తాహముపరి చుల్యాం నిధాయ ఘుటికాం విధాయ భక్ష్యవిధౌ|
దత్తం వశయతి కర్షతి వశిష్టభార్యామపి క్షిప్రమ్||

ఉ.పిచ్చుకపొట్టలోన( దనబీజము( బెట్టి శరావయుగ్మమున్
దెచ్చి తదీయమధ్యమున నిల్పుచు మూత్రము( బోసి చీలమ
న్నిచ్చియు( బొయ్యిలోన నిడి యేడుదినంబులు వండి మీ(ద వే(
బుచ్చినభూతి దెచ్చి జలభక్తుల( బెట్టిన( గాంత మేలగున్.

తా.పిచ్చుకను చంపి దానిపొట్టలో తనశుక్లముంచి మూకుడు నందుంచి దానిపై నొకమూకుడును బోర్లించి చీలమన్నుంచి ఏడుదినములు వండిన భస్మ మగును. ఆభస్మమును నీటియందయినను భక్షణపదార్థములయందయిన నుంచి స్త్రీలకు యిచ్చిన వశులగుదురు.

శ్లో.క్షౌమీం లిప్త్వా వర్తి గదదళతాళీసతగరకై స్తైలమ్|
సిద్ధార్థస్య గృహీత్వా నృకపాలే కజ్జలం విహితమ్|
నయనగత యువతీనామపి మునిచేతాంసి మోహయతే||

క.తాళకతగరమ్ములును దు
కూలంబున వత్తి( గూర్చికొని వెలియావల్
తైలంబు( దీసి మనుజక
పాలంబున కంజనంబుపగిదిని బూయన్.

క.ఆకాటుక నయనంబుల(

గైకొన్న వధూటి కాముకాండంబులచే
నాకమునీంద్రులనైనను
బాకము తప్పించి తనకు బంటుగఁ జేయున్.

తా.తాళకము తగరము యీరెండును తెల్లపట్టుగుడ్డలో వత్తి చేసి ఆవత్తి పుర్రెయందుంచి తెల్లఆవాలనూనె పోసి దీపము వెలిగించి ఆదీపముమీద నింకొక పుర్రెను బోర్లించి కాటుకను పట్టి ఆకాటుక కన్నులకు బెట్టుకొనినస్త్రీ మునుల నయినను మోహాంధులను చేయును.

శ్లో.స్వార్తవశోణితభావితరోచనయా రచితతిలకా|
నారీ వశయతి భువనం న తత్ర చిత్రం కిమప్యస్యాః||

క.ఋతుశోణితమున గోరజ
మతిశయముగ నునిచి తిలక మళికంబున నే
యతివ ధరించి నది ది
క్పతి ముని గురుజనులనైన వశ్యత నొంచున్.

తా.స్త్రీలు ఋతుకాలమందలి రక్తముతో కూడా గోరోజనమును కలియ గూర్చి బొట్టు పెట్టుకొనిన మునిశ్రేష్టులయిన వశ్యులగుదురు.

శ్లో.యది సహదేవీమూలం గ్రహణే సంగృహ్యా రోచనాపిష్టమ్|
తత్కృతతిలకా నారీ గురుకులమపి వికలతాం నయతి||

క.సహదేవి సమూలం బొక
గ్రహణంబునఁ బుచ్చి పసుపుఁ గలియఁగ నూరన్
మహిలోన తిలక మిడినను
మహనీయునినైన వికలమతి నొనరించున్.

తా.సహదేవిచెట్టును గ్రహణదినమున పెల్లగించి సమూలముగా తెచ్చి పసు పుతో కలియునూరి యానూరినపిండిని బొట్టు పెట్టుకొనినస్త్రీ మునులనయినను మోహవశులను జేయును.

శ్లో.దత్వా ద్విజాయ పాయసభోజనముత్పాద్య సితబలామూలమ్|
కన్యాపిష్టం భక్ష్యే దత్తమనిచ్ఛాహరం పరమమ్||

శ్లో.జటిపిప్పలయోర్ఘాతాగృహ్ణాకై రేకమూలయోర్లిప్త్వా|
వక్షోఘనమాలింగనమనిచ్ఛతాం హరతి హరిణాక్ష్యాః||

సీ.ముత్తువపులుగము మూలంబు దెచ్చిక
    న్నియచేత నూరించి నెలఁతలకును
భోజనంబునఁ బెట్ట బురుషులపై కోప
    ముడిగి కూడుదు రుచిరోక్తు లలర
మ్రానొక్కటై రావిమఱ్ఱులు పెరఁగిన
    నేకమై దాని వ్రేళ్ళెల్లఁ దీసి
చెలఁదిగ్రుడ్లును నూరి చెలియపైఁ జల్లినఁ
    గాంతునిఁ దలఁచి యాకాంత వేగ

గీ.నలుకచేఁ బాసియున్నట్టి యలుకఁ దేరి
వేడ్క మీఱంగు నెదురెక్కి విభునిఁ గవయు
చుందు రిది సిద్ధియోగంబు సుదతులకును
మోహనకరంబు విటజనామోదకరము.

తా.తెల్లనిపువ్వులు గల ముత్తువపులుగముచెట్టు సమూలముగా తెచ్చి కన్నె పడుచుచే నూరించి స్త్రీలకు భక్షణపదార్థములతో భక్షింపజేసిన వశవర్తులగుదురు. మఱియు నొక్కమానుగా కలిసి పెరిగిన రావిచెట్టు మఱ్ఱిచెట్టు యొక్క వేళ్ళను తెచ్చి సాలెపురుగుగుడ్డుతో నావేళ్ళను నూరి స్త్రీపై చల్లిన వశురాలగును.

శ్లో.సితదూర్వా సితబృహతీ సితగిరికర్ణీ సమూలపుష్పా చ|
తాంబూలేన వితీర్ణా స్త్రీపురుషౌ వశ్యతాం నయతి||

క.వెలిగంటెన వెలిదూర్వము
వెలిములకయుఁ గూడ వీని వ్రేళ్ళను బతియున్
లలనయు నొకళ్ళొకళ్ళకు
వలనుగ విడియమునఁ బెట్ట వశ్యత కలుగున్.

తా.తెల్లగంటెనవేరు, తెల్లగరికవేఱు, తెల్లములకవేఱు, యీ మూడును పురుషులు పరస్పరము విడియమున బెట్టిన వశులగుదురు.

శ్లో.కరభాస్థిక్ష్మృంగపక్షద్రవభావితమేకవింశతిం వారాన్|
పుటదగ్ధం సమశైలాంజనసహితం చూర్ణితం సమ్యక్||

శ్లో.కరభాస్థినాలికాయాం నిహితం కరభాస్థిశలాకయా విహితమ్|
ఇదమంజనమఖిలజనం జనయతి వాగ్వశ్యవద్వశ్యమ్||

సీ.ఇరువదియొక్కమా ఱెనయఁ గల్గరవేరు
రసమున నునిచి యుష్ట్రంబు నెముక
శైలాంజనముతోడ సమ్మేళన మొనర్చి
పుటదగ్ధభస్మసంఘటనఁ జేసి
యెనయ నాయెముకఁ జేసిన కరాటములోనఁ
గదియించి యయెమ్ము కణికఁ జేసి
యందు నొయ్యన నుంచి యాయంజనము కాంత
తనకన్నులను బెట్టి జనులఁ జూడ

గీ.వశ్యు లగుదురు మఱి మగవారు దీని
కన్నుఁగవఁ బెట్టి కామినీగణముఁ జూడఁ
జాలవలతురు ధర సర్వజనులకెల్ల
మునులు చెప్పిన మతమిది మోహనంబు.

తా.లొట్టిపిట్ట యెముక గుంటగలగరఆకురసముతో యిరువదియొక్క వారములు భావన చేసి ఆయెముకలో సగముయెత్తు శైలాంజనముతో కూడా కలిపి పుటము పెట్టి భస్మము జేసి ఆభస్మమును ఆయెముకతో చేసిన బరిణయందుంచి యా యెముకతోడనే కణిక చేసి యాకణికతో నాకాటుకను స్త్రీలు కన్నులయందు బెట్టుకొనిన పురుషులు వశులగుదురు. పురుషు లాకాటుకను బెట్టుకొనిన స్త్రీలు వశులగుదురు. దీనినే మోహనాంజన మందురు.

శ్లో.నిజబీజేన రతాన్తే వామదృశో ఘటిత వామపాదం యః|
అథవా లింపతి హృదయం స ఏవ తస్యాః పరో దయితః||

క.తనవీర్యము సురతాంతం
బునఁ గామిని వామపాదమునఁ బూసిన న
వ్వనజాక్షి వలచు హృదయం
బుననైనను బూయ రసము పొరసిన భంగిన్.

తా.పురుషుడు స్త్రీని రమించిన తరువాత తనయొక్క శుక్లము స్త్రీ యొక్క యెడమపాదమందైనను, హృదయమునందైనను పూయ నాస్త్రీ వశ వర్తిని యగును.

ఇతి శ్రీకొక్కోకకృతే రతిరహస్యే
వశీకరణాధికారో నామ
చతుర్ధశః పరిచ్ఛేదః

# సకలయోగాధికరణము
# పంచదశః పరిచ్ఛేదః

## ద్రావకయోగలక్షణము

శ్లో.కర్పూపటంకణాభ్యామథవా మధుకేసరాస్థిసారాభ్యామ్।
ఘోషఫలక్షోదైర్వా రసేన దణ్డోత్పలాయా వా॥

శ్లో.మూర్ఛితమథవా మిళితం శశినా భవబీజమేకం వా।
ఏకష్టంకణో వా ఏకం వా ఘోషకోత్థరజః॥

శ్లో.యది వా మధుగుడసహితా చించా కఠినాంగవరాంగేషు।
క్షేపాద్వా ధ్వజలేపాద్రేతఃస్రోతః ప్రవర్తయతి॥

సీ.కర్పూరటంకణకారంబులును హర
బీజంబుతోఁ గూడ వెలయు నొకటి
పొగడగింజలనీరు పువ్వుఁదేనియుఁ గూడి
పాదరసంబుతో బరఁగు నొకటి
ములకవిత్తులు తేనె కలిపి శంకరవీర్య
మున యోగమై వేడ్క నొనరు నొకటి
కాకికలువదుంప కలబంద గలిజేరు
రసములు రసముతో నెసఁగ మూఁడు

గీ.కప్పురముతోడ నొకటి యేకముగ నొకటి
గోఅజంబును మధువును గూడ నొకటి
చింతపులుసు మరాటంబు చేత నొకటి
రసము పుట్టించు ద్రవములు రమణులకును.

తా.కర్పూరము వెలిగారము సురేకారము ఈమూఁడును రసమున కలిపిన నొకద్రావకయోగ మగును. నల్లకలువదుంపరసము పాదరసమున కలిపిన నొక ద్రావకయోగమగును. పొగడగింజలనీరును పువ్వుతేనెయు పాదరసమున కలిపిన నొకద్రావకయోగమగును. ములకవిత్తులు తేనెయు పాదరసమున కలిపిన నొకద్రావకయోగమగును. కలబందరసమున పాదరసమును కలిపిన నొకద్రావక యోగమగును. గలిజేరుఆకులరసమున పాదరసము కలిపిన నొకద్రావకయోగ మగును. కప్పురముతో పాదరసము కలిపిన నొకద్రావకయోగమగును. ప్రత్యే కపాదరస మొకద్రావకయోగమును, గోరోజనము తేనె పాదరసమున కలిపిన నొక ద్రావకయోగమగును. చింతపండుపులుసు మరాటిమొగ్గలు పాదరసమున కలిపిన నొకద్రావకయోగమగును. ఈ ద్రావకములు పురుషుడు లింగమునకు పులుము కొని స్త్రీని రమించిన స్త్రీ ద్రవించి సుఖము చెందును.

శ్లో.ఇత్యేతే దశ గదితా దావణయోగాః ప్రసిద్ధమహిమానః।
ద్రావణవశతాకర్షణమాదధ్యాద్యోగషట్కం చ॥

వ.పూర్వమునందుఁ జెప్పంబడిన పదిద్రావకంబులును జాలమహిమ గలవని చెప్పంబడియున్నది. ఇక ముందు చెప్పంబడు నారుయోగంబులును ద్రావణ వశ్యాకర్షణములను జేయంగలవు.

శ్లో.లోధ్రశ్రీఫలమజ్జానేకపమదసిన్ధువారసమభాగః।

అథవా మధుమాగధికాధత్తూరకలోధ్రమరిచాని||

శ్లో.రక్తకపిలింగముడుపతికాంచనమధుసూతసహితం వా|
హయలాలామంజిష్ఠాసితసర్షపజాతికుసుమం వా||

శ్లో.ఘృష్టం కపిలాసర్పిషి లోహితకపిలింగమేకం వా|
మధుసైన్ధవకలరవమలమిళితం వా లింగలేపేన||

క.శ్రీవృక్షఫలరసంబును
వావిలియును లోధ్రతరువు వారణమదమున్
బ్రోవిడి సమభాగంబులఁ
గావించిన ద్రవము వశ్యకరమై నెగడున్.

తా.మారేడుపండురసము బావిలియాకురసము లొద్దుగుచెక్కరసము యేనుగుమదము ఈవస్తువులు సమభాగములుగా గలిపి పురుషుడు లింగమునకు పులు ముకొని స్త్రీని రమించిన నాస్త్రీ ద్రవించి సుఖము చెంది వశవర్తినియగును.

క.మిరియము పిప్పలితేనెయు
వరలోధ్రము నుమ్మెత్తయును వశమౌ మఱి క
ప్పురమును నుమ్మెత్తయు మధు
కరసంబును గూడ నొక్కకరణం బయ్యెన్.

తా.మిరియములు పిప్పలితేనె లొద్దుగుచెక్క ఉమ్మెత్తవేరులు కలియ నూరిన నిది యొకయోగమగును. కప్పురము ఉమ్మెత్తవేరులు అతిమధురము పాద రసము కలియనూరిన యొకయోగమగును.ఈ రెండుయోగములలో నేదైన పురుషుడు లింగమునకు పులుముకొని రమించిన స్త్రీ ద్రవించి సుఖము చెంది వశ వర్తినియగును.

ఆ.కపిలనేయి రక్తకపిలింగమును రక్త
హయములాల తెల్లయావపిండి
మంచిజాజిపువ్వు మంజిష్ఠ.ను గూడ
ద్రావకంబు యోగభావ మయ్యె.

తా.గోరోజనమువంటి వర్ణముగల నేయియు, యెఱ్ఱకోతియొక్కదండ మును, యెఱ్ఱగుఱ్ఱముచొంగయు, తెల్లనియావపిండియు, మంచిజాజిపువ్వును, మం జిష్ఠచెట్టుపువ్వును ఈవస్తువులు కలిపి లింగలేపన మొనర్చి కూడిన స్త్రీ ద్రవించి సుఖము చెంది వశవర్తినియగును.

క.తేనెయు నుమ్మెత యెఱ్ఱని
వానరలింగంబుఁ గూర్చి వండఁగ నొకటౌ
తేనియ సైంధవలవణము
నూనెయుఁ బార్వంబురెట్ట నూత్నద్రవముల్.

తా.తేనెయు, ఉమ్మెత్తవేరులు, ఎఱ్ఱనికోతిదండము వీనిని వండిన యొక యోగమగును. తేనెయు, సైంధవలవణము, నూనె, పావురమురెట్టలు కలిపిన నొక యోగమగును. ఈ రెండుయోగములలో నేదయిన లింగలేపన మొనర్చి రమించిన స్త్రీ ద్రవించి సంఖము చెంది వశవర్తినియగును.

శ్లో.పుష్యోద్ధృతరుద్రజటామూలం విచవ్యార్థ కర్ణయోర్యస్యాః|
క్రియతే ఫూత్కృతమల్పం తత్క్షణమేవ చ్యుతి స్తస్యాః||

గీ.పుష్యమిని రుద్రజడవేరు పొసఁగఁదెచ్చి
నమిలి పుక్కిట నిడికొని నాతిచెవుల
గాలి వాఱంగ నూదినఁ గామినికిని
మదనజల ముబ్బుఁ దత్క్షణమాత్రముననుs.

తా.పురుషుడు పుష్యమీనక్షత్రమునందు రుద్రజడవేరును దెచ్చి నమలి పుక్కిట నుంచుకొని స్త్రీయొక్క చెవులయందు ఊదిన నాసతి ద్రవించును.

## వీర్యవృద్ధిలక్షణము

శ్లో.నాగబలాం సబలామథ శతావరీం వానరీం సమం పాయసా|
గోక్షుర కేక్షురకే నిశి నిపీయ రతిమల్లతామేతి||

క.ముత్తవపులగము గొలిమిడి
విత్తులు పల్లేరు పిల్లపీఁచరయును నొ
క్కిత్తుగఁ బాలను గొన్నను
జిత్తమునకు రాత్రి వృద్ధి సేయును రతికిన్.

తా.చిట్టాముదపువేరులు, గొలిమిడివిత్తులు, పల్లేరువేరులు, పిల్లపీచరవేరు సమభాగములుగా చూర్ణించి ఆవుపాలతో పుచ్చుకొనిన వీర్యవృద్ధియగును.

శ్లో.మధుకస్య కర్షమేకం సహితం తుల్యేన సర్పిషా మధునా|
లీఢ్వానుపీయ దుగ్ధం నిధువనశక్తిం పరాం ధత్తే||

ఆ.మధుకయష్టి నాల్గుమాడలయెత్తు త
త్పాద మావునేయి పరగఁ గూర్చి
కుడిచి యావుపాలఁ గ్రోలిన రతివేళ
బలము నిచ్చు నెట్టి పందకైన.

తా.నాలుగుమాడలయెత్తు యష్టిమధుకమును మాడయెత్తుయావునేతిలో కలిపి తిని యావుపాలను తాగిన వీర్యవృద్ధియగును.

శ్లో.పంచాశత్పలమాజ్యం తద్ద్విగుణసితాసమన్వితం మధునా|
షాదేన వారిపాదిక మేతత్సంసాధ్య మర్దితేన చిరమ్||

శ్లో.గోధూమచూర్ణపాదేనోత్పాద్యోత్కారికాం చ భుంజానః|
కందర్పసమరకేళీదర్పితదుర్మదయువతీజనం జయతి||

శ్లో.దశగుణదుగ్ధే పక్వం శతావరీగర్భితం చ ఘృతమశ్నన్|
మాగధికామధుసహితం సశర్కరం భవతి రతిమల్లః||

సీ. ఫలము లేఁబది నెయ్యి పంచదారయు రెట్టి
తేనె తత్పాదంబు మానుగాఁగఁ
దత్పాదముదకంబు తగ నన్నియును గూర్చి
పాదము గోదుమ పదిలపఱచి
విరివిఁజక్కెర ద్రాక్ష పిప్పలి తగఁగూర్చి
భక్షింప రతి లింగబలము నిచ్చు
పదిగుణంబులు పాలపక్వంబుగాఁ బిల్లి
పీఁచర వండి యాపిండి తెచ్చి

గీ.మధువు శర్కర ఘృతమును మాగధియును
గూర్చి భక్షించి కామినిఁ గూడెనేని
వాఁడు పురుషుఁడు గాఁడు దుర్వారమదన
ఘోటకముగాఁగ నొప్పు నీ కూటములను.

తా.ఏఁబదితులములయెత్తు యావునేయి, నూరుతులములయెత్తు పంచ దార, ఇరువదియైదుతులములయెత్తు తేనె, ఆరుతులములపావుయెత్తు నీరును, పం డ్రెండుతులములన్నర గోదుమపిండి, వీనిని కలిపి మర్దించి పిప్పలి ద్రాక్షపండ్ల నుంచి తినిన వీర్యవృద్ధియగును. మఱియు పిల్లిపిచరవేరులను మెత్తగా నూరి దానికి పదిరెట్లుపాలతో వండి దానిలో తేనె పంచదార నేయి పిప్పలి కలిపి భక్షించిన వీర్యవృద్ధియై రతికేళియందు మదించినగుఱ్ఱమువలె మెలంగును.

శ్లో.బస్తాండసిద్ధదుగ్ధే భూయో వా భావితాంస్తిలానశ్నన్|
ఘృతదుగ్ధసాధితౌ వా బస్తాండౌ సలవణౌ సగుడౌ||

శ్లో.స్వరసేన భావితం వా ధాత్రీచూర్ణం విదారికాచూర్ణమాజ్యమధుమిళితమ్|
గోక్షురవిదారికోత్థం చూర్ణం వా శర్కరాసహితమ్||

శ్లో.స్వరసేన భావితం వా ధాత్రీచూర్ణం సితాఽఽజ్యమధుమిళితమ్|
లీఢ్వాఽనుపీయ దుగ్ధం న తృప్యతి స్త్రీశతేనాపి||

శ్లో.యుపకలమమాషచూర్ణైస్తుల్యైర్గోధూమమాగధీసహితైః|
పూపలికాం ఘృతపక్వాం భుక్త్వా క్షీరం సశర్కరం పిబతః||

శ్లో.ఘృతమధుసహదేవ్యన్వితసరోజకింజల్కలిప్తనాభేర్వా|
రమమాణస్య న తృప్యతి మనః శతేవాపి రమణీనామ్||

సీ.మేషాండములు పాల మృదువుగా నుడికించి
నల్లనువ్వులతోడ నమలిరేని
యింతిఁ గూడిన బల మిచ్చును రతులను
జిక్కితి నిఁక నేమి సేయుదు నన
నెఱిచింతపండైన నిమ్మపండైనను
జవిచూడ మన్మథజలము విడుచు
మాషగోదుమములు మఱి యవవేష్టిత
పటలీఘృతమున పూపములు వండి

గీ.కడఁగి భక్షించి దుగ్ధశర్కరలఁ ద్రావ
విజయమునును బొందు రతియుద్ధవేళలందు
సితము సహదేవి తేనియ ఘృతము పొందు
రాగకింజల్కములు నాభి రాయనగును.

తా.మేకవట్టలు పాలతో వండి, నల్లనువ్వులతో భక్షించిన వీర్యవృద్ధియగును. సంభోగకాలమున స్త్రీ తాళజాలకపోయినయెడల చింతపండయినను నిమ్మపండు నయినను రుచిచూచిన వీర్యపతన మగును. మఱియు మినుపపిండి గోదుమపిండి యవలపిండి వీనిని కలిపి యావునేతితో పూరీలుగా వండి భక్షించి పంచదార కలి పిన పాలను ద్రాగిన వీర్యవృద్ధియగును. మఱియు పంచదార సహదేవి తేనె నేయి పద్మకింజల్కములు వీటిని కలిపి పురుషుడు తన బొడ్డునకు చమిరినయెడల వీర్యవృద్ధి యగును.

# వీర్యస్తంభన లక్షణము

శ్లో.ముష్కశిరాయా మూలం దృఢమంగుల్యానిపీడ్య రతికాలే|
చిన్తాన్తరనిహితమనాః కుంభితపవనశ్చ్యుతిం జయతి||

క.తన మొట్టమొదటివ్రేలను
ఘనముగఁ బీడించి యన్యగతమానసుఁడై
యనిలంబుఁ బట్టి రతిఁ జే
సిన శుక్లస్తంభనంబు సిద్ధి న్బొందున్.

తా.పురుషుడు కాళ్ల పెద్దవ్రేళ్ళనూనద్రొక్కి నింకొకవిషయమునందు ధ్యానముంచి యుచ్ఛ్వాసనిశ్వాసములను బంధించి రతి చేసిన శుక్లము స్తంభించును.

శ్లో.సితశరపుంఖామూలం వటపయసా పిష్టమానేన నిహితమ్|
ఏకకరజ్జకబీజాభ్యన్తరగం స్తంభయేద్బీజమ్||

క.వెలివెంపలి మర్దించియుఁ
గలియంగా మఱ్ఱిపాలఁ గానుఁగుగింజన్
దొలిచి యది నోట నిడుకొని
కలిసిన వీర్యంబు పడదు కాముకరతికిన్.

తా.తెల్లవెంపలివేరు మఱ్ఱిపాలతో నూరి దానిని తొలిచిన కానుగగింజలో నుంచి దానిని పుక్కిట నుంచుకొని రతిచేసిన శుక్లము స్తంభించును.

శ్లో.కృత్వా దృఢగుదపీడనమానాభేశ్చిన్తితశ్చ్యుతిం జయతి|
ఆమస్తకమోంకారః శ్యామతనుః కచ్ఛపాకారః||

ఆ.శ్యామకచ్ఛపంబు చాయగా నోంకార
మాత్మఁ దలచి నాభి యాత్మగాఁగ
శిరముదాఁక నుండఁ జింతించి గుడపీడ
నంబుఁ జేయ నింద్రియంబు వడదు.

తా.నల్లటితాబేలువంటి యాకారముగల ఓంకారమును మనస్సునందు తలచి బొడ్డుదగ్గరనుండి తలవరకు యుండజూచుకొని దృఢముగా పాదములచే గుదస్థానము బిగించి రతిచేసిన శుక్లము స్తంభించును.

శ్లో.సితశరపుంఖామూలం పారదరససహితమాననే నిహితమ్|
ఏకకరంజకబీజాన్తస్థం బీజం విధారయతి||

గీ.పారదంబును గానుఁగుపండుపప్పు
తెల్లవెంపలివేరు నీత్రికము నూరి
యుండగాఁ జేసి ముఖమునం దుండజేసి
రతి యొనర్చినయెడల వీర్యంబు విడదు.

తా.తెల్లవెంపలివేరు కానుగుగింజలో నుండుపప్పు పాదరసము ఇవి కలిపి ముఖమునం దుంచుకొని రతి చేసిన వీర్యము స్తంభించును.

శ్లో.నరదక్షిణకరరోమభిరిభకరకరభాశ్వపుచ్ఛసంజాతైః|
గ్రథితం దక్షిణకరగం రేతోరుత్ కోలదశనాస్థి||

శ్లో.అసితవృషదంశ దక్షిణపార్శ్వస్థితమస్థి కటితటే బద్ధమ్|
సప్తచ్ఛదబీజం వా బీజచ్యుతివిజయి వదనగతమ్||

శ్లో.స్నుహ్యాజాదుగ్ధపిష్టం లజ్జోలార్మూలమంఘ్రిలేపనతః|
ధ్వజలేపాదజమూత్రైః పిష్టం వా వారుణీమూలమ్||

శ్లో.కౌసుంభతైలమథనా వర్షాంభూచూర్ణమభ్యంగాత్|
చరణస్య చ్యుతిజయినో యోగా హ్యేతే న సన్దేహః||

సీ.పురుషుని కుడివంకఁ గరరోమముల నశ్వ
ఖర ముష్ట్రముల పుచ్ఛకములతోడఁ
బందికొమ్మును వలపలిచేతఁ గట్టిన
నరుని శుక్లము స్తంభనంబు సేయు
కృష్ణమార్జాల దక్షిణపార్శ్వశల్యంబు
కటిఁ గట్ట వీర్యంబు కదలకుండు
పొలుపొంద నేడాకు పొన్నబీజము నోట
నునిచి కూడిన బీజ ముండుఁ బడదు

ఆ.మేఁకపాలు జెముడుమ్రాకులపా ల్మణ్గు
దామరయును బాదతలమునందు
లేపనంబుఁ జేసి లేమఁ దాఁ బొందినఁ
బడదు వీర్య మెంతతడవునకును.

తా.పురుషుడు తన కుడిచేతిరోమములతో గుఱ్ఱము గాడిద యొంటె వీటియొక్క తోకలవెంట్రుకలు కలిపి త్రాడు పేని యాత్రాటితో పందికొమ్మును దనకుడిచేతికి కట్టుకొని రమించిన వీర్యము స్తంభించును. నల్లనిపిల్లియొక్క కుడి వైపుయెముకను పురుషుడు మొలయందు కట్టుకొని రమించిన వీర్యము స్తంభించును. మఱియు యేడాకు పొన్నగింజను నోటియందుంచుకొని రమించిన వీర్యము స్తంభించును. మఱియు మేకపాలు జెముడుపాలు మణుగుదామర యీవస్తువులు కలియనూరి యఱకాళ్లయందు లేపనము చేసి రతియొనర్చిన వీర్యము స్తంభించును.

ఆ.మేఁకపోతునుచ్చ మెదిపి పాపరవేరు
శిశ్నలేపనంబుఁ జేసిరేని
కుసుమనూనె కామకొసను దాఁబూసినఁ
బడదు వీర్యమెంత తడవుకును.

తా.పాపరవేరును మేకపోతుమూత్రమున నూరి దండమునకు పూసినను లేక కుసుమనూనెను దండముకొనయందు పూసినను శుక్లము స్తంభించును.

క.కప్పుపొడి కాలఁ జమరిన
నెప్పటివలె నుండు వీర్య మీయోగమునన్
దప్పులు లేవని యోగ్యులు
చెప్పిన తెఱఁగెఱిఁగికొనుడు చిత్తజరతులన్.

తా.కప్పుపొడి యఱకాలునందు రాచుకొని రమించిన వీర్యము స్తంభించును.

శ్లో.మాహిషఘృతసహదేవీతిలమధుకమలకేసరైస్తుల్యైః|
గృహచటకేన విలేపితనాభిశ్చ స్తబ్ధేన్ద్రియో రమతే||

క.వెలదామర కేసరములు
తిలలును మహిషీఘృతంబు తేనియ దండో
త్పలమూలముఁ బిచ్చుకతో
వెలయంగను నాభిఁ బూయ వీర్యము నిలుచున్.

తా.తెల్లతామరకింజల్కములు నువ్వులు గేదెనేయి తేనియ సహాదేవి మూలము వీనిని పిచ్చుకతో నూరి బొడ్డునకు బూసి రతి చేసిన శుక్లము స్తంభించును.

## దండవృద్ధిలక్షణము

శ్లో.తిలతైలఘోషటంకణమనః శిలాజాతిపర్ణరసకుష్ఠైః|
నర్ధయతి లింగముచ్చైః సప్తదినం మర్దనం విహితమ్||

ఆ.మాషటంకణమును మణిశిల జాజాకు
జలము కోష్ఠురసము తిలలనూనె
యేడుదినము లొక్కయీడుగా దండానఁ
బూయ వృద్ధి పొంది పొదలుచుండు.

తా.అయిదుగురిగింజలయెత్తు వెలిగారము మణిశిల జాజాకురసము కోష్ఠు నువ్వులనూనె రసము వీటిని కలిపి యేడుదినములు దండమునకు పూసిన దండము వృద్ధి చెందును.

శ్లో.వజ్రీదాడిమబల్కలబృహతీఫలకుష్ఠసహితభల్లాతైః|
సిద్ధం సర్షపతైలం షడ్గుణకుంభీరసే తద్వత్||

ఆ.ములకపండురసము వెలియావనూనెయు
దాడిమంబుతోలు జీడిగింజ
కుంభిరసమునందుఁ గూర్చి దండంబునఁ
బూయఁ బెరిఁగి బలిసి పొదలుచుండు.

తా.ములకపండ్లరసము తెల్లనియావనూనె దానిమ్మపండుతోలు జీడి గింజలు పినగుమ్ముడురసముతో నూరి దండమునకు బూసిన వృద్ధియగును.

శ్లో.అన్తర్ధూమం దగ్ధ్వా సైన్ధవజలశూకకమలదళవజ్రైః|
భల్లాతక్యా లేపో బృహతీరసభావితైస్తద్వత్||

క.నల్లేరును గఱదూపము
భల్లాతకి సైంధవాబ్జపత్త్రంబులచే
మొల్లలు ములకరసంబునఁ
బెల్లుగఁ బూయంగఁ గామ పెరుఁగున్ బెలుచన్.

తా.నల్లేరు కఱదూపము జీడిగింజలు సైంధవలవణము తామరఱేకులు మొల్లలు ములకచెక్కరసము యివి నూరి రసము తీసి కామదండమునకు పూసిన వృద్ధి యగును.

శ్లో.లింగం వ్రజతి వివృద్ధి మాహిషమలమిళితపూర్వమాలిప్తమ్|
మాహిషనవనీతాన్వితజలకణ్డూకుష్ఠగోమూత్రైః||

శ్లో.భల్లాతకాస్థిసంభృతమాహిషమలసర్పిషా చ కుంభికాశ్మశ్రుః|
హయగన్ధాసైన్ధవమితి లేపో లింగస్య వృద్ధికరః||

శ్లో.మధుతగరగౌరసర్షపబృహతీఖరమజరీకణాః సతిలాః|

యవకుష్టమరిచసైన్ధవహయగన్ధామాషసంయుక్తాః||

శ్లో.స్తవయుగళకర్ణపాళీధ్వజభుజశిఖరోపచయమేతాః|
ధ్రువమున్మర్దనవిధినా సతతాభ్యాసేన కుర్వన్తిః||

సీ.కాచు నెనుమువెన్న కప్పుచిప్పలయొక్క
పిష్టంబు నెనుపెంటి పెంట పెరుఁగు
నెనుపెంటినెయ్యి పెన్నేరుగడ్డయు జీడి
పండుగింజయు గోవుపంచితంబు
సైంధవలవణంబు సరిగాఁగ మర్దించి
కామఁ బూసిన వృద్ధి కలుగుచుండు
తేనెయుఁ దగరంబు తెల్లయావలు నపా
మార్గంబు యవ కోష్టు మరిచములను

గీ.దిలలు పిప్పళ్ళు పెన్నేరు ములకపండ్లు
మినుము సైంధవలవణంబు నెనయఁ గూర్చి
కంఠ భుజ యోని కుచ కర్ణ కాయములను
గలియఁబూసిన దండము బలియు రతుల.

తా.కాచు, ఎనుమువెన్న, కప్పుచిప్పలయొక్కపిండి, పెరుగు, గేదినేయి, పెన్నేరుగడ్డ, జీడిగింజ, గోమూత్రము, సైంధవలవణము, సమానభాగములుగా కలిపి నూరి దండమునకు బూసిన వృద్ధియగును. మఱియు, తేనె, గ్రంధితగరము, తెల్లనియావాలు, ఉత్తరేను, యవలు, చంగల్వకోష్టు, మిరియములు, నువ్వులు, పిప్పళ్లు, పెన్నేరుగడ్డ, ములకపండు, మినుములు, సైం ధవలవణము, ఇవి నూరి మెడ, భుజములు, మర్మస్థానము, కుచములు, చెవులు, దేహము, వీటియందు పూసికొని రమించిన దండము వృద్ధియగును.

శ్లో.భల్లాతకబృహతీఫలదాడిమఫలకల్కసాధితం కురుతే|
లింగం మర్దనవిధినా కటుతైలం వాజిలింగాఽఽభమ్||

ఆ.జీడిగింజ ములకచిగురు దాడిమపండు
చర్మ మావనూనె సహితముగను
శిశ్నలేపనంబుఁ జేసిన వర్ధిల్లు
నశ్వలింగమటుల నతిశయిల్లు.

తా.జీడిగింజ, ములకచిగురు, దాడిమపండుతోలు, ఆవనూనె, ఈవస్తు వులు కలియనూరి దండమున కుబూసిన గుఱ్ఱముయొక్కదండమువలె వృద్ధిపొందును.

శ్లో.పుటదగ్ధపద్మినీదళభల్లాతకబాలకృష్ణలవణానామ్|
భూత్యా పరిణతబృహతీఫలరసపరిపిష్టయా భవతి||

శ్లో.మహిషీమలేన మిళితం లింగం పశ్చాదనేకశో లిప్తమ్|
ముసలమివ మదనవిహ్వలయువతీజనదర్పనిర్దళనమ్||

శ్లో.సింహీఫలభల్లాతకనళినీదళసిన్ధుజన్మశైవాలైః|
మాహిషనవనీతేన చ కరంబితైః సప్తదినముషితైః||

శ్లో.మూలం హయగన్ధాయా మాహిషమలమిళితపూర్వమాలిప్తమ్|
భవతి లఘూకృతగర్దభలింగం లింగం ధ్రువం పుంసామ్||

సీ.పద్మదళంబులు భల్లాతకంబులు
నువ్వులు పిప్పళ్ళు నూరి కడవఁ
బెట్టి యగ్నిపుటంబు పెట్టి బృహస్పతీ
రసముతో నొక్కకరాటమునను
మహిషీమలంబును మఱిగూర్చి పూయ ఘో
టకలింగ మటుల దండంబు పెరుఁగు
ములకపండును హరిదళము జీడియుఁ గాచు
సైంధవలవణంబు సరవిఁ దెచ్చి

ఆ.యెనుము నేతితోడఁ నెనయంగ మర్దించి
దినములేడు బరణి నునిచిపుచ్చి
బట్టెపేడ నీటఁ బరఁగంగఁ బెన్నేరు
గలిపి పూయ కామబలము నిచ్చు.

తా.తామరరేకులు, జీడిగింజలు, నువ్వులు, పిప్పళ్లు యివి నూరి యొక కుండలో బెట్ టిదానిపై మూకుడు బోర్లించి చీలమన్నుంచి పుటము బెట్టగా వచ్చినభస్మమును బృహస్పతీఫలరసముతోడ మర్దించి గేదెపేడతో కలిపి లింగము నకు బూసికొనిన గుఱ్ఱముయొక్క లింగమువలె వృద్ధి చెందును. మఱియు ములక పండు, హరిదళము, జీడిగింజలు, కాచు, సైంధవలవణము, ఇవి గేదెనేయితో మర్దించి యేడుదినము లొకబరణియం దుంచి తరువాత గేదెపేడను గలిపిననీటిలోను పెన్నేరుగడ్డరసములోను కలిపి లింగమునకు బూసిన దండము వృద్ధి చెందును.

శ్లో.కనకరసమసృణవర్తితహయగన్ధామూలమిశ్రపర్యుషితమ్।
మాహిషమిహ నవనీతం గతబీజే కనకఫలమధ్యే॥

శ్లో.గోమయగాఢో ద్వర్తితపూర్వం పశ్చాదనేన సలిప్తమ్।
భవతి హయలింగసదృశం లింకం కఠినాంగనాదయితమ్॥

శా.పెన్నే రుమ్మెత్తపూలు నుల్లిజలమున్ బీజంబు గీలించి యం
దు న్నుమ్మెత్తఫలంబులోన నడి యం దున్మాహిషావిష్ఠియున్
వెన్నం బెట్టుచు గోమయద్రవమునన్ వేదించి కామ్యంబునన్
జెన్నారం గలందినన్ ధ్వజము వాజిప్రక్రియన్ బొల్పగున్.

తా.పెన్నేరుగడ్డ, ఉమ్మెత్తపూలు, ఉల్లి, ఇవి నూరి గింజలు తీసిన ఉమ్మె త్తకాయలో బెట్టి దానిపైన గేదెపేడను పొదిగి పుటముబెట్టి యందురాబడిన చూర్ణ మున గేదెవెన్నయు ఆవుపేడను గలిపిననీటిని గలిపి దండమునకు బూసిన గుఱ్ఱము యొక్క లింగమువలె వృద్ధి చెందును.

## భగదోషహరణ లక్షణము

శ్లో.దళకుంకుమకునటీభిర్గంజదళతాళీసతగరపాద్యైర్వా।
దళకరికేసరమాంసీరోహితశైలేయకుసుంభతగరైర్వా॥

శ్లో.లోహితపిత్తకణఘృతవిమలాంజనసైన్ధవైరథవా।
భగలేపః సౌభాగ్యం జనయతి భూయో న సన్దేహః॥

శ్లో.దాడిమపంచాంగైర్వాసిద్ధం సిద్ధార్థతైలమాతనుతే।
మాలతికాకుసుమైర్వా గుహ్యాభ్యంగేన సౌభాగ్యమ్॥

సీ.మణిశిలయున గుంకుమంబును జిత్రకం

బును నొక్కయోగమై పొల్పుఁ జెందు
హరితాళ తగరంబు లవియొక్కయోగంబు
రాష్ట్రంబు గజకేసరములదళము
తగరంబు కౌసుంభతైలంబు మాంసియు
నొకయోగమై ధాత్రి నుల్లసిల్లు
నమృతంబు పచ్చనిదైన నెఱ్ఱనిదైన
విమలాంజనములవణమును నొకటి

గీ.యావనూనెయు దానిమ్మయందు పంచ
కంబు నొక్కటి మఱి మల్లికాప్రసూన
మొకటి యన్నియుఁగూడ నీయోగములను
యోనిదోషంబు హరియించు నొక్కటొకటి.

తా.మణిశిల, కుంకుమము, చిత్రమూలము, ఇవి నూరి నీటిలో కలిపి భగ మును కడిగిన భగదోషము హరించును. మఱియు హరిదళము, గ్రంధితగరము కలిపి భగమును కడిగినను, దుంపరాష్ట్రము, నాగకేసరములు, హరిదళము, గ్రంధితగరము కుసుమనూనె, జటామాంసి ఇవి నూరి నీటిలో కలిపి భగమును కడిగినను, నెయ్యి పచ్చదైనను యెఱ్ఱనిదయినను, విమలాంజనము, సైంధవలవణము వీనిని నీటిలో కలిపి భగమును కడిగినను, ఆవనూనె, దానిమ్మచెట్టుయొక్క పట్ట, ఆకు, పువ్వు, వేరు, పండు వీనిని కలియనూరి నీటిలో కలిపి భగమును కడిగినను, జాజిపువ్వులు నీటి యందుంచి యానీటితో భగమును కడిగినను భగదోషము హరించును.

శ్లో.సమభాగైర్గదపద్మకకర్పూరోశీరపుష్కరాంబుధరైః|
సితవర్షపజం తైలం సమస్తభగదోషమపనయతి||

శ్లో.నింబకషాయక్షాలనమమలాంజననింబసారధూపో వా|
జీవచ్ఛంబూకాంబుక్షాలనమహ్నాం త్రిసప్తకం తద్వత్||

సీ.కర్పూరములు పద్మకంబులు కోష్ఠులు
పుష్కరఫలపత్త్రములు నుశీర
ములు నాగముస్తెలు కలియంగ సమభాగ
ములఁ జేసి యావనూనె లలిఁగలిపి
భగమునఁ బూసిన భగదోషములు పాయు
నింబకషాయజలంబులందుఁ
గడిగినఁ బాయు దుర్గంధంబు మఱి వేప
బంక ధూపంబునఁ బాయునటులె

గీ.కప్పచిప్పలనీటను గడిగిరేని
యోనిదుర్గంధ మడఁగు నీయుక్తితోడఁ
గామినులు యోనిఁ బూయఁగాఁ గ్రమము తెలియ
మోహ ముదయించు నెంతయు ముదముఁ బెంచు.

తా.కర్పూరము, పద్మకము, కోష్టు, తామరకాయ, తామరయాకులు, వట్టివేరు, నాగముస్తెలు, సమభాగములుగా కలిపి నూరి యావనూనెయందు కలిపి భగమునకు బూసినను, వేపచెక్క కషాయమున భగము కడిగినను, వేపబంకను యోనికి ధూపము వేసినను, కప్పచిప్పలనీరుతో భగమును కడిగినను భగదోషములు హరించును.

శ్లో.పయసా సనాళమబ్జం పిష్ట్వా స్మరసదనమధ్యనిక్షిప్తమ్|

హరిణీమివ కరిణీమపి కురుతే స్మరసమరసుఖహేతుమ్||

క.పాలు సనాళకకుముదము
పోలఁగ నూరించి యోనిపుటమునఁ బూయన్
స్త్రీలకు ప్రాయము గడిచినఁ
జాలగ బిగిచూపు భగము సమ్మోద మందన్.

తా.పాలును తామరనాళములును కలియనూరి భగముఖంబున బూసిన యెడల యోని చాలా బిగువుకలుగును.

శ్లో.చరటీగృహగణ్డాపదవృషగోపానాం తు చూర్ణమేకైకమ్|
అజగవ్యతక్రనేకాత్ సంకోచయతి స్మరాగారమ్||

క.ఇలనెఱ వృషగోపం బి
క్కల నూరుచు మేఁకచల్ల గలిపియుఁ ద్రావన్
వలరాజునిల్లు మిక్కిలి
వలనై సుఖ మిచ్చు బాలవనితను బోలున్.

తా.ఎఱయు, ఆరుద్రపురుగును కలియనూరి మేకచల్లలో కలుపుకొని తాగిన దానిభగము పిన్నవయస్సుదాని భగమువలె బిగువుగా నుండును.

శ్లో.ఆసితభుజగముఖనిహితా మూత్రమృదసితేన వేష్టితా యస్యాః|
సూత్రేణాస్తే తస్యాః క్రమశః సంకోచయతి యోనిమ్|
ప్రకృతిం యాతి పునఃసా తత్త్వాఖ్యానేన వా తదుద్ధరణాత్||

ఉ.నల్లనిపామునోట విటనాయకు మూత్రపుమన్నుఁ బోయుచున్
దెల్లనిత్రాటఁ గట్టి సుదతీమణి మూత్రపుఁజోటఁ బాతినన్
సల్లలితంబు యోని కడుసన్నమగు న్సుమి ప్రాఁతఁబుచ్చినన్
దొల్లిటయట్లయౌను భగదోషము బాయు ననేకభంగులన్.

తా.తనవిటుడు మూత్రముపోసినచోటియందు మన్నును తెచ్చి నల్లని పామునోటియందు పోసి తెల్లనిదారముతో దానిమూతిని బిగగట్టి తాను మూత్రము పోయు స్తలమున పాతిపెట్టినయెడల నాస్త్రీ భగము బిగువుగానుండును, అట్లు పాతిపెట్టబడిన పామును పెల్లగించి మూతికికట్టబడియున్న దారమును విప్పిన యెప్ప టివలె బిగువులేకయుండును.

శ్లో.పికనయనబీజలేపః కురుతే సంకోచమేకదినమ్|
అధరోర్ధ్వాగ్రస్థితయోర్యథాక్రమం గోవిషాణయోశ్చూర్ణైః|
సంకోచం చ ప్రకృతిం ప్రజతి భగో నాభిలేపేన||

క.లోనికిఁ గూడుచు వంగిన
ధేనువు శృంగముల నూరి స్త్రీజనములకున్
యోనులఁ బూసిన సన్నము
లై నెగడెడి నెంతప్రౌఢలైనను రతులన్.

తా.లోనికి వంగిన యావుకొమ్ముల నూరి భగమునకు బూసివయెడల ప్రౌఢ స్త్రీయయినను బాలస్త్రీవలె యోని బిగువుగా నుండును. మఱియు కోకిలపిట్ట యొక్క కంటిగుడ్లను దెచ్చి భగమునకు పులిమినయెడల బిగువుగానుండును.

శ్లో.అనయో రేవ యథాక్రమమాలిప్తే మదనమందిరే చూర్ణైః|

పతనోత్థానే భవతః రతోద్యమాన్తేఽపి లింగస్య॥

క.ఇటువంటి యావుకొమ్ములె
పుటచూర్ణము చేసి యోనిఁ బూసియుఁ బిదపన్
విటుఁడు రమింపఁగ దండము
తటుకునఁ బడు లేచుచుండు ధరఁ బలుమాఱున్.

క.వాడియగు నావుకొమ్ములు
పోడిమిగా నూరి యోనిఁ బూసిన నందునన్
గూడిన శిశ్నము వాడక
నాడెంబై యుండు వీర్యనాశన మైనన్.

తా.పైన చెప్పంబడినటువంటి యావుకొమ్ములను పుటము పెట్టినభస్మమును భగమునకు బూసి రమించిన విటునియొక్క దండము ఎగసిపడుచుండును. మఱియు ఆవుకొమ్ములను నూరి భగమునకు పూసి రమించినయెడల పురుషునికి శుక్లము పడి పోయినను దండము వాడక నిలువబడియుండును.

శ్లో.రజనీద్వయరాజీవోద్భవకేసరదేవదారుభిర్లేపః।
మన్మథసద్మని విహితః కరోతి సంకోచసౌభాగ్యే॥

క.పసుపులు రెండును సురతరు
బిసరుహకింజల్కములును బృధుచూర్ణంబై
యెసఁగఁగ యోనిన్ బూసినఁ
బసగా సంకోచసుభగభాగ్యము లమరున్.

తా.పిండిపసుపు, చాయపసుపు, పద్మకింజల్కములు, దేవదారుచెక్క ఇవి గంధము తీసి భగమునకు లేపనము చేసిన బిగువుగా నుండును.

శ్లో.ఘృతమధుసైన్ధవలేపాదపి హరిణీనాంచ తరుణీనామ్।
బాలానామబలానాం విశాలతాం వ్రజతి రతినిలయః॥

క.గొలిమిడివిత్తుల పిండిని
గలియంగా యోనిఁ బూయ గడుసన్న మగున్
వెలయఁగ మధుఘృతసైంధవ
జలములచేఁ గడుగ మొదటి చక్కినె యుండున్.

తా.గొలిమిడివిత్తులు మెత్తగా నూరి భగమునకు బూసిన బిగువుగానుండును. మఱియు తేనె, నేయి, సైంధవలవణము, ఇవి నూరి భగమునకు పూసి నీళ్ళచేత కడిగిన బిగువుగా నుండును.

## రోమనాశన లక్షణము

శ్లో.హరితాళతాళబీజే సిన్ధురఘననాదకన్దళీక్షారః।
ఇక్ష్వాకుబీజకునటీవచాస్నుహీమూలమంజిష్ఠాః॥

శ్లో.వరుణగిరికర్ణికే చ స్నుహ్యాఃక్షీరేణ సప్తధా సిక్తే।
సిక్త్వేక్షాకురసైరథ సంపిష్ట్వా కల్పయేత్ కల్కమ్॥

శ్లో.తత్కల్యార్ధ్వతైల కన్దలికా బహుళవారిణా పక్వ్యా।
రోమోత్పాటనపూర్వం కురు లేపం తేన తైలేన॥

సీ.హరితాళతండులీయకబీజములు సైంధ
వము పద్మబీజము ల్వసయుఁ గూర్చి
జెముడువేరును మణిశిల వెట్టిసొరచెట్టు
విత్తులు పక్కియవేరుఁ గూర్చి
వరుణయు క్షారంబు గిరికర్ణికయు మేఁక
పాలు మఱి జెముడుపాలఁ గూర్చి
యెనయఁ బిష్టముఁ జేసి యేడురాత్రులు నిల్పి
వెదురాకురసమునఁ బొదవి దాని

గీ.యర్ధమును నూనెఁ గొని యంత నరఁటిరసము
కలిపి యది వండి నూనె చిక్కగను బుచ్చి
ముందుగల కేశములఁ దీసి యందుఁ బూయ
మస్తకంబైనఁ జెక్కిలిమాడ్కి నుండు.

తా.హరిదళము, చిట్టికూరవిత్తులు, సైంధవలవణము, తామరవిత్తులు, వస, జెముడువేరు, మణిశిల, వెట్టిసొరచెట్టువిత్తులు, పక్కిచెట్టు వేరు, ఉలిమిరిచెట్టు వేరు, చవుడు, దింటెనవేరు, యీవస్తువులు మేకపాలు, జెముడుపాలు, కలిపి యేడుదినము లందూరనిచ్చి వెదురాకురస మొకశేరును, నూనె అర్ధశేరును, అరటి సొన అర్ధశేరును కలిపి చిక్కనగునటుల వండి భగమునకు నూనె రాచి యావండిన యౌషధమును నలుగుబెట్టిన వెండ్రుకలు మొలువక నున్నగా నుండును.

శ్లో.యది మస్తకమపి నేతుం తపకౌతుకమస్తి హస్తతాళతులామ్।
ద్విత్రాణామపి చైషామేష విధిః సహరితాళానామ్॥

క.హరిదళము కుసుమనూనెయుఁ
బొరికేశము లూడ్చి పూయఁ బుట్టక మానున్
హరిదళ కింశుకభస్మము
నిరవుగ నటువలెనె పూయ నెటువలె నుండున్.

తా.హరిదళము, కుసుమనూనె, యీరెండును గలిపి భగముమీది వెండ్రు కలు తీసి పూసిన యెన్నటికిని వెండ్రుకలు పుట్టకయుండును. మఱియు హరిదళము మోదుగబూడిదెయు, కుసుమనూనెతో కలిపి పైవిధముగా పూసిన నదేవిధముగా జరుగును.

శ్లో.శాతయతి శంఖచూర్ణం లోమానిపలాశభస్మహరితాళమ్।
కౌసుంభతైలమప్యుత్పాటనపూర్వం విలేసనాత్త ద్వత్॥

ఆ.శంఖచూర్ణమందు సమముగా మోదుగ
భస్మ మరిదళంబుఁ బరఁగ నుంచి
జలమునందు నవ్వి కలిపిరుద్ధ మఱియుఁ
గుసుమనూనె రుద్దఁ గురులు వీడు.

తా.శంఖచూర్ణము మోదుగబూడిదె, హరిదళము ఈమూఁడును కలిపి రాచిన వెండ్రుకలు రాలిపోవును. కుసుమనూనెను రాచినను వెండ్రుకలు రాలి పోవును.

శ్లో.షడ్భాగాద్ధరితారాదేకో భాగశ్చ కింశుకక్షారాత్।
తద్వచ్చ శంఖచూర్ణాదితి శాతనుముత్తమం లోమ్నామ్॥

గీ.అరిదళము నారువంతులు మఱియునొక్క
వంతు మోదుగబూడెదఁ బంచి కలిపి

నీటితో నూరి పట్టింప నిశ్చయముగ
వెండ్రుకలు దేహమువనుండి వీడిపోవు.

తా.హరిదళ మారుభాగములును మోదుగబూడిదె యొకభాగమును నీటిలో గలిపి పూసిన వెండ్రుక లూడును.

## గర్భహరణ లక్షణము

శ్లో.అమలామలాంజనయుతా పీతా శీతాంబునా హరతి|
గర్భమృతౌ భగనిహితం ఘృతమధుయుక్తం పలాశబీజం వా||

శ్లో.తండులజలేన పీతం మూలం జ్వలనస్య వా జయన్త్యా వా|
గర్భఘ్నం భగనిహితం లవణం కటుతైలయుక్తం వా||

సీ.విమలాభ్రకమును సౌవీరము సమముగా
చిట్టెపురాయిని చేర్చి నూరి
ఋతుకాలమునను నెలఁతుక చల్లనినీటఁ
ద్రాగిన యాపెగర్భము హరించు
కురుజుతేనెయు నేయిఁ గూర్చియు మోదుగ
విత్తులపప్పున పెరయనూరి
ఋతుకాలమునను నెలఁతుగ భగంబున
నుంచ గర్భంబు హరించిపోవు

గీ.ఉప్పు పొడిచేసి కటుతైలయుక్తముగను
పత్త నునిచిన గర్భము వదలిపోవు
కడుగునను చిత్రమూలము కలిపి త్రాగ
గర్భహరణంబుఁ గాంతురు కాంత లవని.

తా.చిట్టెపుఱాయి, అభ్రకము, సౌవీరము నీమూఁడింటిని గలిపి ఋతు కాలమందు చల్లనినీటితో త్రాగిన గర్భము నశించును. మఱియు మోదుగవిత్తులు నెయ్యి, తేనెతో నూరి ఋతుకాలమందు భగమునం దుంచిన గర్భము నశించును . చిత్రమూలము నూరి కుడితిలోఁ గలిపి త్రాఁగిన గర్భహరణమగును. మఱియు కటు తైలమున నుప్పును గలిపి భగమందుంచిన గర్భహరణమగును.

శ్లో.శైవలకేసరబీజం మూలం వా చమ్పకస్య వా కణయా|
గర్భం రుణద్ధి పీతం కటుతైలం వా జరత్సుదయా||

వ.నాచుతోఁ గూడిన పులిగోరువేరు కడుపు పోఁగొట్టును. జరత్సుధతోడి కటుతైలమైన నట్లు చేయును.

## గర్భోత్పత్తి లక్షణము

శ్లో.ఋతుదివసే ఘృతసహితం పీత్వా నవనాగకేసరస్య రజః|
దుగ్ధమనుపీయ రమణీ రమణగతా గర్భిణీ భవతి||

క.ఋతుదివసంబునుఁ గామిని
ఘృతసహితముగాఁగ నాగకేసరరజమున్
సితదుగ్ధయుతముఁ గ్రోలిన
సుతుఁ డుద్భవమందు గర్భసూచక మగుచున్.

తా.స్త్రీ ముట్టుయైనదినమున నాగకేసరములయొక్కపొడిని నేయితో కలిపి భక్షించి యావుపాలను దాగిన గర్భోత్పత్తియై సుతు డుద్భవించును.

శ్లో.మూలమపి లక్ష్మణాయాః ప్రాజ్యేనాఽఽజ్యేన నాసికాపీతమ్|
తండులజలేన పీతా దదాతి పుత్రం జటామాంసీ||

గీ.కుడితియును జటామాంసియుఁ గూడఁజేసి
క్రోలినను, లక్ష్మివంజి సమూలముగను
ఘృతముననను నూరి యద్దానిఁ గేలనుంచి
గాలి పీల్చిన గర్భముఁ గాంచు కాంత.

తా.లక్ష్మీవంజిచెట్టువేరును నేతితోఁ గలిపి ముక్కువద్ద నుంచుకొని గాలి పీల్చినను, జటామాంసిని గుడితితోఁ గలిపి తాగినను స్త్రీకి గర్భము కలుగును.

శ్లో.గోరేకవర్ణభాజః పయసా వన్ధ్యాపి ధారయేద్గర్భమ్|
పీత్వా కేకిశిఖాయాః పుత్రంజీవస్య వా మూలమ్||

ఆ.ఆవువర్ణ మొక్కటైనది యాయెనా
దానిపాలతోడఁ బూని పుత్ర
జీవివేరునైన శిఖమూలమైన సే
వింప గర్భ మగును వెలఁదులకును.

తా.ఒక్కరంగుగల యావుయొక్క పాలను దెచ్చి యందు పుత్రజీవివేరు నైనను లేక నెమిలియడుగుచెట్టువేరునయినను కలిపి త్రాగిన కాంతకు గర్భో త్పత్తి యగును.

శ్లో.పీత్వాఽమునైవ పయసా రజసి స్నాతా చ లక్ష్మణామూలమ్|
సప్తక్షాలిత శాలీభక్తం భుక్త్వా సుతం లభతే

ఆ.చెఱఁగు మాసినట్టి చెలి లక్ష్మివంజిమూ
లమును దెచ్చి పాయసమున వండి
తినినయెడల నట్టి తెఱవకు గర్భమై
తనయుఁ డుద్భవించు మునిమతంబు.

ఆ.చెలువలక్ష్మివంజిచెట్టుమూలం బేడు
మార్లు నీళ్ళ ముంచి మఱియు నెత్తు
నట్టినీటి వండు నన్నంబు సేవింపఁ
దనయుఁ డుద్భవించు మునిమతంబు.

తా.లక్ష్మీవంజిచెట్టుయొక్క వేరును తెచ్చి పరమాన్నమున వండి ముట్టయిన వెలది భక్షించినను లేక యావేరును యేడుపర్యాయములు నీటియందు కడిగి యా కడిగిననీటితో వండినయన్నము తిన్నను యావెలదికి గర్భోత్పత్తియగును.

## గర్భస్రావ నివారణోపాయము

శ్లో.పీతం మధుసైన్ధవయుతముత్పలరాజీవమూలశాలూకమ్|
దళమపి గోధావల్యాః సాఽఽజ్యం రక్తస్రుతిం హరతి||

శ్లో.ఉత్పలముపలామధుకం శ్యామలతా లోధ్రచన్దనోపేతమ్|
తండులజలేన పీతం గర్భస్రావం నివారయతి||

శ్లో.మధుకకుశకాశసర్పిః సీతోత్పలైః సహితమథ దుగ్ధమ్।
ముస్తాన్వితమపి పేయం గర్భస్రావే చ శూలే చ॥

సీ.కమలమూలము నల్లకలువదుంపయు రేఁగు
దుంపయు మధువు చేదుఁదగునుప్పు
నవనీతమును నెద్దునాలుకవేరును
గలిపి త్రావ భగరక్తము హరించుఁ
బంచదారయును నుత్పలమూలమును యష్టి
మధుక లోధ్ర ప్రేంకణ ధృతసుమము
తండులజలముతోఁ ద్రావిన గర్భపు
స్రావరుధిరమెల్లఁ జక్కనౌను

ఆ.పాలు పంచదార భద్రముస్త కుశలు
తెల్లఁదామరయును రెల్లు మధుక
ఘృతయుతంబుఁ ద్రావ నతివకు గర్భంపు
శూల రక్తరుజము చులకనగును.

తా.తామరదుంప, నల్లకలువదుంప, రేఁగువేరు, తేనె, సైంధవలవణము, వెన్న, బెండవేరు, వీటిని నూరి భక్షించిన గర్భరక్తస్రావము హరించును. పంచ దార, నల్లకలువదుంప, యష్టిమధుకము, లొద్దుగపువ్వు, ప్రేంకణముపువ్వు, యివి కడుగులో కలుపుకొని తాగిన గర్భస్రావము హరించును. పాలు, పంచదార, భద్రముస్తలు, కుశలు, తెల్లతామరదుంప, రెల్లు, యష్టిమధుకము, వీటిని నూరి నేతితో కలిపి త్రాగిన గర్భస్రావమును శూలలును హరించును.

## సుఖప్రసవలక్షణము

శ్లో.ఖర్వశ్రీపుచ్ఛజటాం పుష్యార్కోత్పాటితాం కటౌ బద్ధా।
పీత్వా చ లగ్నగర్భా విముచ్యతే గర్భిణీ భటితి॥

క.పారువముతోఁక యాఁకలు
ధీరతపుష్యార్కమునను దెచ్చి త్రికమునన్
నేరుపుతోఁ గట్టియు గో
క్షీరముఁ ద్రావింపఁ జూలు చెడకయ నిలుచున్.

తా.పావురముతోకయాకలు పుష్యమీనక్షత్రముతో కూడిన యాదివార మున దెచ్చి స్త్రీవెన్నుపూసకు గట్టి పాలు తాగించినయెడల గర్భము చెడక నిలుచును.

శ్లో.కృత్వా చ సప్తఖండం గుంజామూలం నిబధ్య కటిదేశే।
సూత్రైః సప్తభిరచిరాత్ సుఖప్రసూతిర్మూఢగర్భాపి॥

క.గురువిందవేరు తునుకలు
పొరినేడుగఁ జేసి యేడుప్రోఁగులత్రాటన్
దరుణిత్రికంబునఁ గట్టిన
నరుదారసుఖప్రసూతి యగు గర్భిణికిన్.

తా.గురువిందవేరు నేడుతునకలుగా జేసి యేడురంగుల ప్రోఁగులు మెలియ వేసినత్రాటను యేడుచోటుల గట్టి యాత్రాడును గర్భిణీస్త్రీయొక్క వెన్నుపూ సకు గట్టినయెడల యాస్త్రీ సుఖప్రసూతియగును.

శ్లో.సితపికలోచనచరణం చవర్ణపూర్వం చ కర్ణపూరణతః।

అతిగర్భపీడితాంగీ వనితౌ సుఖప్రసూతిమాతనుతే॥

ఆ.తెల్లకోకిలాక్షి మెల్లన నమలుచు
గర్భిణీవధూటి కర్ణమునను
గాలిఁ బార నూద గర్భంబు స్రవియించు
నిందులకును వేఱె మందులేల.

తా.తెల్లములుగొలిమిడివేరును తెచ్చి పుక్కిటనుంచుకొని నమలుచు బిడ్డను కనలేక కష్టపడుస్త్రీయొక్క చెవులయం దూదినయెడల వెంటనే ప్రసవమగును.

శ్లో.మూలం కృష్ణబలాయాః సితగిరికర్ణీజటాయుతం లిప్త్వా।
క్షిప్తం యోనా జనయతి సుఖప్రసూతిం మూఢగర్భాయాః॥

క.నల్లనిముత్తవపులగము
తెల్లనిదింటెనయు రుద్రదేవునిజడయున్
వ్రేళ్ళమరఁబుచ్చి నూరుచు
నొల్లవ గర్భిణికి యోని నునుప స్రవించున్.

తా.నల్లని చిట్టాముదపుఁ జెట్టువేరు, తెల్లదింటెనవేరు, రుద్రజడవేరు ఈమూటిని నూరి బిడ్డను కనలేక కష్టపడుస్త్రీభగమునం దుంచినయెడల వెంటనే ప్రసవించును.

శ్లో.కటిబద్ధమరుణసూత్రైః శ్వేతబలామూలమత్రమలపాతమ్।
కురుతే హ్యాపాదలిప్తం క్షిప్రమేక్ష్వాకవం మూలమ్॥

గీ.బిడ్డఁ గన్నవెనుక మాయ వెడలనట్టి
యతివమొల నెఱ్ఱదారమునందు తెల్ల
ములకవేరు లునిచి గట్టవలయు మఱియు
చేదుసొరవేరు రసమును చెలియపాద
యుగమునను బూసినను మాయ యుండ దింక.

తా.బిడ్డనుగని తరువాత మాయపడనిస్త్రీకి తెల్లములకవేరులు యెఱ్ఱని త్రాళ్లతో మొలకు గట్టినను, చేదుసొరవేరురసము పాదములవరకూ పూసినను మాయవెడలును.

## భగశూలహరణ లక్షణము

శ్లో.పిష్ట్వా క్షిప్తం యోనౌ మూలం ఖరమంజరీపునర్నవయోః।
నవసుతాయాః సకలం యోనిగతం శూలమపనయతి॥

క.గలిజే ర్వెంపలి దూసరి
కలియంగా నూరి బిడ్డఁ గని నొచ్చిన యా
లలనభగంబునఁ బూసిన
నలవడు నెటువంటి శూలయైనను మానున్.

తా.గలిజేరువేరు, వెంపలివేరు, దూసరివేరు యీ మూడింటిని కలియనూరి బిడ్డనుకనినొచ్చిన స్త్రీయొక్క భగమునకు పూసిన భగశూల మానును.

శ్లో.కార్పాసబీజసాధితఘృతమున్దురుమాంససిద్ధతైలం వా।
భగభరణేన తదీయం సూతాయాః శూలమపనయతి॥

ఆ.మూషకంబుమాంసమునఁ దీయునూనె యే

న్బుత్తివిత్తుయొక్క రసమునైనఁ
బుత్రవతికి యోనిఁ బూసినఁ గ్రిమి చచ్చు
నందు నొప్పులెల్ల నపహరించు.

తా.ఎలుకమాంసమునుండి తీయు నూనెనైనను పత్తివిత్తులయొక్క నూనె నైనను బిడ్డనుకన్నదాని భగమునకు పూసిన భగశూల హరించును.

శ్లో.గోమయరసగోమూత్రైః పేషణపూర్వం ఘృతేన సహలోపాత్|
హన్తి కృమీన్ కామౌకసి పత్రం వరుణస్య సూతాయాః||

ఆ.ఆవుపేడరసము నావుమూత్రమునందు
నులిమిరాకు నూఱి మెలపియుంచి
ఘృతముతోడఁ గూర్చి సుతుఁ గన్నకామిని
యోనిఁ బూయఁ గ్రిములు మానిపోవు.

తా.ఆవుపేడరసమును ఆవుమూత్రముతో కలిపి దానిచే ఉలిమిరాకును నూరి దానిని నేతిలో కలిపి భగమునకు బూసిన భగమునందుగల పురుగులు హరించి భగశూల నశించును.

## యోనిదుర్గంధహరణ లక్షణము

శ్లో.కుష్ఠకమలబాలోత్పలసాధితతైలేన పూరణం యోనేః|
అభయగుడధూపనమథ నింబక్వాథేన ధౌతాయామ్||

శ్లో.పిష్ట్వా జాతీకుసుమం జ్యేష్ఠీమధుపంచపల్లవానథవా|
తైలేన యోనిపూరణమాతపతప్తేన గన్ధఘ్నమ్||

సీ.కువలయకేసరకోష్ఠువు తైలంబుఁ
గలపూయ యోని దుర్గంధ మణఁగు
కరకకాయలు ద్రాక్షఖండంబు ధూపంబు
గాఁజేయ యోని దుర్గంధ మణఁగు
వేఁపచెక్కలు వోసి కాపించు రసమునఁ
గడుగఁగ యోని దుర్గంధ మణఁగు
మాలతీకుసుమంబు మధుకంబు పంచప
ల్లవములు నూనెతోఁ దవులఁజేసి

ఆ.యట్టినూనె నెండఁబెట్టి కాఁగినఁ దెచ్చి
యోనిలోనఁ బూసి యునుప నిట్లు
కడఁగిరేని యెట్టి కంపైన మానును
సకలవైద్యశాస్త్రసమ్మతంబు.

తా.కలువకింజల్కములు, తామరకింజల్కములు, చెంగల్వకోష్ఠు, వీటి తైలము తీసి బిడ్డకన్నదాని భగమునకు పూసిన దర్గంధ మణగిపోవును. మఱియు కరికకాయలు, ద్రాక్షఖండము, ఈ రెండువస్తువులు కలియనూరి బిడ్డనుకన్న భగ మునకు ధూపము వేసిన దుగ్గంధమడగిపోవును. వేపచెక్కలు వేసి కాచిన నీళ్లతో బిడ్డనుకన్నదాని భగమును కడిగిన దుర్గంధమణగును. జాజిపువ్వులు యష్టిమధు కము పంచపల్లవములు, అనగా-(మామిడిచిగురు, వెలగచిగురు, నేరేడుచిగురు మాదీఫలచెట్టుచిగురు, మారేడుచిగురు.) వీనిని నూనెలో వైచి సూర్యరశ్మియందు కాచి యానూనెను బిడ్డను కని నొచ్చినదాని భగమునకు పూయునెడల దుర్గంధ మణగును.

## ప్రసూతిభగసంకోచ లక్షణము

శ్లో.సూరగోపకీటచూర్ణం మిళితం మూలేన కారవేల్లస్య|
స్మరమందిరమభ్యంగాత్ సంకోచయతి ప్రసూతాయాః||

ఆ.ఇంద్రగోపమంబు నెనయఁ గాకరవేరు
నూరి సమము చేసి నూనెఁ గలిపి
బిడ్డఁ గనియు మిగులఁ బెంపైన యోనిపైఁ
బూయఁ గొంచెమగును బొలఁతులకును.

తా.ఆరుద్రపురుగు, కాకరవేరు, యీ రెండువస్తువులు సమముగా నూరి నూనెయందు కలిపి బిడ్డకన్నదాని భగమునకు పూసిన బిగువగును.

## స్తన్యవృద్ధి లక్షణము

శ్లో.దుగ్ధేన పిష్టపీతాః స్తన్యం తన్వన్తి కమలతండులకాః|
పుష్కరరుహపుష్కరమివ సప్తాహాఽభ్యాసయోగేన||

క.పాలును దామరవిత్తుల
ధూళియు సేవించెనేనిఁ దొయ్యలి చనులన్
బాలుబ్బు జలజపుష్కర
మూలంబుల నేడుదివసములు గొననుబ్బున్.

తా.తామరవిత్తులపిండిని పాలతో కలుపుకొని తాగినయెడల చన్నుల యందు పాలు వృద్ధియగును. మఱియు, తామర మెట్టతామర దుంపలను యేడు దినములు భక్షించిన చన్నులయందు పాలు వృద్ధి చెందును.

శ్లో.జయతి జయస్తనకోపం విశాలమపి లేపనాద్విశాలాయాః|
అస్కన్దతి కన్దోపి చ కుమారికాయాః సమం నిశయాః||

క.కలబందచెట్టు పలుకులు
కలియంగా నూరి మిగుల ఘలమిలకానౌ
జలజానన చన్నులపై
నలికిన నుద్రేక ముడిగి యలవడియుండున్.

తా.కలబందమానులోనిపలుకులను కలయనూరి బిడ్డనుకన్నదాని చన్ను లకు పూసిన పెరుగకయు వాలబడకయు వట్రువగా నుండును. ఇంద్రవారుణి తీఁగరసము పూసిన స్తనవర్ధనమడఁగును.

## ప్రసవస్త్రీగర్భము కొలఁదియగు లక్షణము

శ్లో.సూతాయాః కృశముదరం పీతం తక్రేణ మాలతీమూలమ్|
ఘృతమధు లీఢా చోషసి కరోతి ధాత్రీ సమం నిశయా||

ఆ.జాజివేరుఁ దెచ్చి చల్లతోఁ ద్రావిన
బిడ్డఁగన్నకడుపు పిన్నదగును
పసుపు ఘృతము ధాత్రిఫలము తేనియఁ ద్రావ
బిడ్డఁగన్నకడుపు పిన్నదగును.

తా.జాజివేరు నూరి చల్లతో త్రాగినయెడల బిడ్డకనినదానికడుపు చిన్న దగును. పసుపు, నేయి,

ఉసిరికకాయ, ఇవి నూరి తేనెతో తాగినను బిడ్డకనిన దానికడుపు చిన్నదగును.

## దేహదుర్గంధనాశన లక్షణము

శ్లో.సహకారదాడిమత్వక్మిళితం శంఖశూర్ణలేప ఇవ|
చించాకరంజబీజై ర్లేపోపి క్షిపతి దౌర్గన్ధ్యమ్||

శ్లో.కకుభకుసుమజంబూదళలోధ్రైరుద్వర్తనం చ సమభాగైః|
హరతి నిదాఘే విహితం ఘర్మాదిజదేహదౌర్గన్ధ్యమ్||

శ్లో.రోధ్రోశీరశిరీషపద్మకచూర్ణేన మిళితదేహస్య|
గ్రీష్మేపి త్వగ్దోషాః స్వేదప్రభవా న జాయన్తే||

శ్లో.మలయజకాశ్మీర జలఘులోధ్రతగరవాలకైశ్చ సమభాగైః|
సకృదపి కృతముద్వర్తనమతనుం తనుగన్ధమపనయతి||

సీ.దాడిమోత్పలచూత తత్పల్లవము శంఖ
ములసున్నమున మేన నలఁదిరేని
చింతగింజలు కానుగుచెట్టుగింజలు నూరి
కలిపి దేహంబున నలఁదిరేని
పెనుమద్దిచెట్టు పువ్వును లోధ్ర నేరేడు
దళముల నెమ్మేన నలఁదిరేని
దిరిసెన లొద్దుగు విరులు పద్మకమును
కలనూరి నెమ్మేన నలఁదిరేని

గీ.చంద నాగరు కాశ్మీరజలము లోధ్ర
తగరమును గూర్చి సమభాగముగ ఘటింపఁ
గలయ నెమ్మేన నొకసారి యలఁదిరేని
దేహదుర్గంధ మణఁగు సందేహ మేల.

తా.దానిమ్మచిగుళ్లు, కలువపూలు, మామిడిచిగుళ్లు, శంఖములసున్నము, ఇవి నూరి దేహమునకు నలుగు పెట్టిన దుర్గంధమణగును. చింతగింజలు, కానుగుగింజలు కలియనూరి దేహమునకు నలుగు పెట్టిన దుర్గంధమణగును. పెద్ద మద్దిపువ్వులు, లొద్దుగుదళములు, నేరేడుచిగుళ్లు, ఇవి కలియనూరి దేహమునకు నలుగు పెట్టిన దుర్గంధమణగును. దిరిసెనపూలు, లొద్దుగుపూలు, పద్మకాష్ఠము, ఇవి కలియనూరి దేహమునకు నలుగు పెట్టిన దుర్గంధమణగును. మంచిగంధము, అగరు, కుంకుమపువ్వు, కురువేరు, లొద్దుగుపువ్వు, గ్రంధితగరము ఇవి సమభాగ ములుగా కలియనూరి దేహమునకు నలుగు పెట్టిన దుర్గంధమణగును.

శ్లో.బిల్వశివాసమభాగైర్లేపాద్భుజమూలగన్ధమపనయతి|
పరిణతతిన్తిడికాన్వితపూతీకరంజోత్థబీజం వా||

క.మాలూర శివాఫలముల
వాలాయము నూరి బాహుపార్శ్వములందున్
జాలఁగఁ బూయఁగ నక్కడ
దూలయు దుర్గంధచయము తొలఁగున్ బెలుచన్.

తా.మాలూరఫలము కరక్కాయ ఈరెంటిని నూరి చంకలయందు బూసు కొనిన నచ్చటనుండు దురదయు దుర్గంధమును తొలగును.

ఆ.చింతపండులోనఁ జిక్కినగింజల
పప్పు కాన్గుగింజపప్పుఁ జేర్చి
కలయనూరి చంక నలఁదిన నచ్చోటి
కంపు విడిచి మంచి కంపు వెలయు.

తా.చింతగింజలపప్పు, కానుగుగింజలపప్పు ఈ రెండును నూరి చంకల యందు పూసుకొనిన దుర్గంధమణగును.

## ముఖదుర్గంధహరణ లక్షణము

శ్లో.అస్వాదితా చ సకృదపి ముఖగంధం సకలమపనయతి|
త్వగ్బీజపూరకఫలజా పవనమవాచ్యం చ నాశయతి||

ఆ.మంచితేనెతోడ మాదీఫలపుఁబండు
తోలు నమలిరేని మేలుగాఁగ
ముఖముకంపు మాను మొనయంగ నోటను
మాటలాడు కంపు మానుచుండు.

తా.మాదీఫలముతోలు, మంచి తేనెతో నమలిన ముఖముయొక్కయు నోటియొక్కయు దుర్గంధమణగును.

శ్లో.కుష్ఠై లవాలు కైలాయష్ఠీమధుముస్తధాన్యకృతకఫలః|
హరతి ముఖగన్ధమఖిలం క్షిపతి రసోనాదికం గన్ధమ్||

క.ముస్తలు రెండేలంకులు
కుస్తుంబరి యష్టి మధువు కోష్ఠువులును వి
న్యస్తముగ నూరి గళమున
విస్తరముగ నిడినఁ గంపు విడుచును నోటన్.

తా.నిడుముస్తె, నాగముస్తె, ఏలకులు, కొతిమిరి, యష్టిమధుకము, చంగ ల్వకోష్టు ఇవి నూరి కంఠమునం దుంచుకొనిన నోటియొక్క దుర్గంధమణగును.

శ్లో.జాతిఫలజాతి పత్రీఫణిజ్జవాహ్లీకకుష్ఠసంచరితా|
అపహరతి పూతిగంధమ్ ముఖవివరపరిస్థితా గుటికా||

ఆ.జాజిపత్రికంబు జాజికాయయు హింగు
కోష్టు పిప్పలములు కూడఁగూర్చి
ముద్దఁ జేసి వక్త్రమునఁ బెట్టుకొనిరేని
ముఖము రోగగంధములు హరించు.

తా.జాజిపత్రి, జాజికాయ, ఇంగువ, చంగల్వకోష్టు, పిప్పలి, వీనిని ముద్దగా జేసి పుక్కిట నుంచుకొనివ ముఖరోగదుర్గంధము లణగును.

శ్లో.విఘటయతి పూతిగంధమ్ ముఖగంధమ్ ఖాద్యమానమనుదివసమ్|
కటుతిక్త కషాయరసం తైలయుతం దంతధావనం పుంసామ్||

క.త్రికటుకము లనుదినంబును
బ్రకటకషాయమున నేయి భావన సేయన్
సకలముఖదంతధావన
సుకరంబై రోగ ముడిగి సురుచితఁ జూపున్.

తా.శొంఠి, పిప్పలి, మిరియాలు వీటిని కషాయము పెట్టి వేపపుడుకతో దంతధావన మొనరించి. అనంతర మాకషాయమును పుక్కిలించిన ముఖదుర్గంధ మణగును.

## కంఠస్వర మాధుర్య లక్షణము

శ్లో.జాతిఫలైలాపిప్పలిలాజకమధుమాతులుంగదళలేహః|
సతతాభ్యాసాత్కురుతే కిన్నరమధురస్వరం పురుషమ్||

గీ.జాజికాయలు పిప్పళ్ళు చంద్రబాల
బీజములు వట్టివేరులు బీజపూర
దళములను గల్పి చూర్ణము వెలయఁజేసి
కురుజునను దిన్న కిన్నెరస్వరము కలుగు.

తా.జాజికాయలు, ఏలకులు, పిప్పళ్ళు, వట్టివేరులు, మాదీఫలపుఁజెట్టు యాకులు వీటిని నలుగఁగొట్టి పురుషులు ప్రతిదినము తేనెతోఁ దినినయెడలఁ గిన్నరుల కంఠధ్వనివలె కంఠస్వరమాధుర్యమును గలిగియుందురు.

## శరీరకాంతి లక్షణము

శ్లో.తిలసర్వ పరజనీద్వయకుష్ఠకృతోద్వర్తనాని భజమానాః|
కాన్తిం హసన్తి హేమ్నో బిభ్రతి సౌరభ్యమధికం చ||

తే.తిలలు పసుపులు రెండు చెంగలువకోష్టు
సమముగాఁ దీసి పొడిఁ జేసి సారసాక్షు
లనుదినంబును నేతితోఁ దినిన యొడలు
స్వర్ణకాంతిని మించెడి చాయఁ దనరు.

తా.నువ్వులు, పిండిపసుపు, చాయపసుపు, చెంగల్వకోష్టు వీనిని నలుగఁ గొట్టి నేతితోఁ దినినయెడల హేమకాంతిగల దేహకాంతిని పొందుదురు.

శ్లో.నింబారగ్వధదాడిమ శిరీషకల్కైః సలోధ్రకైః స్త్రీణామ్|
రజనీయుతముస్తైః స్యాదంగానాం సుందరో రాగః||

క.దానిమ్మ ఱేల దిరిసెన
సూనము లొద్దుగయు వేపచూర్ణంబులలో
మానినులు పసుపుఁ గలిపియు
మేనుల నలదఁగ జిగియును మృదుతయుఁ గలుగున్.

తా.దానిమ్మ, ఱేల, దిరిసెనపువ్వు, లొద్దుగ, వేప, ఇవి నూరి పసు పులో గలిపి శరీరమునకు స్త్రీలు నలుగుపెట్టుకొనిన మంచికాంతియు మృదు వును గలుగును.

శ్లో.కృష్ణతిలకకృష్ణజీరక సిద్ధార్థజీరకైః సమం పాయసా|
లేపోఽతివదనసుభగోఽప్యంగకళంకం చ నాశయతి||

ఆ.నల్లజీలకఱ్ఱ తెల్లనియావాలు
జీలకఱ్ఱ తిలలు పాల నూరి
పడఁతిముఖము నలఁద వరకాంతి రెట్టించి
కందులేనిచంద్రు కరణి నొప్పు.

తా.నల్లజీలకఱ్ఱ, తెల్లనియావాలు, జీలకఱ్ఱ, నువ్వులు వీటిని పాలతో నూరి స్త్రీలు ముఖమునకు

నలుగు పెట్టుకొనిన చంద్రునివలె ప్రకాశించును.

శ్లో.అపనయతి బదరమజ్జా గుఢమధునవనీతసంయుతాప్యంగమ్|
లేపేన వరుణశల్కలమజ్జాక్షీరేణ పిష్టం వా||

శ్లో.లోధ్రవచాధాన్యాకైర్యౌవనపిటకాపహో లేపః|
గోరోచనాన్వితేన చ లేపో మరిచేన తాదృక్షః||

శ్లో.వితుషయవచూర్ణయష్టీమధుసితసిద్ధార్థలోధ్రలేపేన|
స్త్రీణాం భవన్తి నియతం వరకాంచనతుల్యాని వదనాని||

సీ.ఆవువెన్నయుఁ దేనె యంగూరయును రేఁగు
పండ్లగుజ్జునఁ బుచ్చి ప్రామిరేని
వరుణభూరుహముల వల్కలంబును మేఁక
పాలతోడను నూరి ప్రామిరేని
కొతిమెర వసయును గూర్చి లోధ్రను నీటఁ
బదునిచ్చి దళముగాఁ బ్రామిరేని
గోరోచనమ్మును గూడ మిర్యము నూరి
పలుచన పూఁతగాఁ బ్రామిరేని

ఆ.తేనె లోధ్రతరువు తెల్లనియావాలు
యవలపిండితోడ నలఁదిరేని
ముఖమునందుఁ గలుగు మొటిమలు గ్రంధులు
వాసి వన్నెగలుగుఁ బడఁతులకును.

తా.ఆవువెన్న, తేనె, అంగూరపండ్లగుజ్జు, రేగుపండ్లగుజ్జు ఇవి కలిపి ముఖమునకు నలుగు పెట్టినను, ఉలిమిరిచెట్టుయొక్క వేరునగల పట్టను మేకపాల తో నూరి నలుగు పెట్టుకొనినను, ధనియాలు వస లొద్దుగు వీటిని నీటితో నూరి నలుగు పెట్టుకొనినను, గోరోచనము మిరియాలు వీటిని కలిపి నలుగు పెట్టుకొని నను, తేనె లొద్దుగు తెల్లనియావాలు యవలపిండి వీటిని కలిపి నలుగు పెట్టుకొని నను ముఖమునందుగల మొటిమలు, గ్రంధులు, నశించి స్త్రీల మొగములకు చాయకలుగును.

శ్లో.పరిణతపటదళకాంచనపర్ణీ మధుకప్రియంగుపద్మానామ్|
సహదేవీహరిచందనలాక్షావాహ్లీకలోధ్రాణామ్||

శ్లో.సమభాగైర్జలపిష్టైర్విలాసినీనాం కరోతి నియతమయమ్|
అధరితశారదశశధరదీధితి ముఖపంకజం లేపః||

చ.సరసిజకేసరంబులును జందన కాంచన లోధ్ర బాహ్లీక
స్థిరతయుఁ బ్రేంకడంబు సహదేవియు లక్కయు యష్టియు న్దగు
న్గురుమతి నేకభాగముగఁ గూర్చి జలంబులఁ బోసి నూరి సుం
దరులకు మోమునందు నలఁద న్శుభకాంతి వహించు నెంతయున్.

తా.పద్మకింజల్కములు, గంధము, కోవిదారపర్ణములు, కుంకుమపువ్వు, మోరటి, సహదేవి, లక్క, అతిమధురము, లొద్దుగు వీటిని సమభాగములుగా చేర్చి నీరు పోసి నూరి ముఖమునకు నలుగు పెట్టిన మంచికాంతి జనించును.

## కుచోన్నతికరణోపాయ లక్షణము

శ్లో.శ్రోతోంజనతండులజలనస్యాభ్యాసేన భవతి యువతీనామ్|
రసికహృదయధనతస్కరమతివిపులోత్తుంగకుచయుగళమ్||

క.ఎసఁగన్ శ్వేతాంజనమును
బసకడుగును గుచములందుఁ బ్రామిన సతికిన్
రసికమనోభవతస్కరు
వసమగు చనుగవకు బిగువు వన్నెయుఁ దెచ్చున్.

తా.శ్వేతాంజనమును కడుగులో కలిపి చన్నులయందు నలుగు పెట్టిన చన్నులు వన్నెకలిగి బిగువు చెందును.

శ్లో.యువతివచాకటుకాన్వితకృతాంజలీరజనీతుల్యమాత్రాభిః|
గోమహిషీఘృతతుల్యం తైలం సంసాధితం విధినా||

శ్లో.కురుతే పరిణతవయసామపి వనితానాం త్రిసప్తరాత్రేణ|
స్థిరవిపులతుంగకఠినం స్తనయుగళం తస్య యోగేన||

ఆ.ఆవునేయి మహిషియాజ్యంబు నూనెయు
సమము చేసి దుగ్ధసహితముగను
నిరువదొక్కరాత్రు లింతులు విడువక
క్రోలఁ గఠినమగును గుచయుగంబు.

తా.ఆవునెయ్యి, గేదెనెయ్యి, నూనె ఇవి సమముగా కూడా సరాసరి యిరువదియొక్కరాత్రులు స్త్రీలు త్రాగినయెడల చన్నులు బిగువు చెందును. మఱియు మునగ, వస, కటుకరోహిణి, ముడుగుదామర, వీటిని పసుపుతో నూరి చన్నులకు బ్రామిన బిగువు చెందును.

శ్లో.గృహగతగోలాంగూలో నవనీతం భోజితస్సహరితాళమ్|
అథ తన్మలలిప్తకరో హరతి కుచం ముష్టిబన్ధేన||

గీ.పెంచుకొనునట్టి కోతికి వెన్నలోన
అరిదళము నుంచి తినిపించి నట్టి దినము
దానిమలమును మర్దించిరేని వెలఁది
యుబ్బుఁ గలిగిన కుచముల యుబ్బడంగు.

తా.పెంపుడుకోతికి వెన్నలో గలిపిన యరిదళ మిడి, పిదప దాని మలము చేతఁ బూసికొని మర్దించినఁ గుచముల యుబ్బణఁగును.

## అన్యోన్యప్రేమ లక్షణము

శ్లో.సురగోపభూమిలతయోశ్చూర్ణం యస్యా భగే నరః క్షిపతి|
స్తంభితశస్త్ర ఇవాఽఽజౌ తదితరపురుషో రతే తస్యాః||

క.జలగయు సూరగోపంబును
గలియఁగ మర్దించి భగముఖంబున నిడినన్
నళినముఖి యన్యపురుషుని
గలియక యెడమీక యోని గదియుచు నుండున్.

తా.జలగ, ఆరుద్రపురుగు, ఇవి చూర్ణము చేసి స్త్రీ యొక్క భగమునం దుంచిన యా స్త్రీభగము బిగువుకలిగియుండుటయేగాక పురుషునియందు ప్రేమ గలదై యితర పురుషులను వాంఛింపదు.

శ్లో.గగనసమాగతవల్గులివిష్ఠాలిప్తధ్వజేన యాం భజతే|
సకృదపి సా తదితరతో వాంఛాం దూరేణ పరిహరతి||

క.ఆకాశంబునఁ బారుచుఁ
గాకము రెట్టిడిన దానిఁ గామాగ్రమునన్
గైకొని కూడిన యప్డిఁక
నాకామిని యేలచొచ్చు నన్యులఁ గవయన్.

తా.ఆకాశమునందు పోవుచుండిన కాకి రెట్ట వేసినయెడల యా రెట్టను తన కామదండముచివరవలన గ్రహించి స్త్రీని రమించినయెడల నాస్త్రీ మఱి యొకపురుషునియం దనురాగము కలిగియుండదు.

శ్లో.తాం నిష్ఠాం పుటపాకే దుగ్ధ్వా సహ కాంజికేన భగలేపాత్|
భవతి కృతా ప్రకృతిస్థా రమణీ రమణీయతాభూమిః||

ఆ.పుటముఁ బెట్టి విష్ఠ బూడిదేఁ గావించి
కలినిఁ గలిపి యోనిఁ గలయఁబూయఁ
దొల్లియట్లయుండుఁ దొయ్యలిజఘనంబు
కాకిరెట్ట కదియె కడుగుమందు.

తా.పైన చెప్పినటువంటి కాకిరెట్టను పుటము బెట్టి కడుగులో కలిపి స్త్రీ యొక్క భగమునకు బూసి రమించినయెడల మఱియొకపురుషునియం దనురాగము కలిగియుండదు.

శ్లో.ఖరరేతోమిళితారుణముఖకపిరేతో విలిప్తరతినిలయామ్|
గత్వా న జాతు కామీ కామయతే కామినీమన్యామ్||

క.అరుణాననకపివీర్యము
ఖరశుక్లముఁ గూర్చి యోనిఁ గలయఁగఁ బూయన్
బురుషుఁడు రమింప వేఱొక
తరుణీమణి పొందుఁ గోరఁ దలఁపఁడు పుడమిన్.

తా.నల్లనిమొగముగలకోతియొక్క వీర్యమును, గాడిదయొక్క వీర్య మును కలిపి స్త్రీ భగమునకు పూసుకొని పురుషునితో రమించినయెడల నాపురుషు డింకొకస్త్రీని పొందుగోరడు.

## నపుంసక లక్షణము

శ్లో.షణ్ఢో భవతి నరోఽసౌ బహువారదళే ఖురే న ఖట్వాయాః|
యస్యాలక్తకపత్రే బద్ధ్వా నిక్షిప్తతే రేత||

క.ఏనరు శుక్లము మడుపుచు
మానిని సేలువుదళమున మంచముక్రిందన్
జానుగ లత్తుకటేఁకునఁ
దానూదిన విటుఁడు పందతనమును బొందున్.

తా.పురుషునియొక్క శుక్లమును బట్టి సన్ననిబట్టలో పెట్టి మడత వేసి ఆమడ తను తాము పండుకొను మంచముక్రింద యుంచినను, లేక యాతని శుక్లమును లత్తుక అకునం దుంచి మంచముక్రింద బెట్టి పండుకొనినను యాపురుషుడు నపుంసకు డగును.

శ్లో.అజమూత్రభావితం షడ్బిందురజోరజనిచూర్ణయుగమశితమ్|
ఉపనయతి నియతమచిరాన్నరస్య యూనోఽపి షణ్ఢత్వమ్||

ఆ.మేషరాజమూత్రమిళితషడ్బిందువు
దూదియందుఁ బసుపు ధూళిఁ గలిపి
పూవుఁబోఁడి యోనిఁ బూసి రమించిన
బల్లవుండు షండభావ మొందు.

తా.మేకపోతుమూత్రముచేత దూదిని తడిపి యాదూదిలో పసుపును గలిపి యాదూదిచేత స్త్రీయొక్క భగమును దుడిచియుంచినపుడు రమించిన పురుషుడు నపుంసకుడగును.

## పుంసకత్వ నాశన లక్షణము

శ్లో.సతిలం గోక్షురచూర్ణం ఛాగీచీరేణసాధితం మధునా|
సహ పీతం సప్తాహోచ్ఛమయతి షణ్ఢత్వమచిరేణ||

గీ.తిలలు పల్లేరుకాయలు కలియఁగూర్చి
మేఁకపాలును దేనెయు మేళవించి
యేడుదినములు సేవించిరేని నరుల
షండభావంబు మాను నిశ్చయముగాను.

తా.నువ్వులు, పల్లేరుకాయలు, ఇవి నూరి మేకపాలు తేనెతో కలిపి యేడుదినములు తినినయెడల నపుంసకత్వము పోయి పుంసకత్వము లభించును.

శ్లో.నరపార్శ్వస్థేనాస్థ్యా విద్ధం కరబాస్థి స్థాప్యతే యస్యాః|
శయనశిరోభాగే స్యాల్లగ్నత్వం తస్య రతికాలే||

క.లొట్టిపిట యెముకతోడను
గట్టిన నరుపార్శ్వపెముకఁ గంకటితలలోఁ
బెట్టి రమింపఁగ యోనిన్
బెట్టిన శిశ్నంబు తగిలి పెగలకయుండున్.

తా.లొట్టిపిట్టయెముక, నరుని ప్రక్కయెముక, యీరెంటిని కలిపికట్టి మంచము తలవైపున బెట్టి రమించిన రతియందు దండము పెగలకయుండును.

శ్లో.క్రియతే పేచకమేచకకాకాసృక్సర్పిషా యయోర్నామ్నా|
కోవిల్లకసమిదష్టోత్తరశరహోమో భవేద్ ద్వేషః||

శ్లో.కాకోలూకజరోమ్ణా హోమశ్చ మిథునయోస్తద్వత్|
అనయోరసృజా హోమో నామ లిఖిత్వా చ నిబందళైః||

శ్లో.మూషకమార్జాలద్విజదిగంబరాణాం చ రోమభిరపి|
క్రియతే యస్మిన్ వేశ్మని తత్రత్యానాం మిథో వైరమ్||

సీ.గూఁబ నల్లనికాకి కోవెల నయ్యాయి
నెత్తురులను గూడ నేయిఁ గలిపి
బూరుగుసమిధల పేరులుగా గ్రుచ్చి
వ్రేల్చినఁ బొడము విద్వేషమగును
గాకియాఁకలు గూఁబయాఁకలు వ్రేళ్ళతోఁ
బెనచినఁ బుట్టు విద్వేషమగును
గటికాకి గూఁబయాఁకల నెత్తుటను వ్రాసి
వేపాకువేల్వ విద్వేషమగును

గీ.విప్ర మార్జాల మూషక ద్విరదవదన
రోమముల ధూప మిడఁ బతి కామినికిని
బుట్టు నన్యోన్యవైరంబు లట్టు గానఁ
జతుర నాగార్జునోక్తసమ్మతము గాగ.

తా.గూబ, నల్లనికాకి, కోవెల, వీటినెత్తురులను నేతితో కలిపి బూరుగు సమిధలతో నష్టోత్తరశతహోమము చేసిన సతీపతుల కన్యోన్యవైరము కలుగును. కాకియాకలు, గూబయాకలు ఈరెండును వేళ్ళతో బెనవైచినను, నల్లకాకి, గూబ, ఈరెంటియాకలను నెత్తురులో ముంచి వేపాకుపై వ్రాసి హోమము చేసినను సతీపతుల కన్యోన్యవైరము లుద్భవించును. బ్రాహ్మణుడు, పిల్లి, యెలుక, ఏనుగు వీటియొక్క ముఖములనుగల వెంట్రుకలను దెచ్చి ధూపము వేసిన సతీపతుల కన్యోన్యవైరము కలుగును.

## అన్యోన్యప్రీతి లక్షణము

శ్లో.సురతరుతగరవచాగురుమృగమదమలయజరసైః|
ధూపో వేశ్మని విహితః పరస్పరం ప్రీతిమాతనుతే||

క.సురతరు తగరంబు వసా
గరు కస్తురి నెయ్యి మంచిగంధము మరుమం
దిరమున నిల్పిన యప్పుడె
పరమంబగు ప్రీతికలుగుఁ బతికిన్ సతికిన్.

తా.దేవదారు, గ్రంధితగరము, వస, అగరు, కస్తూరి, నేయి, మంచిగం ధము, ఇవి మర్మస్థానమున నుంచినయెడల సతీపతుల కన్యోన్యమగు ప్రేమ జనించును.

## నాగార్జున యోగములు

శ్లో.నాగార్జునేన కథితా యోగా బహవశ్చతుర్దశద్రవ్యైః|
దృష్టఫలాన్ ప్రకృతానిహ యోగాంస్తత్రోద్ధరిష్యామః||

వ.నాగార్జునుఁడను సిద్ధుఁడు పదునాల్గుద్రవ్యములతోడి పెక్కుయోగములు ప్రత్యక్షానుభవదృష్టములఁ దెల్పియున్నాఁడు, వానిని వివరింతును.

శ్లో.భృంగరజోమోహలతే మోహయతస్తిలకతో విశ్వమ్|
అజకర్ణ్యా సరుదన్త్యా సహ సహదేవ్యా చ లజ్జాళుః||

గీ.గుంటగలిజేరు నుమ్మెత్త రెంటిచూర్ణ
మాస్యమున నుంచికొనిన మోహంబుఁ జేయు
అటులె నజకర్ణి లజ్జాళు వల రుదన్తిఁ
గలియు సహదేవి వశ్యంపుతిలక మగును.

తా.గుంటగలిజేరుపొడి, ఉమ్మెత్త యీ రెంటిని తిలకమును బెట్టిన లోక మెల్లను మోహింపఁజేయును. సహదేవీసహితమైన లజ్జాళువు రుదన్తీ సహితాజ కర్ణ మిశ్రితమైన తిలకమున నట్లచేయును.

## వశీభావ లక్షణము

శ్లో.శిఖిశిఖయాంఽజారికయా సహితే సురవారుణీకృతాంజల్యౌ|
భగనిహితే భామిన్యా దాసీభావం చ దాసతాం పుంసః||

గీ.నెమిలిపించెముఁ గప్పయు నెలఁత నూరి
దాని సురవారుణిని గూర్చి యోనిఁ బూసి
సురత మొనరింప దంపతు లిరువు రొకరి
కొకరు వశులౌచు వర్తించుచుందు రవని.

తా.నెమలిపించెమును కప్పయు సురవారుణియు కలియనూరి యోని నునిచిన స్త్రీపురుషులు పరస్పరవశులయి యుందురు.

శ్లో.భృంగరజోలజ్జాళుకహరజటధవళకిలేపతో వపుషః|
క్రాన్తాసితార్కపుంజరిహరజటగుళికా వశీకురుతే||

క.కలయగరయు మణుఁగుఁదామర
వెలిజిల్లెడు రుద్రజటయు విష్ణుక్రాంతా
వళియును బాపరవేరును
గుళిగలు భగలేపవశ్యగుణములు సేయున్.

తా.కలగర, ముణుగుదామర, తెల్లజిల్లేడు, రుద్రజడ, విష్ణుక్రాంత, వీటివేరులును, పాపరవేరును కలియనూరి మాత్రలు చేసి యోనియందు బూసు కొనిన స్త్రీపురుషులు పరస్పరము వశులయి యుందురు.

శ్లో.గోచన్దనాజకర్ణీరుదన్తికాకన్యకాభిరిహ విహితః|
భగలేపో మరణాన్తం స్త్రీణాం ప్రేమప్రసాధయతి||

శ్లో.లజ్జాళుకసహదేవీకన్యాగోరోచనోద్భవం చూర్ణమ్|
తాంబూలేన వికీర్ణం నార్యా పరమం వశీకరణమ్||

శ్లో.విష్ణుక్రాన్తాసితరవిక్కృతాంజలీశిఖిశిఖామిరాలేపః|
వనితాపరాంగవివరే ద్రావణమంగే వశీకరణమ్||

సీ.ద్రాక్షాఫలమును రుదంతియుఁ దెల్లగం
టెనయుఁ గన్యకుమారియును ఘటించి
భగలేపనము సేయఁ బ్రాణాంతవశ్యమై
స్త్రీపురషులఁబ్రేమ సిద్ధిఁ బొందు
గోరోచనము కన్యకొమరిమూలము పొత్తి
తామర సహదేవి తనర చేర్చి
చూర్ణించి విడెమునఁ జొనపిన నన్యోన్య
వశ్యుంబలంటు నెవ్వారికైన

ఆ.ధవళరవియు ముడుఁగుఁదామర శిఖియును
విష్ణుక్రాంత గూర్చి వెలఁదులకును
యోనిఁ బూయ నుదక ముదయించిఁ దనువున
నలఁదిరేని మోహ మతిశయిల్లు.

తా.ద్రాక్షపండు, రుదంతివేరు, తెల్లగంటెనవేరు, కన్యకుమారివేరు, వీటివి నూరి భగలేపన మొనర్చిన మరణాంతమువరకు, వశులయియుందురు. గోరో చనము, కన్యకొమరి, పొత్తితామర, సహదేవి, వీటిని చూర్ణము చేసి విడెమున బెట్టిన సతీపతుల కన్యోన్యవశీకరణమగును. తెల్లజిల్లేడు, ముడుగుదామర, చిత్రమూ లబు, విష్ణుక్రాంతఁ వీటిని నూరి స్త్రీలకు భగమునకు పూసిన ద్రవముపుట్టును, శరీరమున బూసిన మోహము పెరుగును.

## బీజస్తంభన లక్షణము

శ్లో.భృంగరజః కన్యాభ్యాంవిష్ణుక్రాన్తాసజాతికామిళితా|
సా ముఖఘృతగుటికా వా బీజస్తంభం రతే కురుతే||

గీ.కలగరయు జాజియును విష్ణుక్రాంత కన్నె
కొమరివేరును గలనూరి గుళికఁ జేసి
యదియె పుక్కిట నిడుకొని యతివఁ గవయఁ
బడదు శుక్లము నెటువంటి పందకైన.

తా.గుంటగలగర, జాజికాయ, విష్ణుక్రాంతి, కన్నెకొమరివేరు, వీటిని నూరి మాత్ర చేసి యామాత్రను పుక్కిట బెట్టుకొని స్త్రీని రమించిన యెటువంటి పందకయినను వీర్యము స్తంభించును.

## భగసౌభాగ్యలక్షణము

శ్లో.విష్ణుక్రాన్తాహరజటభృంగరజోభిస్సమేతసహదేవ్యా|
స్మరసదనవిలేపనతః సౌభాగ్యం దుర్భగా లభతే||

క.హరిక్రాంతయుఁ గలగరయును
హరజట సహదేవియాకు నన్నియుఁ గలియన్
స్మరమందిరమున నలఁదినఁ
దరుణికి సౌభాగ్యమహిమ దలకొనియుండున్.

తా.విష్ణుక్రాంత, గుంటగలగర, రుద్రజడ, సహదేవియాకు, ఇవి నూరి భగమునకు బూసినయెడల భగసౌభాగ్యమును గలిగియుండును.

## గర్భధారణ లక్షణము

శ్లో.గోచన్దనదణ్డోత్పలవిష్ణుక్రాన్తాకృతాంజలీచూర్ణమ్|
రజసి స్నాతాపీత్వా గర్భం వహేత వన్ధ్యాఽపి

ఆ.ద్రాక్షపండు ముణుఁగుఁదామర దండోత్ప
లంబు విష్ణుకాంతలఁ దగఁగూర్చి
నాలుగవదినంబు పాలతో సేవింప
గర్భమౌ నిఁకెట్టి కాంతకైన.

తా.ద్రాక్షపండు, ముణుగుదామర, దండోత్పలము, విష్ణుక్రాంత, ఇవి నూరి స్త్రీ ముట్టయిన నాలుగవదినమున పాలతో తినినయెడల స్త్రీకి గర్భోత్పత్తి యగును

## సుఖప్రసూతి లక్షణము

శ్లో.సరుదన్త్యా శిఖిశిఖయా పుత్రంజాతీకుమారికే మిళితే|
గుహ్యే నిధాయ ధత్తే సుఖసూతమ్మూఢగర్భాఽపి||

ఆ.భూజనారి శిఖియుఁ బూతిగడ్డయుఁ గల
బందయును రుదంతి చెందనూరి
యోనిలోనఁ బెట్ట యుగ్మలి గుహ్యంబు
వదలి కొడుకుఁ గాంచు వైళమునను.

తా.భూజనవైరి, చిత్రమూలము, పూతిగడ్డ, కలబంద, రుదంతి ఇవి నూరి ప్రసవము కాజాలని స్త్రీభగములోన బెట్టిన సుఖప్రసూతియగును.

శ్లో.సరుదన్త్యా హరజటయా సహ సహదేవ్యా చ శిఖిశిఖయా|
కృతలేపస్య శరీరే సమస్తకార్యాణి సిధ్యన్తి||

క.హరజటయును సహదేవియు
సురనారియు శిఖి రుదంతి సొరిదిఁ గలియఁగాఁ
బురుషులు తరుణుల నలఁదిన
స్థిరతనువులు వశ్యసౌఖ్యసిద్ధులఁ బొందున్.

తా.రుద్రజడ, సహదేవి, సురనారి, చిత్రమూలము, రుదంతి, ఇవి కలియ నూరి స్త్రీపురుషులు పరస్పరము దేహములకు బూసుకొనిన బ్రతికియున్నన్నిదిన ములు వశ్యసిద్ధియు సౌఖ్యసిద్ధియు గలుగును.

## ఉపసంహారము

మాలిని. ప్రకటితభుజలీలా భ్రాతృమిత్రానుకూలా
సుకవిజనవిలోలా సువ్రతాచారపాలా
వికచనయనబాలా వేషసౌభాగ్యశీలా
సకలగుణవిశాలా సజ్జనారామహేలా.

శ్లో.ఉద్భూతః పారిభద్రాదమరనరఫణిప్రేయసీగీతకీర్తేః
నప్తా తేజోకనామ్నస్సుదసి బహుమతః పణ్డితానాం కవీనామ్|
ఏతచ్ఛ్రీగద్యవిద్యాధరకవితనయః కామకేళీరహస్యం
కొక్కోకః కాముకానాం కిమపి రతికరం వ్యాకరోత్కౌతుకేన||

ఇతి శ్రీసిద్ధపండిత కొక్కోకకవి విరచితే రతిరహస్యే
సకలస్త్రీప్రస్తావభేదయోగోనామ
పంచదశః పరిచ్ఛేదః
సమాప్తోఽయం గ్రన్థః

గద్యము
ఇది శ్రీమదష్టభాషాకవితాప్రవీణ నవఘంటాసుత్రాణ మాచనామాత్యపుత్త్ర
సుజనకవిమిత్త్ర సజ్జనవిధేయ యెల్లయనామధేయ
ప్రణీతంబైన కొక్కోకంబను గళాశాస్త్రంబునందుఁ
సర్వంబును తృతీయాశ్వాసము
సంపూర్ణము

# తుదిపలుకు

కామోపాయ నియమములను గ్రహింపని పురుషుడు సతిని సంతోషపెట్ట జాలడు. అందువలన నాస్త్రీకి గామోద్రేకము కలిగి చంచలహృదయయై వ్యభిచరించుటకు గారణమేర్పడుచున్నది. కావున గామమనుభవించు గృహస్థులీ కామశాస్త్రమును దప్పక గ్రహింపవలెనను మాయుద్దేశము సర్వజనాదరణీయమగును గాక. ఈ యుద్దేశము తోడనే యీ గ్రంథకర్తయగు కొక్కోకుడు:-

శ్లో.ఆసాధ్యాయాః సుఖం సిద్ధిః, సిద్ధాయాశ్చానురంజనమ్।
రక్తాయాశ్చ రతిస్సమ్యక్కామశాస్త్ర ప్రయోజనమ్॥

అని యీ గ్రంథముయొక్క ప్రయోజనమును నుడివెను. మఱియు రుద్రకవి "స్మరదీపిక" యందు —

శ్లో. స్వనారీరక్షణం పుంసాంస్త్రీణాం చ తదనంతరం।
బంధభేదేంగితజ్ఞాన మేతత్ఫలముదాహృతం॥

అని కామశాస్త్రావసరమును జాటెను గాన సహృదయులు సాదరమున నీశాస్త్రము నాచరింతురని తలంచుచున్నారము.

ఈ గ్రంథ సంపాదన కొరకాంధ్రదేశమున బర్యటన మొనర్చి వ్రాతపతులను సంపాదించునపుడొక శ్రీమంతుడు "ఓరియంటల్ ఆర్టు" అనబడు ప్రాచ్య చిత్రకళా లేఖనములగు చౌశీతిబంధముల సంపుటమును మాకొసంగి "దేశమున గామము సేవింప నేర్పరులు కాని పురుషులధికముగా నుండుట వలన స్త్రీలలో జాలమంది వ్యభిచారిణులగ పడుచుండి" రని తన యభిప్రాయమును మాతో వెల్లడించెఉ. ఈ యుద్దేశము కూడ నందరంగీకరింతురని తలంతుము. విద్యావిహీనులీ కామసేవను గ్రహింపవలెనను దలంపుతోడనే బవిత్రస్థలములని పలువురు చేరెడి దేవాలయాది కట్టడముల యందు నీబంధముల బ్రతిమలను బూర్వులు నెలకొల్పిరి. కావున మేమీ గ్రంథమును జిత్రపటశోభితము గావించితిమి. ప్రస్తుత మాశ్రీమంతు డొసంగిన "చౌశితిబంధముల సంపుటము" లోని నలుబదిరెండు చిత్రము లీగ్రంథమున కనుబంధముగా ముద్రించితిమి. కడమ నలుబదిరెండును "ఆంధ్ర రతిరహస్యము"న కనుబంధముగా బ్రకటింప దలచితిమి. కానీ మా యశ్రద్ధ వలన చెదపురుగుల పాలాయెనని శృంగారపంచకముననే దెల్పియుంటిమి.

తమ తాతముత్తాతలనాటి నుండియు భద్రముగావించి కాపాడుచుండిన ప్రాచ్యచిత్రకళాలేఖనములగు "చౌశీతిబంధముల సంపుటము" నిచ్చిన యా శ్రీమంతులకు గృతజ్ఞతను దెలుపుచున్నారము.

ఇట్లు, ప్రకాశకుడు,
"కామగ్రంథమాల"